# విషయానుక్రమణిక

## డిసెంబరు 1960

# వార్తలు

## శ్రీనాథ మహాకవిపై సారస్వత గోష్ఠి

నవంబరు 23 వ తేదీన ఆంధ్రప్రదేశ్ రాజధానిలో శ్రీనాథ మహాకవినిగూర్చి సారస్వతగోష్ఠి జరిగింది. శ్రీ తాపీ ధర్మారావు దీనికి ప్రారంభోత్సవం జరిపారు. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం ఈ సమావేశాని కధ్యక్షత వహించారు. శ్రీమతి విజయభారతి శ్రీనాథుని సమకాలిక రాజకీయ సాంఘిక పరిస్థితులపై తాము రచించిన ప్రత్యేక వ్యాసం చదివారు.

## టైరోస్ ఉపగ్రహం

నవంబరు 23 వ తేదీన అమెరికా 'టైరోస్' అన్న ఉపగ్రహం భూకక్ష్యలోనికి ప్రయోగించింది. దీనితూకం 280 పౌనులు. ఇది భారత భూభాగంమీద దాదాపు 15 దేశాలకు సంబంధించిన వాతావరణ సమాచారం సేకరించగలదు. ఈ ఉపగ్రహానికి టెలివిజన్ కెమెరాలు, ట్రాన్స్‌మిటర్లు, ఇన్‌ఫ్రా రెడ్ నేత్రాలు అమర్చారు. ఇది ప్రతి నూరునిమిషాలకు ఒకసారి భూప్రదక్షిణం చేస్తుంది. మేఘాల ఆవరణాలు మొదలయిన సమాచారాలు ట్రాన్స్‌మిటర్లద్వారా పంపిస్తుంది.

## వికాసభారతం కృతిస్వీకరణ

శ్రీ కొట్టెపాటి సుబ్బారాయలు, తాము రచించిన వికాసభారతం ఆదిపర్వం ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్యగారికి అంకితం ఇచ్చారు. ఈ సమావేశం 25 వ తేదీ సాయంకాలం అనంతపురం కాంగ్రెసు భవన ప్రాంగణంలో జరిగింది. సభకు పుర ప్రముఖు లనేకులు విచ్చేశారు.

శ్రీ బోయి భీమన్న ఈ సభకధ్యక్షత వహించారు. శ్రీ నండూరి రామకృష్ణమాచార్య, శ్రీ అరిపిరాల విశ్వం, శ్రీ పోతుకూచి సాంబశివరావు, శ్రీ కల్లూరి సుబ్బారావు కృతిని, కృతిపతిని గూర్చి ప్రసంగించారు.

## మద్రాసునగరంలో తుపాన్ బీభత్సం

మద్రాసు నగరంలో ఇంచుమించుగా నవంబరు 1 వ తేదీనించి ప్రారంభించిన వాన క్రమక్రమంగా పెద్ద గాలివానగా పరిణమించి 20 వ తేదీ మధ్యాహ్నం 1 గంటకు 90 మైళ్ళ వేగంతో నగరంలో చాలాచోట్ల పెద్దపెద్ద వృక్షాలు కూల్చివేసింది. చాలా భవనాలు బాగా దెబ్బలున్నాయి. టెలిఫోన్ స్తంభాలే విరిగిపడి పోయాయి. గోడలు మొదలయినవి కూలడంవల్ల 3 గురు మరణించారు. 12 గురికి బలంగా గాయాలు తగిలాయి. చాలాచోట్ల రాకపోకల కవరోధాలు కలిగాయి.

## హైదరాబాదు స్త్రీ పోలీసుల దళం

హైదరాబాదు నగరంలో స్త్రీ పోలీసుల దళం ఏర్పరిచారు. దీనిలో ఒక సబ్ ఇన్‌స్పెక్టరు, ఆరుగురు హెడ్ కానిస్టేబుల్సు, 32 గురు కానిస్టేబుల్సు పనిచేస్తున్నారు.

స్త్రీలను సోదా చెయ్యడానికి, ఆడవారు నేరస్థులుగా ఉన్న కేసుల దర్యాప్తులకు వీరిని వినియోగిస్తారు.

## హిమాయత్ నగర్‌లో

## పశు ప్రదర్శన పోటీ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పశుగణాభివృద్ధిశాఖ అధ్వర్యంలో పంచాయతీ సమితి కార్యాలయం ఆవరణలో పశుప్రదర్శనలో పోటీ నిర్వహించారు.

50 గ్రామాలకు సంబంధించిన 3 వేల పశువులను ఈ పోటీకి తీసుకొనివచ్చారు. శ్రీ జి. రామిరెడ్డి ఆబోతు బాగా ప్రేక్షకులను నాకర్షించింది. పరిశీలకులు దానికే మొదటి బహుమతి నిర్ణయించారు.

సాయంకాలం జిల్లాపరిషత్ అధ్యక్షుని అధ్వర్యంలో జరిగినసభలో 4 వందలరూపాయల విలువగల బహుమతులు ఆయావ్యక్తులకు బహూకరించారు.

## జపాన్ రాజకుమారుని భారత పర్యటన

నవంబరు 27 వ తేదీన జపాన్ రాజకుమారుడు శ్రీ అకిహిటో అడిన్ అబాబా నుంచి సతీసమేతులై ప్రత్యేక విమానంలో బొంబాయి చేరుకొన్నారు.

బొంబాయిలో జపాన్ దేశీయులు అనేకులు విమానాశ్రయానికి వచ్చి రాజకుమార దంపతులకు స్వాగతపత్రం సమర్పించారు. జపాన్ భారత్ పతాకాలతో విమానాశ్రయం చూడముచ్చటగా అలంకరించారు.

## జాన్ కెనడీ ఘనవిజయం

అమెరికా నూతన అధ్యక్షులుగా శ్రీ జాన్ కెన్నడీ ఎన్నికయినారు. ఈయన డెమాక్రటిక్ పక్షనాయకులు. వీరి వయసు 43 సంవత్సరాలు. అమెరికాలో గల మొత్తం 50 రాష్ట్రాలలోను, కీలకస్థానాలయిన న్యూయార్క్, పెన్సిల్‌వేనియా, టెక్సాస్ లలో వీరికి ఓట్లలో అత్యధికమైన సంఖ్యాబలం చేకూరింది.

# సంగీతవృత్తము

## శ్రీ బాలగంగాధర తిలక్

ఒక సంగీతము లోనలోనొదిగి ఏదో బాధగా తీయగా
ఒక చాంపేయ పరీమళానిల తరంగాలోలమై, నూత్నయౌ
వని శృంగార పదాభిరామ విలసన్మంజీర నిక్వాణమై
ఒక హేమంత రహోనిశన్ కురియు రాకా కౌముదీవర్షమై

ఒక కాంతామధుమత్త యౌవనవతీ ఊహారసాంబోధి వీ
చికమై శైలవిశాల సానుతట రమ్యాంభోద మాలా చల
చ్చపలా నవలాస్య సల్లు గమనమ్మై ప్రాతరున్మీల ప
ద్మిని పత్రాగ్రములందు విచ్చు హిమభాషాస్వప్న సంకేతమై.

ఒకసాయం గగనారుణాంబుదపుటంచుల్ రెక్కలం దూసి చీ
కటి బాణమ్ములు వచ్చు డేగవలెనై కన్దోయి కల్లల్ల దూ
రపు కొండల్ అరవిచ్చు చుక్క చెలి సింగారించు లేనవ్వు పి
ల్పయి ప్రత్యగ్ర మధూత్సవాభిరత లీలాభృంగ కల్హారమై.

ఒక బాధాగ్రథితమ్ము పాండురకపోలమ్మందు కేలూని వె
చ్చన నిట్టూర్చెడి మాతృమూర్తి నయనార్ణోరాశియై, ఆత్మ హ
త్యకు నుంకించెడి భాగ్యహీనుని మనశ్శైథిల్యతా చిత్రమై
ఒక దూరాధ్వమునందు ఎద్దుమెడ మువ్వల్ మ్రోగుచున్నట్టులై.

ఒక నిశ్శబ్ద భయాంధకారవిపినమ్మంతటన్ రేగు దు
ర్జన వాంఛాజ్వలనోగ్రకీలలవలెన్ రాత్రిందివామధ్య రే
ఖా కిర్మీర విచిత్ర జాగృతియునై ఉన్మత్త రాత్రించరత్
పతిత ప్రాణిసమూహ హృద్ధమనికాస్పందజ్వరాక్రోశమై.

ఒక తెరవేదో విచ్చుకొని ఉన్నత దివ్య నగాంచల స్థిత
మ్మగు గుడిలోని దైవపద సన్నికటాద్భుత ధూపదీప కాం
తుల కడకేగి లీనమయినట్టుల; ఒక్క మయూరబర్హ సుం
దరతరమౌళి మోహనుడు దవ్వుల గానము చేసినట్టులై.

ఒక జన్మాంతర చిత్ర సంస్మృతివలెన్ లోలోన మత్ జీవనాం
తర గాఢాంధ్యమునన్ హఠాత్ జ్వలిత దీపశ్రేణి వోలెన్ మరే
మియొ నాతనువెల్ల సౌరభములోనన్ చుట్టినట్లయ్యె కై
తక కుంజాంతర నిత్యవాసిత మహావ్యాళమ్ము లీలాకృతిన్.

# 'తప్పుల తడికె' శాసనము?

## శ్రీ ఆరుద్ర

తెలుగు దేశంలో విరివిగా ప్రచారంలో నున్న గాథలలో కాటమరాజు కథ ఒకటి. గ్రామీణులకు రామణీయకంగా వీనుల విందుచేసే ఈ వీరగాథ ఆంధ్ర యాదవులకు వేదం లాంటిది. లోకుల రసనలే తాటాకులుగా ఇది జీవిస్తోంది. ప్రజలలో ఇంత బహుళ ప్రచారం గల దీనికి చారిత్రక గౌరవం మాత్రం ఇంకా లభించనే లేదు. చాలకాలందాకా అచ్చు పడనేలేదు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పుణ్యమా అని దీనిని మదరాసు ప్రాచ్యలిఖితగ్రంథాలయంవారు ప్రచురించారు.

సాధారణంగా ప్రభాకర శాస్త్రిగారు పరిష్కరించి పీఠిక వ్రాసిన గ్రంథాలకి సాహిత్యంలో విశిష్ట స్థానం లభిస్తుంది. అసలు గ్రంథాలకన్నా, వారి పీఠికలనే ఆంధ్రసాహిత్యాభిమానులు ఎక్కువగా ఆదరిస్తారు. అవి పీఠికలు కావు; లెక్కలేనన్ని మారుమూల విషయాలు చక్కగా సేకరించి భద్రపరచిన పేటికలు. అవి పీఠికలు కావు; వివిధ నైసర్గిక కుసుమాలు ఫలించే సాహిత్యోద్యానవాటికలు. శాస్త్రిగారు ఏ గ్రంథానికి పీఠిక వ్రాసినా దానిని గురించి కూలంకషంగా మథించి ఈవిషయంలో 'ఇంకేం చెప్పడానికి లేదు' అనేటంత ప్రామాణికంగా వ్రాస్తారు. అయితే కాటమరాజు కథని వారు పరిష్కరించారే గాని పీఠిక వ్రాసేలోగా పరమపదించారు. అందుచేత మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయం వారి కోరికమీద శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు దీనికి పీఠిక వ్రాశారు.

కాటమరాజు కథకి చారిత్రిక గౌరవాన్ని యివ్వగలిగిన శాసన మొకటుంది. అది నెల్లూరు జిల్లా కందుకూరు తాలూకా గుండ్లపాలెము గ్రామములోని బ్రహ్మేశ్వరస్వామి ఆలయమువద్ద నున్న శిలమీద చెక్కినది. బట్టర్ వర్త్, వేణుగోపాల్ చెట్టిగార్లు సంపాదించి ప్రకటించిన నెల్లూరుమండల శాసన సంచయం రెండవ సంపుటిలో దీని పూర్తిపాఠం నోట్సుతో బాటు ప్రచురించారు. దీనిని తమ పీఠికలో పొందుపరచి శ్రీ మల్లపల్లి సోమశేఖర శర్మగారు ఇలా వ్రాశారు,

"ఈ శాసనము తప్పుల తడికె. దీనిలో కొంత పద్యములలో నున్నట్టులున్నది. మరల ప్రతిబింబము దీసి పరిశీలించిన గాని ఈ శాసనమును బరిష్కరించుట కష్టము."

ఈ మాటలు చాలవరకు నిజమేగాని, మళ్ళా ప్రతిబింబం తీయనక్కర లేకుండానే, కొద్దిగా శ్రమపడితే, బాగా పరిశోధిస్తే, ఈ శాసనాన్ని పరిష్కరించవచ్చునని సవినయంగా మనవి చేస్తున్నాను. దీనిని అంత సులభంగా కొట్టి పారేయ కూడదు.

ఇదే శాసనాన్ని యథాతథంగా, శ్రీతిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు, 'ఆంధ్రపత్రిక-విజయ సంవత్సరాది సంచిక'లో కాటమరాజు కథమీద, తమ గురుదేవులు శ్రీ ప్రభాకరశాస్త్రిగారిని తలపించేటంత విపులంగా వ్యాసం వ్రాస్తూ ఉదాహరించారు. వారు ఇలా వ్రాశారు:

"ఈ శాసనము ఎఱగడ్డపాటి పోట్లాట పుక్కిటి పురాణము కాదనియు, చారిత్రక సత్యమేయనియు ఋజువు పఱుపజాలి యున్నదనుటకు సందేహములేదు."

అయితే సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు సోమశేఖరశర్మగారు తమపీఠికలో యింకా ఇలా వ్రాశారు:

"ఆ శాసనమంతయు యాదవవంశమునకు చెందిన పురాణగాథ. వైశంపాయనుడు పరీక్షిత్తునకు తెలిపినట్లున్నది. చారిత్ర దృష్టిలో చూసినయెడల ఈ శాసనము పుక్కిటిపురాణ మగుటచేత విలువైనది కాకపోయినను యాదవవంశ గాథను దెలుపుటచేతను కాటమరాజు కథకు సంబంధించిన దగుటచేతను దాని పాఠము నున్నదున్నయట్లు ఈ క్రింద పొందుపఱచుచున్నాను."

చూసీ చూడగానే ఈశాసనం పుక్కిటి పురాణమనీ, తప్పుల తడికె అనీ అనిపించకపోదు. మొదటి రెండు మూడు పంక్తులు చదవగానే దీనిపట్ల సాహితీ

పరులకు సానుభూతి కలగదు. ఆ పంక్తులు ఉదాహరిస్తాను.

1. యాదవ జల్మం వైశంపా
2. యండు పరీక్షిత్తుకు యి
3. ట్లనియె.

ఇది తప్పు. మహాభారతాన్ని వైశంపాయనుడు జనమేజయునికి చెప్పాడు. శుకయోగి భాగవతాన్ని పరీక్షిత్తుకు చెప్పాడు. గానీ ఈ శాసనంలో వైశంపాయనుడు పరీక్షిత్తునకు చెప్పినట్లు ఉట్టంకించాడు గనుక శాసన మంతా తప్పుల తడికె అనడానికి వీలు లేదు.

ఈ శాసనం వ్రాయించిన దేవరో కొండయ్య కొడుకు రామయే గాని ఈ పురాణమో, పుక్కిటిపురాణమో అతని స్వకపోలకల్పితమని మనం భావించ కూడదు. పుక్కిటిపురాణాలు పుట్టడానికి కూడా ఏవో ఆధారా లుంటాయి. మనం కొంచెం సానుభూతితో. అర్థం చేసుకోనడానికి ప్రయత్నిస్తే ఇటువంటి 'పామరుల' చెయిదాలుకూడా తమ రహస్యాలు చెప్పేస్తాయి.

ఈ తప్పులతడికె శాసనంలోని పుక్కిటి పురాణానికి ఆధారాలేమిటి.?. ఆ సంగతి శాసనంలోనే ఉంది. "వీరుల మహాత్వం ఆదిపర్వం సకలభూతసంభవ అను శాసనిక భాగవత దశమస్కంధ మవుసలాస వెళ్ళిన శాస్త్రనర్మమిది" అని శాసనకర్త చెప్పాడు. శాసనాన్ని మొదటి, సారిగా ప్రచురించిన బట్టర్ వర్తు వేణుగోపాల చెట్టిగార్లు తమ నోట్సులో మొట్టమొదట "The first part or this inscription consists of extracts from the Telugu Bharata and Bhagavata" అని చెప్పనే చెప్పారు.

ఈ శిలాశాసనం మొదటిప్రక్కనున్న కొన్ని పంక్తులూ, నన్నయ్యభట్టు ప్రణీతమైన ఆదపర్వంలోని వచనాలు తైపారువేస్తే కొండయ్య కొడుకు రామయ్య చెక్కించిన పుక్కిటి పురాణం నన్నయగారి పుక్కిట పుట్టినదనే తేలుతుంది.

3. ...అధితికి కశ్యపునకు పుట్టి
4. న వైవస్వతుండను మనువునకు
5. యెముండును శనేశ్వరుం
6. డ్డును యెమునయుం దపతియుం
7. బుట్టె రందు వైవస్వతుండను మను
8. వువలన బ్రహ్మక్షత్రియ వైశ్య సూ
9. ద్రులైన మానవులు అనేకులు పు
10. ట్టిరి వారికి శేనప్రముఖులైన రాజులు
11. యనమండ్ర పుట్టిరి. ఆ మునిపుత్రి ఐ
12. న యిల గన్య సోమపుత్రుండైన బుధు
13. నకు పురురవ చక్రవర్తి పుట్టె

శాసనంలోని ఈ పంక్తులు ఆదిపర్వంలోని ఒక వచనం ఆధారంగా తీసుకొని వ్రాసినవే. నన్నయ్యగారి వచనం చూడండి.

"(అది యెట్లనినం దొల్లి దాక్షాయణి యైన) యదితికిం గశ్యపునకుం బుట్టిన (వివస్వంతునకు) వైవస్వతుండను మనువును1 యముండును శనైశ్చరుండును యమునయుం దపతియుం (ననం) బుట్టి రందు వైవస్వతుండను మనువువలన బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రాదులైన2 మానవులు3 పుట్టిరి (మఱియు) వానికి4 వేన ప్రముఖులైన రాజు లేబండ్రు5 పుట్టి (వంశకరులై తమలోన యుద్ధము సేసి చని) రి (మఱియు) నమ్మను పుత్రి6 యిల యనుదానికి7 సోమపుత్త్రుండైనబుధునకుం బురూరవుండు8 పుట్టె9 (చక్రవర్తియై).

[ఆది. 3-89

ఈ వచనంలో బ్రాకెట్లలో చూపించిన భాగాలు శాసనంలోలేవు. వచనంలో అక్కడక్కడ అంకెలతో మార్కు చేసిన మాటలు క్రమంలో ఇలాగ మారాయి.

1. మనువునకు
2. సూద్రులైన
3. మానవులు అనేకులు
4. వారికి
5. ఎనమండ్ర
6. ఆ మునిపుత్రి
7. ఇల గన్య
8. పురూరవ చక్రవర్తి
9. పుట్టె.

ఆదిపర్వంలోని అదే ఆశ్వాసంలోని యింకో వచనం ఆధారం చేసుకొని మరికొన్ని పంక్తులు శాసనకర్త వ్రాయించాడు.

13. ...... పురూరవు
14. నకు పూర్వశిసికి నాయువుండు పుట్టెనా
15. యువునకున్ స్వర్భానుయునకున్

నభిషుండు పు

16. ట్టి రాజ్యంబు సేశె.

ఈ భాగానికి ఆంధ్ర మహాభారతం ఆదిపర్వం తృతీయాశ్వాసంలోని 92 వ నెంబరుగల వచనంలోని కొంతభాగం ఆధారం. చూడండి :

"......పురూరవునకు నూర్వశికి నాయువు (ధీమంతుడు నమావసువు దృఢాయువు వనాయువు శతాయువు నను నార్వురు గొడుకు పుట్టిరం] దాయువు నకు స్వర్భానవి [యను దానికి నహుష వృద్ధశర్మ రజి గయానేనసు లనగా నేవురు పుట్టిరి. వారియందు నహుషుండు రాజ్యాభిషిక్తుండై...]"

[ఆది. 3. 92

ఈ వచనంలోని కొన్ని కొన్ని మాటలు శాసనం లోనికి వచ్చేసరికి ఎలా మారిపోయాయో సులువుగానే తెలుస్తున్నది. ఇక మరికొన్ని పంక్తులు ఉదహరిస్తాను.

16. ......నభిషునకున్ ప్రియమొాను

17. నకుణ్ యయాది పుట్టి యనాకయాగంబులు సేశె

18. ను. యయాదికిని షుక్రుని పుత్రియైన దేవయాన

19. కున్ యదువు జన్మించెను.

దీనికి నన్నయ్యగారి ఆదిపర్వం తృతీయాశ్వాసం లోకి ఈ క్రింది వచనభాగం ఆధారం.

"[అట్టి నహుషునకుఁ బ్రియంవద (యనుదానికి యతి,] యయాతి, [సంయాత్యాయాత్యయతి ధ్రువు లనంగా నార్వురు] పుట్టి [రందు] యయాతి [రాజై] యనేక యాగంబులు సేసి శుక్రపుత్రి యయిన దేవయాని [యందు యదుతుర్వసులను నిద్దరు గొడుకులం బడసె]"

(ఆది - 3.94

ఇంతవరకూ శాసన కర్త యదు వంశాన్ని నన్నయభట్టుగారి మాటలను తనకు కావలసినంత వరకూ వాడుకొని చెప్పాడు. ఇక శాసనంలోని మిగతా భాగాలూ, వాటికి ఏమేమిటి ఆధారాలో చూద్దాము.

19. ......శీలము గల యదుకులాత్మ

20. జుండు యాత్రియ గోత్రజుండు ఆనూరూను

21. ండను వాండు మధురాపురం బ్బదనకు రాజధాని

22. గా మాధురంబులు సూరసేనంబు లనియెడి దేశం తేలె పూ

23. ర్వ కాలమున ఆ సూరునికి పుత్రుం వసుదేవుండు అచట

పోతనగారి భాగవతం దశమ స్కంధం పూర్వ భాగంలోని "శీలముగల యదుకులమున, నేలా పుట్టెను మహాత్ముఁడీశుడు..." అనే నాలుగో నెంబరులో 'శీలము గల యదు కుల' అనే మాటా అదే దశమ స్కంధం పూర్వభాగంలోని 18 వ నెంబరు వచనం లోని చివరి భాగం అయిన "...యదు విభుండయిన శూరసేనుండను వాఁడు మథురాపురంబు దనకు రాజధానిగా మాథురంబులు శూరసేనంబు లనియెడు దేశంబు లేలెం బూర్వకాలంబున" అనే మాటలూ, ఆధారంగా శాసనకర్త పైన ఉదాహరించిన పంక్తులు రచించాడు.

శాసనం మొదటిపక్క 24 వ పంక్తి నుంచి 36 వ పంక్తిలో చివరి మూడక్షరాలూ తప్పించి మిగతా దంతా పద్యాలు. ఈ శాసనంలో 'కొంత పద్యములలో నున్నట్టు లున్నది' అని సోమశేఖర శర్మ గారు సరిగ్గానే ఊహించారు. అయితే శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు వీటిని గుర్తించి, పాదాలకింద విడగొట్టి, నేను మొదట పేర్కొన్న వారి వ్యాసంలో ఉదహరించారు. వారు పేర్చిన పద్యాలను ఈ క్రింద పొందుపరుస్తాను.

"సీ. రాజేంద్ర విను తొల్లి రాజలాంఛనముతో
వేల సంఖ్యలు దైత్య విభులు దన్ను
నాక్రమించిన భారమానంగ జాలక
గోరూపమై బ్రహ్మఁ జేరబోయి
కన్నీరు మున్నీరుగా రోదనము సేయఁ
గరుణతో భావించి కమలభవుడు
గరణి నూఱడ బల్కి ధాత్రియు వేల్పులుఁ
గదలిరా విష్ణుని గానఁ నేగి.
పురుషసూక్తంబు జదివి యద్భుత సమాధి
నుండి యొకమాట విని వారిజోద్భవుండు
వినుఁడు వేల్పులు ధరయు నే విన్నయట్టి
పలుకు వివరింతు నని ప్రీతిఁ బలికెఁ దెలియ

క. యాదవ కులమున నమరులు
మేదిని పైఁ బుట్టజనుడు మీ యంశమునన్
శ్రీ దయితుఁడు* వసుదేవున
కాదరమునఁ బుట్టి భార మంతయు బాపున్

క. హరి పూజార్థము పుట్టుడు
సురకన్యలు భూమియందు సుందరతనులై

* శాసనంలోనూ, కోదండరామయ్యగారి ఉదాహరణంలోనూ 'శ్రీదైత్యుఁడు' అని ఉంది.

హరి కగ్రజుడై శేషుఁడు
హరి కళతోఁ బుట్టి భారమంతయు బాపున్"

ఈ సలక్షణంగా ఉన్న పద్యాలను శ్రీ కోదండ రామయ్యగారు గుర్తించి అధోజ్ఞాపికలో ఇలారాశారు: "శ్రీజయంతి రామయ్య పంతులుగారి సంపాదకత్వమునఁ బ్రకటింపఁబడిన శాసన పద్యమంజరి యందీ పద్యము లుదాహృతములు కాలేదు." ఇవి సాక్షాత్తు బమ్మెర పోతరాజుగారి పద్యాలు. భాగవతం దశమ స్కంధం పూర్వభాగంలోని పద్నాలుగు, పదిహేను, పదహారు నెంబర్లుగల పద్యాలను శాసనంలో కొండయ్య కొడుకు రామయ్య వాడుకొన్నాడు.

పోతన్నగారి పద్యాలను యావదాంధ్రదేశం పురాణంగానే స్వీకరించి శిరసా వహిస్తున్నది. అవే పద్యాలను కర్త పేరు చెప్పకుండా ఎవరో కొండయ్య కొడుకు రామయ్య శాసనంలో వాడినందుకు పురాణం పుక్కిటి పురాణంగా మారదను కొంటాను. ఇక శాసనంలోని ఈ క్రింది భాగం చూడండి.

36. ................అవనీ
37. శ విను ద్రోణుం డనువాండు వసువుల
(యందు ముఖ్యుండు ధర అ
38. తని భార్య ఆ వేల్పులపెద్ద ఆ ద్రోణుండు
(ఈ నందగోపాలకుండై జన్మి
39. ంచె ధరయియ్య హరియోగమాయ
యశోద నందుడుగాయై జ
40. న్మించె. యల్ల ధేనువ లెల్ల రుషుల
అంశమున జన్మించె సురలెల్ల గోరక్షు
41. పాలకులై జన్మించె.

ఈ వాక్యాలకి భాగవతం దశమ స్కంధం పూర్వభాగంలోని 353 వ నెంబరు పద్యంలోని భాగాలు ఆధారాలు. ఆపద్యం చూడండి,

"సీ. అవనీశ విను ద్రోణుఁ డనువాఁడు వసువుల
యందు ముఖ్యుడు ధర యతని భార్య
(వారి నిద్దఱ బ్రహ్మ వసుధపై జన్మింపు
డంచుఁ బంచిన వార లతనిఁ జూచి
విశ్వేశ్వరుండైన విష్ణుసేవారతి
మాకిచ్చితేని మహిఁ జనింతు
మనవుడు నట్లకాకనియె) వేల్పులపెద్ద
యా ద్రోణు డీనందుఁడై జన్మించె
ధర యశోద [యయ్యె దనుజేంద్రవైరియుఁ
గమలగర్భు మాట గారవించి
తల్లి దండ్రులనుచు దగవారి మన్నించె
నధికభక్తితోడ నలరి రిట్లు.]

ఈ పద్యంలో క్రింద గీతతో మార్కు చేసిన భాగాలను మాత్రమే శాసనకర్త వాడుకొని మరికొన్ని మాటలు కలిపి శాసనంలో, ఉదహరించిన భాగాన్ని రచించాడు. ఇక తరువాతి భాగం పొందుపరుస్తాను.

41. ......దేవకీ యను తొల్లి స్వాయంభు
మనునంతరంబు
42. న పృశ్నియను పతివ్రత. వసుదేవుం డను
సుతపుణ్యు డను ప్రజాప
43. తి.

ఈ వాక్యాలకి "అని ఇట్లు దేవకీదేవి విన్నవించిన నీశ్వరుం డిట్లనియె నవ్వా నీవు దొల్లి స్వాయంభు మన్వంతరంబున బృశ్నియను పరమ పతివ్రతవు వసుదేవుండును సుతపుండను ప్రజాపతి. మీ రిరువురును..." అనే భాగవతం దశమ స్కంధం పూర్వ భాగంలోని 131 వ నెంబరు గల వచనంలో క్రింది గీతతో మార్కు చేసిన మాటలు ఆధారాలు.

శాసనం మొదటి ప్రక్క 43 వ పంక్తిలో "రెండవ జన్మమున అధితియుం గశ్యపుండును" అనే వృత్తాంతానికి ఈ క్రింది పద్యం ఆధారం.

"అదితియుఁ గశ్యపుఁడును నన
విదితులరగు మీకు గుఱుచ వేషంబున నే
నుదయించితి వామనుడన
ద్రిదశేంద్రానుజుఁడనై ద్వితీయ భవమునన్."
[భాగ. 10. I 132.

శాసనకర్త "మూండువ జన్మమున వసుదేవ దేవకి రామక్రిష్ణులు వుద్భవించిరి" అనే సంగతిని ఈ క్రింది పద్యంలోంచి తీసుకొన్నాడు.

"ఇప్పుడు మూఁడవ బామున
దప్పక మీ కిరువురకును దనయుఁడనై తిం
... ... ...
... ... ..."
[భాగ. 10. I 133

ఇక్కడ కాకా భారత భాగవతాలలోని పద సంపద వాడుకొని శాసనకర్త కథనం చేశాడు. వ్యత్యాసం లేకుండా ఇతిహాసం చెప్పాడు. ఇక్కడి

నుంచి కథని టూకీగా ముగించాడు. కృష్ణావతార ఘట్టం నుంచి మౌసల పర్వానికి వాక్యాల వంతెన కట్టాడు.

"మూడవ జన్మమున వసుదేవ దేవకీ రామకృష్ణులు పుద్భవించిరి. అప్సరాంగనలు గోపకన్యలై ఉదయించిరి. రామకృష్ణులు మొదలైన సర్వయాదవులు గోగోపాలకులు ద్వాపరాంత్యమున కూడ వర్తించిరి అచ్యుతకౌన్నాళ్ళు. దుర్యోధనాదుల ద్రుంచి పాండవులకు పరగ పట్టంబుగట్టి సంతోషమున వచ్చె ద్వారకాపురికి. కణ్వాది మహామునుల గాంధారిశాపం వంకను మునుకొని ముప్పదియారు వర్షములు శ్రీకృష్ణుడు మొదలైన సర్వ యాదవులు రాజ్యము చేసిరి. చెయ్యంగ నొక్కనాడు ఉత్పాతములు వొడమె. ఉర్వీసు పంపున జాతరలు చెయ్యను ద్వారవతి కదిలిరి, శ్రీకృష్ణుడు యాదవులు సముద్రుని కడకు జలధితీరమున సవపానమత్తులై వృష్ణి భోజాంతకవీరులైన మునివరనిర్దిష్ట ముసలాత్మకములైన ముయ్యంచు తుంగల మోదులాడి మృతులైరి. అంత దారకుడు చని పాండవుల కెరింగించె" అని శాసనంలోని 43 వ పంక్తినుండి మొదటిప్రక్క చివర దాకా సంస్కరించవచ్చు. ఇందులో క్రింది గీతతో మార్కుచేసిన మాటలు ఒక సీసపద్య పాదమని శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు సరిగ్గా గుర్తించారు. ఈ వాక్యాలని శాసనకర్త తిక్కన సోమయాజిగారి పద్యంలోనుంచి తీసుకున్నాడు.

"సీ॥ అవనీశ వినుమంత నద్దారుకుడు సని
'పాండవేయులగని పరమమునులు
యాదవకులము పేరలుకమై ద్రొల్లి శ
పించుట మునుఁదలపించి పిదప
జలధితీరముల నాసవపానమత్తులై
వృష్ణి భోజాంధక వీరులెల్ల
మునివర నిర్దిష్ట ముసలాత్మకములైన
ముయ్యంచు తుంగల మోఁదులాట

తే. చేర్చి యొండొరుల బరి మార్చుటయును

... ... ...
... ... ...
... ... ..."

[మౌసలపర్వం - 95

ఆ తరువాత శాసనకర్త అర్జునుడు ద్వారకానగరం చేరడం మొదలైనవి వివరించాడు. తిక్కనగారి భారతం ప్రకారం జరిగిన కథని వారి పద్యాలనే వచనంగా పేర్చి మొదట తెలియచేస్తాను.

"(అర్జునుడు యాదవ కుటుంబముల) నిలిపిన తెరగెల్ల నృపవర చెప్పెద విను:

"కృతవర్మ నందనుని జూచి, నీ తల్లియు, నీవు నీ తోడబుట్టిన వారును మృత్తికావత పురమున నిలుడని బహుసంపదల బొల్చు నప్పట్టణంబు దదీయ దేశంబు నిచ్చి యభిషిక్తుజేసిన నాతండు నిజపరిజనములు దాను హర్షం బెలర్పనందుబోయె.

"సరస్వతి యనంబరగు ఘననగరమున సాత్యకి తనయు నట్ల నెయ్యమును గారవంబును నెఱయ నిలిపి యనుప ముదమున నందుల కతడు చనియె.

"తక్కటి వారి నింద్రప్రస్థనగరంబునకు గొనిచని వజ్రనాథుఁ గాఁగ నందు బట్టముగట్టి హస్తి తురంగ రథంబుల విభజించి తగిన భంగి నమ్మవ్వురకును సముచితంబులు సేసి యయ్యయి బంధువులనందు నందునందు నందును నిలచునట్లొందగ నియమించి యక్రూరు భార్యల నాత్మజాలను వజ్రునకు నప్పగించె."

[మౌసల పర్వం 192, 193.

ఈ స్వప్రమాణికమైన విషయాలనే శాసనకర్త కూడా తెలియచేశాడు. అతని కథనం ప్రకారం జరిగిన విషయాలను ఈ క్రింద పొందుపరచి తిక్కనగారి కథనంతో తైపారువేద్దాము.

"ద్వారావతి ననధి ముంచునని ఆ క్షణమే బాల వృద్ధులను అప్సరాంగలను గోపాలాంగనలను గొనుచు అర్జునుడు యింద్రప్రస్థమునకు దెచ్చెను. యాదవకుల కరుండైన వజ్రధనుని బట్టంబు గట్టెను. యాదవ గోపికా పౌత్రులను నియమించి గోవులకు గోరక్షపాలకునిం జేసి గోవుల గాపాడుమని ఘనవిరపురంబున అమృత గోవిందుని అభిషిక్తుం జేసెను. యాదవులు అందరిని అక్కడ అక్కడ నిలిపి అర్జునుండు హస్తినాపురకిం బోయి ధర్మజునకు యెరింగించెను."

[శాసనం రెండవ ప్రక్క 4-15.

తిక్కనగారు చెప్పిన కొన్ని విషయాలను శాసనకర్త చెప్పలేదు. సోమయాజిగారు చెప్పని మరికొన్ని విషయాలను చెప్పాడు. కృతవర్మ కుమారుని విషయం శాసనకర్త కథనం చేయలేదు. సాత్యకి కుమారుడికి 'సరస్వతి' అనే ఘననగరం ఇచ్చినట్లు తిక్కనగారు

చెప్పే శాసనకర్త అమృత గోవిందునకు ఘనవీరనగరం అర్జును డిచ్చినట్లు చెప్పాడు. సాత్యకి కుమారుని పేరు జయుడు. కృతవర్మ కుమారుని పేరేమిటో తెలియదు.

మొత్తం మీద, శాసనకర్త యాదవవంశాన్ని ద్వాపరాంతంవరకు కరక్టుగానే కథనం చేశాడని చెప్ప వచ్చు. ఈ ఘట్టం దాకా చెప్పింది పురాణమే గాని పుక్కిటి పురాణం కాదని తేలింది. అంత మాత్రంచేత ఈ శాసన మంతా పురాణమే అనడానికీ వీలులేదు. పుక్కిటి పురాణమని కొట్టి పారేయ కూడదు. భారత భాగవతాలలోని విషయాలను ఇక్కడ దాకా సజావుగా ఆయా ఘట్టాలలో వాడిన శాసనకర్త పుక్కిటిపురాణం కల్పించడానికి పోతన్నగారిని వాడుకొన్నాడు. శాసనం నాలుగవ ప్రక్కనున్న ఈ పంక్తులు గమనించండి.

17. .........యదువంశ.
18. మునకు భయంబ్బు దొలుగునని త్రిమూ
19. తుల్ లున్ యోగమాయాదేవిని యిట్లు
20. నిరి గోపికా జనములు గోపాలకు
21. లున్న పసల మద్దంకు నేంగుభద్ర
22. నీవు వసుదేవ నందనులకు గర్భాపు
23. త్రికనై నానావిధ సంప్పదలకు
24. స్థానకమై మానవులు భక్తింగొలుతు
25. రు. కానుకలు బలులు నిచ్చి పెద్ద
26. నిమిది నామంబ్బుల గినియాడు
27. దురు ఇయ్యాస్థానంబులు యె
28. రింగిచ్చు......

ఎరగడ్డపాటి పోట్లాటలో, యాదవులు నలసిద్ధిం గూడి యుద్ధముసేసి మృతులైన పిమ్మట ఇలాగ జరిగి నట్టు శాసనకర్త కల్పించాడు. ఇది పూర్తిగా పుక్కిటి పురాణమని చెప్పవచ్చును. భాగవతం దశమస్కంధం పూర్వభాగం పూర్వభాగంలో శ్రీకృష్ణావతార ఘట్టానికి ముందు వ్రాసిన దానిని శాసనకర్త కాటమరాజుకి మహాత్తు కల్పించడంకోసం వాడుకొన్నాడు. భాగవతం లోని భాగాలు చూడండి.

"వ. అయ్యవసరంబున విశ్వరూపుండగు హరి దన్ను నమ్మిన యాదవులకు గంసునివలన భయంబు గలుగునని యెఱింగి యోగమాయాదేవి కిట్లనియె.

సీ. గోపికాజనములు గోపాలకులు నున్న
పసులమందకుఁ బొమ్ము భద్ర నీవు
వసుదేవు భార్యలు వరుస గంసుని చేత
... ... ...
... ... ...

క|| నానావిధ సంపదలకుఁ
దానకమై సర్వకామదాయిని వగుని
మానవులు భక్తి గొలుతురు
కానికలును బలులు నిచ్చి కల్యాణమయీ.

వ|| మఱియు నిన్ను మానవులు దుర్గ, భద్రకాళి......యంబిక యను పదునాలుగు నామంబులం గొనియాడుదు రయ్యై స్థానంబులయందని యెఱింగించి సర్వేశ్వరుడగు హరి పొమ్మని యానతిచ్చిన..."
[దశమ 1. 58 నుండి 61.

పోతన్నగారు రచించిన "యాదవులకు గంసుని వలన భయంబు గలుగునని" అనే మాటలు శాసనకర్త "భయంబు తొలుగునని" అని మార్చి పారేసి త్రిమూర్తుల చేత చెప్పించాడు. ఇటువంటి పచ్చి కల్పన కల్పించి నందుకు మనం ఒక్క శాసనకర్తనే నిందించి లాభం లేదు. తలడు తన కాలానికే బాగా ప్రచారంలోనున్న 'యాదవ భాగవతం' అనదగిన కాటమరాజు కథలోని భాగాలను వాడుకొన్నాడు.

"బృందావనమ్మున పృథివి పెంపొంద
నంద వ్రజంబున నలినొప్పచుండు
అవుల మేపుల నలరి గోపకులు
రైవతాచలమున రంజిలుచున్న."
[శాసనం రెండవ ప్రక్క 19—21.

అనే ప్రాసపాటించిన ద్విపదపాదాలని చూడగా శాసనకర్త వివిధగ్రంథాలలోని మాటలని గుదిగ్రుచ్చాడని చెప్పవచ్చు.

భాగవతం దశమస్కంధంలోని భాగాలను ఉట్టంకించినందువల్ల ఈ శాసనకాలాన్ని సునాయాసంగా నిర్ణయించవచ్చును. శాసనంలో యిచ్చిన శతవర్షాల వల్ల పొరపడి బట్టర్ వర్త, వేణుగోపాల్ చెట్టిగార్లు ఇది A D 1258—59? నాటిదా అని ప్రశ్నించారు గాని పోతన్నగారు పదిహేనోశతాబ్ద పూర్వభాగంలో నున్నవారు. దశమస్కంధం ప్రచారంలోనికి రావడానికి ఒక పుష్కరం గడువునిస్తే ఈ శాసనం పదిహేనో శతాబ్ది ఉత్తర భాగానికి ముందుగా రచించలేదని మాత్రం కచ్చితంగా చెప్పవచ్చు.

శ్రీనాథుడు కూడా పదిహేనో శతాబ్ది వాడే. "శ్రీనాథుని పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథలు దేశికవితామయములు" అని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు 'తెలుగు కవితలోని దేసితనము' అనే వ్యాసంలో వ్రాశారు. వారి శిష్యులు శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు కూడా "...శ్రీనాథుడు కాటమరాజు కథను బలనాటి వీరచరిత్రమువలెనే ద్విపదగా రచించినాఁడని నిశ్చయముగా నిరూపింప వీలగుచున్నది. కాని యిదియుఁ బలనాటి చరిత్రమువలెనే యితరుల రచనములతోఁ గలిసిపోయి శ్రీనాథుని రచన మిదియని వేర్పఱుప శక్యము గాకున్నది"అని వ్రాశారు.

ఈ శాసనంలోని ద్విపదభాగాలను చూస్తే శాసనకర్త కాలానికే ద్విపదలో కాటమరాజు కథ ఉన్నట్లు కనిపిస్తోంది. దీనిని శ్రీనాథుడనే కవి రచించాడనడం నిస్సందేహం. ప్రాచ్యలిఖితగ్రంథాలయం వారు ప్రచురించిన కథలో—

"పినయెల్ల యనువాఁడు ప్రియము దీపింప
వలనొప్ప శ్రీనాథుడు వచన పద్ధతిని
సలిపెను యదుశాస్త్ర చరిత మంతయును."

అని ఉన్నది. అయితే సోమశేఖరశర్మగారు ఈ నాథుడూ, కవిసార్వభౌముడైన శ్రీనాథుడు వేరువేరని అభిప్రాయపడుతున్నారు. పిన ఎల్లయ్య "పదునేడవ శతాబ్ది అంతమునగాని" రచించలేదని చెప్పారు. ఈ గుండ్లపాలెము శాసనంవల్ల పినయెల్లన కాలానికి పూర్వమే ద్విపదలో కాటమరాజు కధ ఉన్నదని మాత్రం తేలుతున్నది.

"ఎద్దుమోత ప్రమాణము"న్న యాదవశాస్త్రమంతా దొరికితేనేగాని ఈ గుండ్ల పాలెము శాసనంలోని విషయాలను తృణీకరించడానికి వీలులేదు. ఈ వ్యాసంలో ఆ శాసనంలోని పురాణభాగాలనీ, ప్రక్షిప్తపురాణభాగాలని వేరుచేయడానికి ప్రయత్నించాను. అర్జునుడు 'వాసుదేవుని మనుమని వజ్రదేవు'డిని ఇంద్రప్రస్థంలో నిలపడం దాకా పురాణమే అని చెప్పవచ్చును. మిగతా భాగాలలో నమ్మదగిన దెంతో నమ్మరాని దెంతో ఇంకొక వ్యాసంలో వివరించుతాను.

ఇటువంటి తప్పుల తడికె శాసనాలు పోలీసు వాళ్ళకి దొరికిపోయిన నేరగాళ్లు చెప్పే సత్యాల వంటివి. తెలివి తేటలతో డిటెక్టివ్, జరిగి దానిని పునర్నిర్మించినట్లు చారిత్రక పరిశోధకులు ఇటువంటి 'తప్పుల తడికెల'తోనే ఒప్పుల కుప్పలైన చారిత్రక ఘట్టాలని ఆవిష్కరించవచ్చు.

# ముద్దుకుప్పాయి

శ్రీ కాటూరి విజయసారథి

[నాట్యాచార్యుడురంజకం శ్రీరంగరాజు తన మనుమరాండ్రైన తిరుమలమ్మా ముద్దుకుప్పాయిలకు నృత్యం నేర్పుతున్న జతులు-సంగీతం]

ముద్దుకుప్పాయి నృత్యగీతి :

తొలిసంజ నీ కంట తొగలు విరిసెనురా
మలిసంజ నా కంట మరులు విరిసెను రా...
అలరుకో నేటిరాయ కలువ కన్నియ కనులు
కలత నిదురలు గూరి కల నిన్ను గనెరా
కినిసి పెదమోవకాచు కేలూడ్చి చనెదేని
తనువు తనియని బ్రతుకు తారట్ల పాలెరా...
ఇలవోలె నీదు వాకిలి సాగిలబడితిని
కలవోలె కరిగి కల్లయై పోకురా
తొలిచెలిమి తలపోసి తిరుగు సుడులను బడితి
వలపు చవి నెరచూర లిడర తిరుమలరాయ...

శ్రీరంగ : బళి, బళిబళీ...కుప్పమ్మా నీ కూతుళ్లు జగదేక సౌందర్యవతులే కాదు, వనమయూరాలు ...అమర నర్తకులతో కయ్యానికి కాలుచాచగలనృత్యభారతులు.

కుప్ప : ఇక చాలుగాని ఊరుకో నాన్నా...అతిగా పొగడితే దోషమయ్యేని...

శ్రీరంగ : తిరుమలమ్మా, నువ్వు ఇంకా సాధన చేసుకోవాలి...నీ కంటే నీ చెల్లమ్మ ముద్దుకుప్పమ్మే మిన్నగా చేస్తోంది. కుప్పమ్మా, నువ్వు వెళ్లి అమ్మాయిలకి దిగదుడుపుగాని హారతి తీసుకురా.

కుప్పమ్మ : అలాగే నాన్నా. (లోనికి పోతుంది.)

శ్రీరంగ : అమ్మాయిలూ శ్రీశ్రీశ్రీ అచ్యుత దేవరాయలుంగారి జయంత్యుత్సవాలు దగ్గర పడుతున్నై. ఆ ఉత్సవాల్లో ఒకనాడు మీ అప్పచెల్లెళ్లు నృత్యం చేయాలి. ఆనాడు ఏలిక మీ కరచరణ విన్యాసాలు చూచి ముగ్ధులై పరవశించి మడులే కావాలో మాన్యాలో కోరుకోమంటారు. ఏలినవారి కనుగ్రహం కలిగితే చేతికి ఎముక వుండదు. మీ అప్పచెల్లెళ్లకి కనకాభిషేకమే చేస్తారు.

తిరుమల : తాతయ్యా ప్రభువుల చేత నాకు కనకాభిషేకం చేయించవూ.

శ్రీరంగ : నేను చేయించే దేమిటే పిచ్చిదానా... నీ నృత్యం చూచి ప్రభువులే సెలవిస్తారు.

ముద్దుకు : అభిషేకాలూ అగ్రహారాలూ ఇంకా ఎందుకు తాతయ్యా. కృష్ణదేవరాయలుంగారు దయచేసిన యీనాములే కోకొల్లలుగా ఉన్నై కదా. యీ సంపదలే మోయలేని బరువులై కూర్చుంటే ఇంకా మడిమాన్యాలు ఎందుకు చెప్పు. ఏదో ఆ వేంకటసామి అనుగ్రహలేశం లభిస్తే మన జీవితాలు తరించిపోవా?

శ్రీరంగ : నువ్వూరుకోవే కుట్టికూనాసీ! బ్రతికినంత కాలం చీమలా కూడబెట్టాలి. తెలుసా. అనుకున్నప్పుడల్లా ప్రభువులకు అనుగ్రహం కలుగుతుందిటే, వీలు దొరికినప్పుడే చాలినంత పుచ్చుకోవాలిగాని.

ముద్దు : నీకూ అక్కకీ ఎప్పుడూ డబ్బు పిచ్చే తాతయ్యా.

శ్రీరంగ : బాగుందే ముద్దుకుప్పీ. తాతకు దగ్గులు నేర్పుతావటే.

ముద్దు : పోనీలే తాతా. నా కెందుకొచ్చింది.

తిరుమల : తాతా! ఏలినవారి మీద ప్రబంధం యిప్పుడే చెప్పేద్దూ.

శ్రీరంగ : ఇప్పుడు కాకపోతే ఇప్పుడే యీ క్షణంలోనే నేర్పుతాను; సిద్ధంగా ఉండండి. (కొంతసేపు జతులు చెప్పి ప్రబంధచరణం అంటాడు.

ఏరా యీ జాగేలరా ఓ అచ్యుతరాయా
వీణాగాన విలోలా మారాకారా రారా
ఎంతో చక్కనివాడౌదువనీ
కంతుడ వని నే సంతసమందితి
చాలును నటనలు సరసకు రారా
చాలును చాలును జాణవౌదురా...

ముద్దు : (భయంగా) తాతయ్యా.

శ్రీరంగ: ఏమిటే అలా దీపం సెమ్మేలా నిల్చున్నావు.

ముద్దు : (భయంగానే) తాతయ్యా.

శ్రీరంగ : ఏమిటే.

ముద్దు : కాలుసేతులు కదలటంలేదు తాతయ్యా.

శ్రీరంగ : ఛా. కాలు కదలకపోవటమేమిటే. ఒకసారి కాలు ఝాడించి చూడు.

కుప్పమ్మ : ఏమిటే తల్లీ, ఏమయిందమ్మా.

ముద్దు : (భయంగా వణుకుతున్న గొంతుతో) అమ్మా!

కుప్ప : ఏమయిందే?

ముద్దు : కాళ్లూ చేతులూ బిగుసుకు పోయాయమ్మా.

కుప్ప : అఁ ఏదీ. ఏదే నా తల్లీ.

శ్రీరంగ : ఎందుకే కుప్పమ్మా అంతకంగారు! ఇప్పటిదాకా నృత్యం తెగచేసి వున్నారేమో? కాస్తంత కాలు నొప్పి పుట్టిందేమో? అంత మాత్రానికే బెంబేలు పడిపోతారటే.

కుప్ప : అయినా నీవంతలా పొగడకూడదంటే వినవు నాన్నా. ఆగమ్మా తల్లీ, ముందు దృష్టి తీస్తాను. నాయనా స్వామి వెంకన్నా నా బిడ్డకు కాలూ చెయ్యీ తిన్నగా రానీయి దేవా. నీ కొండ కొస్తాము తండ్రీ దయ చూడు తిరుమలయ్యా.

ముద్దు : అమ్మా, తాతయ్యా నా కాలుసేతులు తిన్నగా వచ్చేసినై (సంతోషం)

శ్రీరంగ : ఓసి వెర్రి మొహాలూ నే చెప్పలేదూ. కాస్త నొప్పిపుట్టి ఉంటుందనీ —సరే...యీమాటు చెయ్యండి నృత్యం.

కుప్ప: ఇవ్వాళ్టికి చాల్లే నాన్నా. రేపు చెప్పుకోవచ్చు.

శ్రీరంగ : ఛా ఛా. ముందు నువ్వు లోపలికి పో! ఏదే మీకు నేర్పుతాను పట్టండి. (జతులు చెప్పి వీరా యీ జాగేలరా అచ్యుతరాయా చరణం అంటాడు.)

ముద్దు : తాతయ్యా! మళ్లా కాళ్లు పట్టేసినై

శ్రీరంగ : వేషాలు పోతున్నావటే.

ముద్దు : కాదు తాతయ్యా నిజంగానే కాళ్లు పట్టినై.

శ్రీరం : చాల్చాల్లే నేర్చావు ఎల్లాగయితేనేం. నాట్యం చెయ్యి ముందు.

ముద్దు : కుడికాలు కదపలేకపోతున్నాను తాతయ్యా.

శ్రీరం : చూశావుటే కుప్పమ్మా నీ కూతురు అగడం.

కుప్ప : పిల్చావా నాన్నా వస్తున్నా.

శ్రీరం : కుప్పమ్మా! చూడు దీని వేషాలు. మళ్లా కాళ్లు పట్టేసినై అంటోంది.

కుప్ప : ఏమిటే అమ్మా.

శ్రీరం : గారాలు కుడుస్తోంది చిట్టి తల్లి.

ముద్దు : కాదే అమ్మా! నాకు భయంగా వుందే.

కుప్ప : భయమెందుకే పిచ్చి తల్లీ.

ముద్దు : ఇంక నాకు నాట్యం రాదమ్మా.

తిరుమల : అన్నీ ఉత్తదే. దీని మాటలు నమ్మకే అమ్మా.

కుప్ప : పోన్లే నాన్నా. కుఱ్ఱది అలసిపోయిందేమో. రేపు నేర్పుదుగానీ.

శ్రీరంగ : ఛస్. ముందు నువ్వు లోపలికి పో, అలుపా సొలుపా ఏదే ముద్దుకుప్పీ. ఎందుక్కదలదో చూస్తాను. యీ మాటు చెయ్యి.

ముద్దు : నా మాట నమ్మవా తాతయ్యా.

శ్రీరంగ : నమ్మనుగాక నమ్మను.

ముద్దు : తాతయ్యా నువ్వు రోజూ ఏడుకొండల వాని మీద నాట్యం నేర్పుతుంటే ఆ స్వామిని తలచు కొన్నప్పుడల్లా ఉత్సాహంతో తనువు పులకించి మనసు పరవశించి ఉప్పొంగి నాట్యమాడేని. కాని ఇవాళ నువ్వు కొత్తగా ప్రభువుల మీద ప్రబంధం నేర్పుతుంటే మాటిమాటికి శ్రీనివాసుని రూపమే కనుల ముందు నిలిచీని, నాకాలాడనివ్వకుండేని.

తిరుమల : విన్నావా తాతయ్యా విన్నావా దీని మాటలు. ఎంతెంత మాటలు చెబుతోందో. అన్నీ అబద్ధాలు తాతయ్యా. అసలు దానికి ప్రభువుల ముందు నాట్యం చెయ్యటం ఇష్టం లేక దొంగ ఎత్తులు వేస్తోంది.

శ్రీరంగ: నాకు తెలియదటే తిరుమలమ్మా. దీనిజిత్తులూ ఎత్తులూ నా ముందా? యీ వేషాలు కట్టిపెట్టి ముందు నాట్యం చెయ్యి.

ముద్దు : నావల్ల కాదు. నా చేతకాదు.

శ్రీరంగ : ఛా ఛా మళ్లీ అదేమాటా. పెంకితనం చాలించి నాట్యం చెయ్యి.

ముద్దు : నన్ను క్షమించు తాతయ్యా...

శ్రీరంగ: నోర్మూయ్యి... పెంకి—పెంకి—శత పెంకేని—

తిరుమ : నీ క్కాదటే చెప్పేది చెల్లీ... తాతయ్యాకి కోపంకూడా వస్తోంది...

ముద్దు : అక్కా...నన్నొదిలి పెట్టండే...

శ్రీరంగ : చచ్చినా వదల్ను.........ఎక్కడున్నావే కుప్పమ్మా...మండిగంమీద పేంబెత్తం ఇటు తీసుకురా...

కుప్ప : ఎందుకు నాన్నా...
శ్రీరంగ: ఎందుకా నీ ముద్దులకూతురు మంకుతనం పోతొంది...
కుప్ప : ఏమిటే ఆమొండి పట్టు...
ముద్దు : అయ్యయ్యో నా గోడు మీకెవ్వరికీ అర్థం కావటం లేదు...నేనేం చేసేది...
శ్రీరంగ: నాట్యం చెయ్యి...
ముద్దు : నా కాళ్లు పట్టుకుపోయినై...నేను చేయలేను.
శ్రీరంగ : చెయ్యకపోతే తెలుసుగా.....ఇదిగో నా చేతులో ఏ మున్నదో చూడు....బెత్తం.... దండం దశగుణం భవేత్...సీలమండలు విరగొట్టి మరీ చేయిస్తా - నువ్వే పెంకెదాని వనుకొంటున్నావేం...నా కోపమొస్తే శత పెంకెనీ సహస్ర పెంకెనీ! మర్యాదగా చెయ్యి...
ముద్దు : నేను చెయ్యలేను. నామాట నమ్మ తాతయ్యా..
శ్రీరంగ : నమ్మనూ నమ్మనూ నమ్మను. నాట్యంచేసి తీరాలిసిందే...
ముద్దు : చెయ్యనూ, చెయ్యలేను...
శ్రీరంగ : (బెత్తంతో కొడతాడు) చెయ్యవూ, చెయ్యలేవూ, చెయ్యి. ఊఁ. ముందు కాలు కదుపు (వరస వరుసగా దెబ్బలుకొడుతూ ఉంటాడు.)
ముద్దు : అయ్యో అయ్యో తాతయ్యా నీకు దణ్ణం పెడతాను...
కుప్ప : నాన్నా! బిడ్డ కాళ్లు నెత్తురు చిమ్ముతున్నై...
శ్రీరంగ : చిమ్మనీ. వరదలు కానీ. దీనికింత పెంకెతనమా· మాటంటే అంత నిర్లక్ష్యమా (మళ్లా కొడుతూ) చెయ్యి. చెయ్యవే...
కుప్ప : నాన్నా. నా బిడ్డ చచ్చిపోతుంది. ఊరుకో నాన్నా. కొట్టకు నాన్నా...
శ్రీరంగ : నోరుమూసుకుని లోపలి కెళ్లు...
ముద్దు : స్వామీ శ్రీనివాసా వెంకటేశ్వరా రక్షించు తండ్రీ...
శ్రీరంగ : ఊఁ (కొడుతూ నే) చేస్తావా లేదా ?
ముద్దు : అయ్యో...
శ్రీరంగ : ఊఁ చెప్పు చెప్పు...
తిరుమ : తాతయ్యా తాతయ్యా! ఆగు తాతయ్యా చెల్లెమ్మ పడిపోయింది...
శ్రీరంగ : (వినిపించుకోకు) చేస్తా ననూ. అనూ. అంటావా అనవా...
సేవకుడు: (ప్రవేశించి) విద్వత్సభారాయరంజక రంజకం శ్రీ రంగరాజులకు జయము. శ్రీ శ్రీ శ్రీ అచ్యుతదేవరాయలుంగారు తమను తోడుకు రమ్మన్నారు...
శ్రీరంగ : ఎందుకూ...
సేవ : తెలియదు. వెంటనే రమ్మని ఆజ్ఞ...
శ్రీరంగ : సరే. వస్తున్నా పద (కోపంతోనే) కుప్పమ్మా దీన్ని చీకటికొట్లో పడెయ్. అన్నం నీళ్లివ్వకు. పొగరు దిగి దారికి వచ్చేదాకా అదేశిక్ష. జాగ్రత్త...
కుప్ప : నాన్నా! బిడ్డ అల్లాడిపోతుంది...
తండ్రి : నోర్ముయ్యి. నే చెప్పినట్లు చెయ్యి. తిరుమలమ్మా విన్నావుగా! ఆ గదికేసి తొంగి చూస్తివా నీకూ ఇదే రాత. జాగ్రత్త. పద పయ్యా పద...
(ముద్దుకుప్పాయి మూల్గులతో దృశ్యభేదం)
శ్రీరంగ: జయము జయము మహారాజా...ఎందుకో పిలిపించారట.
అచ్యుత: నాట్యాచార్య శ్రీరంగరాజులకు అభివందనాలు. ఇంకా వారంరోజులలో మా జన్మదినోత్సవాలు జరుపుకొన నున్నాము. ఉత్సవం వారంరోజులు రసికగోష్ఠి జరుగుతుంది. అందులో ఒకరోజు మీరు నాట్యప్రదర్శన యేర్పాటు చేయండి.
శ్రీరంగ: ఏలినవారి చిత్తము......
అచ్యుత: నృత్య మంటపాన్ని ప్రత్యేకంగా మీరే స్వయంగా అలంకరించండి.........
శ్రీరంగ: చిత్తం...............
అచ్యుత: మరో విషయం...............
శ్రీరంగ: ఆజ్ఞాపించండి............
అచ్యుత: ఆజ్ఞ కాదు రంగరాజా. అభ్యర్థన. మీ మనుమరాలు తిరుమలమ్మ నృత్యాన్ని పలుసార్లుచూచి ఆనందించాం. కాని ఇంతవరకూ ముద్దుకుప్పాయి గజ్జెకట్టగా చూచే అదృష్టం లభించలేదు. ఈ సారి మా జన్మదిన సందర్భంలో ముద్దుకుప్పాయి నాట్య మేర్పాటు చేయించమని. మా...
శ్రీరంగ: ప్రభువుల అభిమతానుసారం యీ పదినాళ్ల నుండి ముద్దుకుప్పాయికి ప్రత్యేకంగా శిక్షణ యిస్తున్నాను. ఏలినవారి దయవుంటే ప్రదర్శన విజయవంత మౌతుంది.
అచ్యుత: దయకాదు. మా అదృష్టం...
శ్రీరంగ: తమ అనుగ్రహం...... :

అచ్యుత: ముద్దుకుప్పాయి పదమంజీరాలు మా నృత్య మందిరంలో ఝణఝణాత్కారాలు సలుప గలవు.........

శ్రీరంగ: మహాప్రభువుల సెలవు...

అచ్యుత: ఇక మీరు వెళ్ళవచ్చు...

ముద్దుకుప్పాయి పాట :

హరి కరుణ కిరణమ్ము సోకని
పరువపుం దమి మొగ్గరా - ఏ
వరుస బ్రతు కిది నెగ్గురా.
ఇగురుపూచిన పూల తీవగ
మరులు త్రొక్కిన కలఁగు త్రోవగ
కుగులు మట్టిన విరుల కొరుగ
సిరులు మరలిన బ్రతుకు పెన్వగ.
మిన్ను మన్నుల నడుమ బందిగ
నున్న క్రొన్నన వోని బ్రదుకున
వెన్నెలగ పన్నీటి సోనగ
కన్ను తుద తులకించు మొలకగ.

కుప్పాయి: ఆనాటి కొనాడు యిలా మొండికెత్తితే ఎలాగే తల్లి. అన్నం నీళ్లూ లేకుండా ఇలా కృశించిపోతావటే. నిన్ను చూసి మీ తాతయ్య కుమిలిపోతున్నారు. నా మాట వినమ్మా.

ముద్దు: ఏన్నేం చెయ్యమంటా వమ్మా. ఇదంతా నా దురదృష్టం.

కుప్పా: తాతయ్య చెప్పినమాట వినమ్మా.

తిరుమల: అందులోను ఏలినవారు ప్రత్యేకంగా నీ నృత్యప్రదర్శనం చూడాలని కుతూహల పడు తున్నారట. నువ్వు కాదంటే తలవంపులు తప్ప వని తాతయ్య కలవరపడుతున్నాడు.

ముద్దు: నన్ను క్షమించు తాతయ్యా. నీ మర్యాద నిలుపలేని నీ మనుమరాలిని చంపిపారెయ్.

శ్రీరంగ: అమ్మా అమ్మా అంతమాటనకు తల్లీ. మాట పోతుందనే భయం తప్పితే నీమీద నాకేమన్నా కక్షా తల్లి.

ముద్దు: అయ్యో దైవ మిలా నన్నారడి పెట్టేని. ఆ స్వామి నా కాళ్లు కట్టివేసేని. నే నేమి చేసేది.

శ్రీరంగ: మనసు కుదుట పరచుకొని ఎలాగైనాసరే యీ ముసలితాత మానమర్యాదలు నిలబెట్టమ్మా. మహాప్రభువులు శ్రీకృష్ణదేవరాయలవారు నన్ను మెచ్చి, నృత్యంలో నాకు పెద్దరికమిచ్చి, నాట్య శాల నా అధీనం చేసి విద్వత్సభారాయరంజకు డని బిరుదు ఇచ్చి సన్మానంతో మన్నించారు. వేంకటస్వామి దయవల్ల యీనాటి వరకూ నా పేరు నిలబెట్టుకుంటున్నాను. సమయానికి నువ్వు నా మాట కాదంటే నా బ్రతుకేం కావాలి చెప్పు. యీ జాగీరులూ, అగ్రహారాలూ అనుభవించే యోగం లేకుండా పోతుంది. చివరికి రాజసభలో అడుగుపెట్టడానికే అర్హత వుండదు.

ముద్దు: స్వామీ! వేంకటేశ్వరా! నన్ను రక్షించ లేవా? ఇంత కఠిన పరీక్ష నా కెందుకు కల్పించేవు స్వామీ.

శ్రీరంగ: ఆపద మ్రొక్కులవాడా! అనంతాచలరమణా! నన్నాదుకో తండ్రీ. ప్రభువులు నా కిచ్చిన ఎర్లం పూడి జాగీరు నీ పాదకమలాలకు సమర్పించు కుంటాను.

కుప్పా: అన్ని వేళలా నీ పేరే తలచుకొంటామే. ఈ వేళకి అనుగ్రహించు స్వామీ. ముద్దుకుప్పాయీ తాతతో సరే నని చెప్పమ్మా

ముద్దు: ఎలా చెప్పేదమ్మా. స్వామి అనుమతించటం లేదు. భక్తవత్సలుడైన ఆ తండ్రి ఉగ్రస్వరూ పుడై నా కన్నుల వ్రేలుతున్నాడు.

కుప్పా: అయ్యో ఏమవస్థ వచ్చి పడిందిరా దేవుడా. పోనీ సరే నని మాటమాత్ర మనమ్మా.

శ్రీరంగ: అను తల్లీ. నీ కాళ్లు పట్టుకుంటాను.

ముద్దు: తాతయ్యా.

శ్రీరంగ: నువ్వు సరేనంటే నాకు మారేనుగుల బలం వస్తుంది.

తిరుమల: అను చెల్లీ! అలాగే చేస్తానను.

ముద్దు: అలాగే తాతా. తప్పక చేస్తాను. నీ కోసం నా దైవం తప్పక అనుగ్రహిస్తాడు.

శ్రీరంగ: అన్నావా తల్లీ. అన్నావా. చాలు. ఆమాత్రం చాలు. రేపటినుండి నీ అంతట నీవే సాధన చేసుకో. నీ పేరు సార్థకం చేసుకో. నన్ను కృతార్థుణ్ని చెయ్యి తల్లీ. (ఆనంద సూచకంగా ప్రారంభమైన సంగీతం నృత్య సంగీతంగా మారు తుంది)

సేవక: రాజాధిరాజ రాజపరమేశ్వరా! బహుపరాక్ చతుస్సాగర పర్యంత భూమిఘవా! బహుపరాక్ శ్రీశ్రీశ్రీ అచ్యుతదేవరాయా! బహుపరాక్

అచ్యుత: సభాసదులందరికీ అభివందనాలు. ఇన్నాళ్లూ జరుగుతున్న సరసగోష్ఠులు మమ్ముల నెంతో ఆనందపరచినై. నేటి కడపటి ఉత్సవం విద్వత్సభారాయరంజకరంజకం శ్రీరంగరాజుల అధ్వర్యాన మా నృత్యమందిరంలో ప్రత్యేకంగా ఏర్పాటైంది. శ్రీరంగరాజుల దౌహిత్రి ముద్దు కుప్పాయి నేడు మన కన్నులవిందుగా నృత్యం

చేస్తుంది. శ్రీరంగరాజా! ఇంక నృత్యం ఉపక్రమిస్తారా.

శ్రీరంగ : ప్రభువుల చిత్తం (మృదంగనాదాలు శ్రీరంగరాజు నృత్యజతులు అంటూవుంటాడు. ముద్దుకుప్పాయి కాలిగజ్జెల నాదాలు)

ఏలా యీ జాగేలరా ఓ అచ్యుతరాయా
వీణా గాన విలోలా మారాకారా రారా.

(నృత్యాగ్నసుల మధ్యనుండి ముద్దుకుప్పాయి రహస్యంగా)

ముద్దు : తాతయ్యా మళ్లా నా కాళ్లు బిగుసుకుపోయాయి.

శ్రీరంగ: స్వామికి మొక్కుకోతల్లీ . మర్యాదకాపాడు.

ముద్దు : అయ్యో నా తనువు కంపించి పోయిాని (కొంత కాలం నృత్తసంగీతం వినిపించి గంభీర నిశ్శబ్దం ఆవరిస్తుంది. ముద్దుకుప్పాయి కంపిస్తున్నట్టె ఆమె కాలిగజ్జెలు ఝుణఝుణ ఆ నిశ్శబ్దతను భంగపరుస్తుంది.)

అచ్యుత : ఏమి శ్రీరంగరాజా! నృత్యం చేయకుండా మ్రాన్పడి చూస్తున్నారు ?. (శ్రీరంగరాజు మాట్లాడడు) ఏం ముద్దుకుప్పాయి ? ఎందుకలా కంపించి పోతున్నావు ? సమాధానం చెప్పరేం?

ముద్దు : (లోగొంతుతో) ప్రభూ!

అచ్యు : ఏమిటి ?

శ్రీరంగ : మహాప్రభూ! ముద్దుకుప్పాయి.

అచ్యు : ఏమయింది ముద్దుకుప్పాయికి... చెప్పరేం ? (సభలో గుసగుసలు) మీ మౌనం సభామర్యాదను భంగపరుస్తున్నది.

ముద్దు : మహారాజా! మన్నించితే నాదొక విన్నపం.

అచ్యు : నిరభ్యంతరంగా విన్నవించుకో.

శ్రీరంగ : ముద్దుకుప్పాయి ! తన సర్వస్వమూ శ్రీహరికి కానుక పెట్టింది మహాప్రభూ!

అచ్యు : కావచ్చు.

ముద్దు : నరపతుల సమక్షంలో నృత్యంచేయనని శ్రీహరికి బాసచేసేను ప్రభూ.

అచ్యు : ఆఁ

శ్రీరంగ : కుఱ్ఱదానిమీద కన్నెఱ్ఱ వలదు ప్రభూ! దాని ఆ వివేకానికి నేను క్షమార్పణ వేడుకొంటున్నాను.

అచ్యు : కన్నెఱ్ఱకాదు శ్రీరంగరాజా! దిగ్భ్రమ. మా కులదైవం శ్రీ వేంకటస్వామికి సమర్పించుకున్న ముద్దుకుప్పాయి భక్తనర్తకి. ఆమె అందెల సందడులు శేషగిరి వాసునకే విందులు. ఈమెను దర్శించిన మా విజయనగర ఆస్థాని ధన్య.

ముద్దుకుప్పాయీ నీ అచంచల భక్తికి మేము తలవాల్చి నతి చేస్తున్నాము.

ముద్దు : వద్దు ప్రభూ వద్దు...యీదాసి అంతమర్యాదకు అర్హురాలు కాదు...

అచ్యు : మాకులస్వాముల భక్తనర్తకికి తులనార్పణములు సమర్పించుకొంటున్నాము.

ముద్దు : వలదు. మహారాజా వలదు ... శ్రీనివాసుని కృపాలేశం లభింపజేస్తే ఆపాటి కానుకచాలు...

అచ్యుత : శ్రీ రంగరాజా ఇంకనుంచి ముద్దుకుప్పాయి మాకొలువు చాలించి శ్రీపతిని సేవించుకోవటానికి మహదానందంతో సమ్మతిస్తున్నాము... యీమె మాఅంతఃపురపరిచారిక కాదు... నేడు మాకెంతో సుదినం. మా జన్మదినోత్సవ సందర్భంలో ఏడుమలల వేల్పులకొనిక భక్తురాలిని సమర్పించుకో గలిగే మహాభాగ్యం మా కబ్బినందుకు మేమెంతో ధన్యుల మయ్యాము... యీక్షణంనుంచి ముద్దు కుప్పాయి తిరుమల మందిర సుందరుని దాసురాలు...

ముద్దు : మహాప్రసాదం...

అచ్యుత : ఎవరక్కడ...యీభక్తమణిని రాజలాంఛనాలతో పాలకీమీద తిరుమలకు తీసుకు వెళ్లండి...

ముద్దు : మహాప్రభూ... నా స్వామివద్దకు వాహనాల మీద పోనా...వలదు మహారాజా వలదు...కాలినడలపోయి ఏడుమలల రేనిని సేవించుకొంటాను. నాకు సెలవిప్పించండి...విజయనగర ఆస్థానమా సెలవు...(అప్పగింతల సంగీతం సన్నగా వినిపించుతుంది...)

ముద్దు : తాతయ్యా...నా స్వామి నన్ను చేర బిలుస్తున్నాడు...నన్ను ఆశీర్వదించు...

శ్రీరంగ : పోయిరా తల్లీ ...నీ జన్మజన్మాల పంటను కొలుచుకోతల్లీ ... యీ పాపిని మన్నించమని నీ స్వామితో చెప్పతల్లీ ...

ముద్దు : అమ్మా నన్నలంకరించి నా స్వామిదరి కంపవే. నన్ను దీవింపవే...

కుప్పా : తల్లీ ...వెళ్లిరా... శ్రీనివాసుని సన్నిధే నీకు పెన్నిధి...

ముద్దు : అక్కా...

తిరుమల : చెల్లీ ...(అప్పగింతల సంగీతం సమీపించి దూర మవుతుంది)

ముద్దుకుప్పాయిపాట: ఏడు మలలపై విడిసితివో-ఎ.
న్నేడుల పయనము ప్రాసితివో...
కోటి కోటి సోపానములను.
ఏటికేటుల సృజియించితివో.
మాటికి మాటికి నా యెదలోపల

ఏటికి నీ విటు మసలెదువో...
చెన్నుమీర వే వెలుగులు విచ్చిన
మిన్నే వరదాభయకరమై.
కన్నెన్నన్నిటు కౌవగ జూచిన
పెన్నిధినై నా సన్నిధినై...

పూజారి : ఎవరమ్మా నీవు...

ముద్దు : స్వామివారి పాదదాసిని...

పూజారి : వేళకాని వేళ స్వామి కోవెలకు వచ్చావెందుకమ్మా...

ముద్దు : దేవరవారి కొలువుసాలలో చేరి ధన్యనౌతాను..

పూజారి : ఇప్పుడు తలుపులు తెరువరమ్మా. స్వామికి భోగవేళయింది. ఇంత రాత్రివేళ ఇక్కడికెవరూ రారు. తెల్లవారేక రావమ్మా. స్వామి దర్శనం లభిస్తుంది.

ముద్దు : ఆఁ. స్వామి భోగవేళాయెనా-నా మేను పులకరించీని. నా మేనుదమ్మి విచ్చుకొనేని-తలుపు తీయి స్వామీ-తాళజాలని బాళి కెట్టు ఓపుదురా. నిన్నే నమ్మగదరా నీకే అర్పణమైతి. సర్వమీ వనుకొంటె ఏలరా తెరచాటు? పలుకరా ఒక మాట. ఏలుకోరా నన్ను-మేలుకోరా వరద.

పూజా : ఎవరో పిచ్చిదిలాగుంది. ఏయ్ అమ్మో! నడు నడు ఆవలికి నడు. స్వామికి నిద్రాభంగ మవుతుంది.

ముద్దు : దవ్వుదవ్వుల నుండి నన్ను రమ్మని పిలిచి నను జూడ కేరేయి నిదురగూరేవా ?

పూజా : ఏయ్ నీక్కాదూ చెప్పేదీ? పోతావా, మెడబట్టి గెంటించమంటావా ? నీకే చెప్పేది.

ముద్దు : నువ్వు గుడిదూరి గడియ వైచుకొని నన్ను నవ్వులపాలు చేసేది న్యాయమానటరా. మనసు నీకై జన్నివెట్టితిరా! వయసు నీకై మీదుగట్టితి, మేలుకొని వేగ నన్నేలుకోవే.

(గుడి గంటలు)

పూజా : ఆఁ యీ వేళప్పుడు గుడిలో గంటలు మ్రోగుతున్నా యేమిటి ?

ముద్దు : వలదురా సామి నీ వలుక పూనకురా - అడిగితే నీ చెలియ కలత చెందీని.

పూజా : స్వామికి ఆగ్రహం కలిగిందా ? తల్లీ నీ వెవరివో, ఎరుగక చెయిచేసుకున్నాను. క్షమించు తల్లీ. ఉండమ్మా తలుపులు తీస్తాను. స్వామిని సేవించుకో. క్షమించు దేవా. క్షమించు. దాసానుదాసుణ్ణి. రా తల్లీ రా. స్వామి నీకోరకు మేలుకొన్నాడు. తలుపు తీయుమన్నాడు...

ముద్దు : నిన్ను దరిసిన కనులు నీరుగ్రమ్మెని — ఎన్ని నా ళ్లాయెరా నిన్ను యెడబాసి—ఇన్నాళ్ళకా మరల నిన్ను జూసేది. తనువు పూవై విచ్చి మనసు నర్తించేని.

పూజా : ఈమె యెవరో, దేవదాసి. స్వామివారి భక్తచింతామణి. స్వామి భోగమున కర్పితమైన ఈమె మనుగడయే మనుగడ...

(నేపథ్యంలో తెల్లవారిన సూచనగా సుప్రభాతం)

పూజా : ముద్దుకుప్పమ్మా! విజయనగరంనుంచి నీ కోసం యెవరో, వచ్చారు. నీ యీ నాములమీద ఆదాయం తెచ్చియిచ్చారు. ఇదుగో...

ముద్దు : ఇంకా నాకు ఏటి భోగాలు — ఎందుకీ భాగ్యాలు — నాకు సర్వము స్వామి. నా సర్వమూ స్వామిదే...

పూజా : అయితే, యీ నాఅర్పణములు స్వామికే సమర్పించమంటావా ?

ముద్దు : ఏటి కానుకలివ్వ సామి కేపాటి. ఇవ్వండి స్వామీ. నాకు గోవిందరాజస్వామి ప్రసాదం దినమూ ఇప్పించండి...

పూజా : అలాగే నమ్మా. నీ ఆస్తినంతా స్వామివారికి వ్రాసేసి నీకు రోజూ స్వామి ప్రసాదం ఇప్పించే ఏర్పాటు చేయిస్తాను...

ముద్దు : విజయనగర ఆస్థాన నాట్యాచార్య విద్వత్సభారాయరంజక రంజకం శ్రీరంగరాజు మనుమరాలూ, రంజకం కుప్పసాని కుమార్తె అయిన ముద్దుకుప్పాయి గోవిందరాజుల ప్రసాదం నిమిత్తం తన సర్వమూ స్వామివారి కర్పించుకున్నదని శాసనం వ్రాయించండి...

పూజా : అలాగే నమ్మా. అదిగో ఆకనిపించే కుటీరంలో వుండి స్వామిని సేవించుకో...

ముద్దు : వద్దు మహానుభావా వద్దు. స్వామి ఎప్పుడు పిలుస్తాడో, ఏమో యీ కోవెలముంగు పడుకుంటాను. స్వామి ఉచ్ఛిష్టం ఆరగించుతాను. ఆ స్వామికి దువ్వలువలు ఉతికి ఇస్తాను. పూసరములు అల్లి యిస్తాను. శ్రీగంధ మలదుతాను. స్వామి ముంగిట కసవు వూడ్చుతాను...

పూజా : స్వామికి రేపు బ్రహ్మోత్సవం జరుగుతుంది. ఆ ఉత్సవంలో నువ్వు నాట్యం చేయాలనీ ఆ నాట్యం కన్నులవిందుగా చూచి ఆనందించాలనీ మేమంతా కుతూహలపడుతున్నాం. ఏమంటావమ్మా...

ముద్దు : మహాప్రసాదం...

# వీర శిలా శిల్పాలు

## శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

యుద్ధములో అసమానసాహసముచేసి మరణించిన వీరుల గౌరవార్థము 'వీరశిలల'ను నిలుపుట కల్యాణి చాళుక్యుల కాలములో ప్రారంభమైనట్లు కానవస్తుంది. అలంపుర మ్యూజియములో జయసింహ వీరగల్లు ఉన్నది. పాదచారియైన వీరుడు బల్లెమును పట్టి ఏనుగుమీద ఉన్నవారితో తలపడినట్లు



పుష్పగిరిలో ఒకగోడమీద ఉన్న వీరశిల

నడిమి భాగములోనూ, ఇద్దరు చామర ధారిణు (లగు అప్సరస)లచే పరివేష్టింపబడినట్లు పై భాగములోనూ, ఒక స్త్రీ ఎవ్వరో చితి (?) ప్రక్కన నిలబడినట్లు అడుగుభాగములోనూ అర్ధశిల్పముగా చెక్కబడిన దీశిలమీద. గడియారము రామకృష్ణశర్మగారు ఈ శిల మీద 'శ్రీ జయసింహవల్లభ దండనాయక' అన్న (1028 సంవత్సరమునాటి) శాసనాక్షరా లున్నవని చెపుతున్నారు. వారు వర్ణించిన ఇతర వీరగల్లులు—అలంపురానివి ప్రధానముగా రెండు భాగములతోనే వున్నట్లు తోస్తున్నాయి. ఇవి కల్యాణి చాళుక్యులూ కాలచుర్యరాజులూ పాలించిననాటివి. యుద్ధ వీరుని చిత్రమూ, వీరస్వర్గచిత్రమూ రెండే, ఉండుటనుబట్టి ఈ వీరశిలలు వీర శిలాశిల్ప ప్రారంభకాలానివే అయి వుండవచ్చును. ధార్వాడ, బెల్గాము నగర మ్యూజియములలోని తీరైన వీరశిలలు వీని తర్వాతివే కావలెను.

జయసింహ వీరగల్లునుబట్టి అసమాన యుద్ధ మరణము పొందినవారికే వీరశిలలు నిలిపేవారని అనిపిస్తుంది. తరువాతి వీరగల్లులూ ఈ సంగతినే సూచిస్తాయి చాలామట్టుకు. కాలము గడచినకొద్దీ ఈ ఆశయము రకరకాలుగా మారి వీర శిలాశిల్ప వైవిధ్యానికి కారణమైనదని తెలుస్తుంది.

జైనులలో, మరణించిన గురువులకు 'నిశీధు'లనే సమాధిరాళ్లను నిలుపుట చిరకాలమునుంచి వున్న ఆచారము. కొనకండ్లలో కాయోత్సర్గ దీక్షలో దిగంబరులుగా నిలబడిన జైనతీర్థంకరుల శిలలు రెండున్నవి. కొనకండ్ల కొండకుందాచార్యుల నివాసస్థానము. ఈ శిలలు రాష్ట్రకూటరాజుల కాలమునాటివేమోనని వాటిమీది శాసనాల లిపి అనిపిస్తోంది. ఇవి సమాధిరాళ్లను పోలినా, సమాధిరాళ్లు కాకపోవచ్చును. చిప్పగిరిలో సమాధి రాళ్ళున్నవి. అవి అడుగూ అడుగున్నర వెడల్పూ, మూడు నాలుగడుగులు పొడవూ అయిదారంగుళాలు దళసరీ వుంటాయి. అడుగు భాగము నునుపుగా వుంటుంది. దానిమీద శాసనము—ఆ రాయి ఎవరు ఎవరి మరణానంతరము నిల్పినారు అన్న సంగతిని తెల్పేటిది—వుంటుంది. నడిమి భాగములో దంపతులు ఆ జైనసన్యాసిని కొలిచినవారూ, ఆ రాతిని నిల్పినవారూను. పై భాగములో అర్ధ పద్మాసనాసీనుడైన జైన సన్యాసి బొమ్మ. దానవుల పాడులో రాష్ట్ర



కంబదూరు దేవాలయంలోని వీర శిలాశిల్పం

కాటరాజు నిత్యవర్షుని నాడు ఇలాంటి సమాధి రాళ్లు చాలా వుండేవి. నేను మదరాసు మ్యూజియములో దానవులపాటివి అయిదారు సమాధిరాళ్ళున్నాయి. శిల్పము యదాలాభము కాక యత్నపూర్వకము. చక్కగా నున్నది. అనంతపుర మండలము అమరాపురములోని శిథిలబ్రహ్మజినాలయములో నల్లరాతి సమాధి రాళ్లు—కల్యాణి చాళుక్యుల నాటివి—ఈ రీతిగా చెక్కినవే మూడున్నవి. వీటి అంచులు చెక్కివేయడమువల్ల ఇవి కర్రపలకమీదవలె లోచెక్కిన బొమ్మలయినా, రాయి ముఖతలముమీద పైకుబికి అర్థ శిల్పములుగా కనబడుతున్నాయి.

ఇష్టదైవము సర్పించుటకు తలకోసి యిచ్చే సంప్రదాయము పల్లవుల నాటికే ప్రబలముగా నుండినట్లు మహాబలిపుర దుర్గాదేవి కుడివైపు కూర్చొని తల కోసుకునే వీరుడు సూచిస్తున్నాడు. దుర్గాదేవి ముందు మాత్రమే కాక, ఈశ్వరుని (పానవట్టి లింగము) కెదురుగా తల కోసుకోడానికి ఒక వీర భక్తుడు మేళతాళాలతో తర్లి వెళ్లడమూ, తలను మెడ వెనుకనుంచి కోసుకుని పళ్లెములో పెట్టి నిలబడివుండి సమర్పించడమూ, ఆతని అనుచరులు మేళతాళాలతో ఆ తలను వూరేగించడమూ కంబదూరు మల్లిఖార్జునాలయ శిల్పాలలో కనబడుతుంది. ఈ శిల్పాలు వీరశైవ విజృంభణ కాలము నాటివి. భగవంతుడు ఒక్కడు లేడనే నమ్మకాన్ని ప్రచారము చేసిన జైన మతానికి వ్యతిరేకముగా సర్వేశ్వరుడు, పశుపతి కలడనే మహాప్రపత్తిని పెంచిన వీరశైవ కాలములో జైనులను నరికినంత పట్టుదలతోనే వీరశైవులు తమ తలలనూ నరికి సమర్పించారు. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రములో శ్రీశైల క్షేత్రములో జరిగే సాహసాలు వర్ణిస్తాడు. రెడ్డిరాజు అనవేమారెడ్డి కాలములో వీరులు శిరస్సులర్పించుటకే కాబోలు శ్రీశైలములో వీరశిరోమండపము నిర్మించబడింది. హైదరాబాదు మ్యూజియము – ఇప్పుడు తీసేశారుగాని-దీనిలో కత్తితో పీకను (ముందు వైపునించి!) కోసుకుంటున్న వీరశైవుల శిలా విగ్రహాలు పంద్రెండు మించి ఉండేవి. వీరు నెత్తిమీద ధరించే బోర్లించిన కుండవంటి కిరీటము అట్లాంటి వీరులు సంప్రదాయసిద్ధముగా ధరించేది కాబోలు. వీరికిటూ అటూ చామర ధారిణులైన అచ్చరలుంటారు. ఒక బొమ్మకు ఇటూ

## వీర శిలా శిల్పాలు

అటూ సూర్యచంద్రు లున్నారు. వీరి కీర్తి ఆచంద్రార్కముగా విలసిల్లునని కాబోలు తాత్పర్యము.

శ్రీనాథుడు క్రీడాభిరామములో మైలారు వీరభటులు చేస్తూండిన సాహసకార్యాల్ని వర్ణించాడు:

కరవాడి యలుగుల గనప పాతర్లలో
నట్టి చేరులుగోసి యురుకువారు
కటికి హూణ్ణాళంబు గంటక త్తెర వట్టి
మిసిమంతులునుగాక మ్రింగువారు
గాలంపు గొంకి గంకాళ చర్మము గ్రుచ్చి
యుడువీధి నుయ్యాల లూగువారు
సందులను నారసంబులు సలుపువారు
యెడమ కుడిచేత హారతు లిచ్చువారు
సాహసము మూర్తిగైకొన్న సరణివారు
ధీరహృదయులు మైలార వీరభటులు.

మైలారుదేవుడనగా భైరవుడు. కాబోలు. అయిన ప్రోలి మైలారుదేవుని చేత భైరవుని ఆయుధాలే కనపడుతున్నాయి. మైలారు వీరభటులు చేసిన పై సాహసాలు చేసిన వీరుల శిలలు తెలుగు దేశము నందంతటా వున్నాయి. రాయదుర్గములో ఒక శిలమీద బల్లెముల వరుస చిత్రించబడి వున్నది. దాని పక్కన ఒక స్తంభముమీద కాబోలు ఒక శైవుడు నిలబడిఉన్నాడు నిలబడ్డపాటున కర్ర గట్టినట్లు వాల్తాడు ఆబల్లెములమీద! నెల్లూరు జడ్జి బంగళా ఆవరణలో సుంద్రెని తాటి ఉయ్యాలలో కాలు చాచి కూర్చుని ఒక శైవుడు బాకుతో ఆ ఉయ్యాలతాడు కోసేస్తున్నాడు. అతని ఉయ్యాల క్రింద 'కరవాడి యలుగుల గనపపాతర'యో, 'అవ అవ మండు నెత్తిని చంద్రమల్లెల గుండు'మో తెలియదు. ఆ సూచన ఏదీ ఆ శిలమీద లేదు. కంబదూరులో శూలము నెక్కినవాని బొమ్మ ఉన్నది. పెద్దూరి వీరభద్రాలయములోనూ, యాగంటిలోనూ రాయదుర్గములోనూ, మదనపల్లి (కాలేజి హాలు)లోనూ శూలము నధిష్ఠిస్తామని శైవులు పానవట్ట లింగమును కుడిచేతి బట్టి ప్రయాణము చేస్తూన్నట్లుంది. తాము కోరినదేదో సఫలమైతే ఈ మొక్కు చెల్లిస్తామని కాబోలు వారి ఆశయము. కొన్ని శిల్పాలలో కుడిచేత పానవట్ట లింగము పట్టి ఎడమచేయి ఆ లింగముపైన మందిరము రీతిగా నుంచుట కానవచ్చును. ఇదీ ఏదో ఘోరమైన ప్రతిజ్ఞనే తెలుపును. లేకుంటే ప్రత్యేక శిల్పకల్పన ఏల?

రాజమహేంద్రవరంలోనూ, మదనపల్లిలోనూ ఇట్లాటి శిల్పాలు చూచాను నేను.

కత్తిని పిడికిందుగానూ మొన పైపైపుగానూ వుండేటట్లు నిలబెట్టి మొనమీద అరచేతితో నొక్కి కత్తిని వంచేయడము పుష్పగిరిలో కానవస్తుంది. పుష్పగిరిది గోళకీమఠము, కాకతీయుల కాలానిదే కావలెను. ఒక వీరుడు ఒక చేతితో కత్తిని వంచేసి, ఆ కత్తిని ఆ చేతితో పట్టి చూపిస్తూ రెండో చేతితో రెండో కత్తిని వంచుతున్నాడు.

గాలంపుకొంకికి తలచర్మము గుచ్చిన వీరుని బొమ్మ తెలుగు విజ్ఞాన సర్వస్వము మూడో సంపుటములో 1089 వ పుటలో చూడవచ్చును. ఈయన పక్కన శాసనము కూడా వున్నది. అయితే 'ఉడు వీధి నుయ్యాల లూగు'టకు ఈ బొమ్మలో అనుకూలత లేదు. పెద్దూరిలో ఏటి ఒడ్డున ఒక చిత్రమైన వీరశిల ఉన్నది. ఒక చెట్టుకో, గాలంపు కొంకికో కట్టిన శిరస్సున్నది. దిగువన ఆ తల తెగిన వీరుని మొండెము కూర్చున్నట్లున్నది. పైన చామరాలతో ఆ వీరుని కిటూ అటూ అచ్చరలు. తల ఎట్లు తెగినదో సూచనలేదు. రాజరాజేశ్వరాలయానికి చేరువగా ఇంకొక శిల వున్నది. అడుగు గడిలో ఏనుగుమీద మావటీడూ యోధుడూ ఉన్నారు. మధ్యగడిలో ఇద్దరు తలలు తెగి వున్నారు. ఆ శిరస్సులు చెట్టుకొమ్మకి కట్టినట్లున్నాయి. ఇది చెట్టో, గాలంపు కొంకియో? పై గడిలో వీరిద్దరికీ ఇటూ అటూ అచ్చరలున్నారు. ఏనుగుమీది వాడు పద్మాసనస్థుడై వ్రేలాడే వీరి శిరస్సుల నుత్తరించి వీరి వీరకృత్యానికి సాయపడినవాడా?

పుష్పగిరిలో జైనధ్వంసము కాబోలు వీరకృత్యముగా శిల్పించబడిన శిల వున్నది. ఒక వీరుడు చేత కత్తి పట్టి ఒకని శరీరముమీద నిలబడ్డాడు. ఈ పడినవాని వెనక తలతెగి ఇంకొకడు పడివున్నాడు. వీరుడు కుడిచేతితో ఇంకొకనికి జుట్టుపట్టి తల కోయడానికే కాబోలు లాగుతున్నాడు. చిత్రాని కిటూ అటూ దీపము సెమ్మెలు వెలుగుతున్నాయి. పైన ఇటూ అటూ చామర ధారిణులు. వీరుని జుట్టంతా ఉండవలె కుడి భుజమునకు కొంచెము పైన వున్నది. కత్తి మాత్రము ఇందాకటి వీరులు మెడ కోసుకుంటూన్న కత్తివంటిదే. శ్రీశైలములో శ్వేతాంబర జైనులను చంపించినవాడనని ఒక

వీర శైవుడు గొప్పలు చెప్పుకున్నాడు. ఆతనిని మించిన వాడితడు! తానే చంపుతున్నాడు.

నెల్లూరి ప్రాంతములో వీరశైవులు జైన రాజులతో గాబోలు యుద్ధాలు చేశారు. నెల్లూరికి నాలుగు మైళ్లు తూర్పున గల బ్రహ్మగుండము దేవళములో వీర శైవ యుద్ధవీరుల బొమ్మలున్నవి. పుష్పగిరిలో విల్లు నారిని ఆకర్ణాంతము లాగిన వీరుని బొమ్మ కలదు. ఇతడా యుద్ధములో మరణించాడు. పైన శివలోకానికి వెళ్లిన సూచన వుంది. అసమానయుద్ధముకాక మత యుద్ధము చేసినవాడూ వీరుడే అయినాడు శైవము వచ్చిన తరువాత. నెల్లూరు మూలస్థానేశ్వర గోపురము పక్క అశ్వికుని శిల వున్నది. 'ఖడ్గ తిక్కనది' అనడము మామూలు. ద్రోణాచలం నుంచి కర్నూలుపోయే రహదారి కెడమ ప్రక్కన ఇలాటి (యుద్ధ మరణము పొందిన) వీరుల శిల లున్నాయి. అనంతపురము చేరువన రాచానపల్లెలో చక్కని వీరగల్లుంది. దీని పొడవు నాలుగు భాగాలు. అడుగున అశ్వికులు యుద్ధానికి తర్లి వెళ్లడమూ, దానిపైన అశ్వాన్ని పోగొట్టుకునో, లేక, దండయాత్రకు వచ్చే శత్రు దళముతో తలపడో, పాదచారియై అశ్వికునితో యుద్ధము చేసేవీరుడూ, మూడో గడిలో ఇద్దరచ్చరలు కైదండలిడగా విను వీధికి పోయే వీరుడూ, పైన శివలోకములో చామర ధారిణులు వీవనలు విసురుతూండగా శివపూజ చేసుకునే వీరుడూను. కన్నడదేశములోని వీరగల్లమీద యుద్ధవీరుడు విమానములో శివలోకానికి వెళ్లడముంటుంది. అనంతపుర మండలము అమరాపురములో అలాంటి వీరగల్లున్నాయి. ఓరుగల్లుకోట ఉత్తరద్వారములో ప్రవేశించగానే కుడివైపు తుపాకీ బాకూ పట్టుకున్న వీరుడి శిల వుంది. అనంతపురము చెఱువుగట్టున తుపాకిపట్టిన వీరుడూ ఆతనిని బ్రతిమాలే భార్యలూ గల వీరగల్లుంది. యుద్ధమరణముపొందినవారి జ్ఞాపకార్థము శిలాశిల్పాల్ని నిలపడము చిరకాలాగతమే కాదు. చిరానుగతమయిన ఆచారము కూడాను.

నెల్లూరిలో ఆవులను మళ్లించ యత్నించిన వీరుని వీర శిల ఉన్నది. అడుగున ఆవులమంద, దానిపైన ఆవులను తోలుకుపోనెంచే అశ్వికులదండు, ఒక వీరుడు కత్తీడాలూ పట్టినవాడు ఉన్నారు. వానిపైన పుంఖానుపుంఖాలుగా బాణాలు! పైన అచ్చరలూ అతడూను. ఆవులను మళ్లించినవాడే అర్జునుడు. భోగాపురములో కాటమయ్య బొమ్మ ఆతనిభార్య బొమ్మనట ఉన్నవి. కాటమరాజు వెదురుగడను పోలిన కణుపులుగల ఆయుధాన్ని కుడిచేతపట్టి నిలబెట్టినాడు. అతని కుడికాలు ప్రలంబము. ఎడమకాలు ముడిచిఉన్నది. కిరీటమూ, తలచుట్టూ రింగులుగా ఎగిరేజుట్టూను. కుడికాలి ప్రక్కన గుర్రమున్నది. ఇది పౌరాణికశిల్పమేదీ కాదనే అనుకుంటున్నాను. కాటమరాజు గోవుల నిమిత్తము (!) యుద్ధముచేసి మరణించినవాడేగదా ? ఆయనను దేవుణ్ణే చేసేశారు. ధర్మరాజుకీ పాండవులకీ ఓరుగల్లులో గుడివుండేది. నెల్లూరులో కూడా ధర్మరాజుగుడి వున్నది. పల్నాటివీరుల గుడీ వుండేది ఓరుగంట.

పేరంటాండ్రు అనే సతులుకూడా వీరులే. సతీ శిలలు వీరశిలలే. వాటిలో పైకిచూపే గాజులచేతిని చూస్తే మగవారి శరీరములోని కంకాళముకూడా వణుకుతుంది ఆ పాపానికి దోహదముచేసినందుకు. హనుమకొండకు పడమట రెండుమైళ్ల దూరాన్న ఒక అమ్మ సహగమనము చేస్తూ ఆచంద్రార్కమూ కీర్తి నిలవాలనుకున్నది కాబోలు సూర్యచంద్రులను చెక్కినారు ఆమె సతీశిలమీద. ముఖలింగములో ఆలయములోని ఒకశిలమీద భార్యాభర్తలు శివలింగానికి నమస్కారాలు చేస్తున్నారు. వారిపైన సూర్యచంద్రుల బొమ్మలున్నవి. ఈ రెండింటికీ నడుమ అరచేయి, పైకి చూపుతూ ఉన్నది. కనుక అదీ సతీ శిలయే ననుకుంటున్నాను.

అసమానయుద్ధమూ, మతయుద్ధమూ, గోగ్రహణ నిరోధమూ, సహగమనమూ చేసిన వీరులను కీర్తించినది శిల్పముమాత్రమే కాదు, జానపదసారస్వతము కూడాను. అయితే తేడామాత్రము ఉన్నది ఈ రెండింటిపద్ధతిలో. శిల్పము సూచనే చేసిందిగాని కళాసిద్ధికి యత్నించలేదు. పుష్పగిరి వీరశిలల విడిచేస్తే తక్కినవి చేసేది కథనము మాత్రమే. సారస్వత గాథలు కరుణాస్రవంతులు. వీరశిల్పంలో రూపమంతా లోపింపజేసుకొని చేతితోమాత్రము "మాఅశలు అక్కడ" అని చూపే సతీ శిలలుమాత్రమే కళాశూలములు.

# ఆమె ఆఖరి ప్రదర్శనం*

'అక్కన్న'

ఆమధ్య ఎప్పుడో ఒకరోజున టెలిఫోనుగైడులో ఏదో నంబరుకోసం వెతికినపుడు అనుమానం వేసింది. అక్షరాలు, అంకెలు, అలుక్కుపోయినట్లు అవుపడ్డాయి. ఏమిటా అని అనిపించింది. కాస్త భయమేసింది. కాని అంతట్లోనే పరవాలేదనుకుంది. భర్తతోకూడా చెప్పలేదు.

రానురాను వస్తువులన్నీ ఇపుడు, అదోమోస్తరుగా అస్పష్టంగా కనుపడటం మొదలుపెట్టాయి. మొన్న తను కట్టుకున్న చీరెమీద పువ్వులు, పువ్వులుగా కనబడలేదు. ఏవో మచ్చలు, మచ్చలుగా కనుపడినాయి. గుండె జల్లుమన్నది. కడుపులో షాకు ఇచ్చినట్లయింది. అవాళకూడా భర్తకిచెప్పలేదు.

కళ్లజోడు వేసుకుంటే సరిపోతుంది. కళ్లజోడు వేసుకోటంమూలాన తన అందం చెడిపోతుందని భయం లేదు. సినీతారలనేకమంది తాటికాయలంత నల్లఅద్దాలను వేసుకొని తిరుగుతున్నారు. ఇపుడు అది ఒకఫ్యాషనుగాకూడా ఉంది. తనకయితే ఆనల్లద్దాలంటే ఇష్టం లేదు. కాని అద్దాలువేసుకోటం తప్పదు. మనస్సును సరిపెట్టుకోక తప్పదు. నాటకాలలో వేషాలువేయటం తనవృత్తి. పైగా డ్యాన్సు చేస్తూఉంటుంది. తన భర్త తమనాటకసమాజానికి డైరెక్టరు, ప్రొప్రైటరు. స్టేజిమీదకి కళ్లజోడు పెట్టుకుని ఎలావెళతాం! డాక్టరు గణపతి కంటిలోనే గుడ్డుపైన అమరిపోయే అద్దాలను పెడుతాడట. ఇది అమెరికాలో నేర్చుకొని ఈ మధ్యనే వచ్చాడట. ఏరంగు కళ్లుకావాలంటే ఆ రంగు కళ్లుగా కనపడేలాగా అద్దాలు పెట్టువచ్చునట కూడా. తను ఇంకా అందంగా కనపడవచ్చు. తనవృత్తికీ భంగం రాదు. తనేమైనా టైపుచేయాలా? ప్రూఫులు దిద్దాలా? భయంలేదు, అన్నీ మామూలుగానే గడచిపోతాయి. ఇలా అనుకొని గౌరీబాల అవాళే డాక్టరు గణపతికి టెలిఫోను చేసింది. రేపు ఊళ్లోఉండను ఎల్లుండి రమ్మన్నాడు.

గౌరీబాల భర్తపేరు పార్థసారధి. అతనికి చిన్నప్పటినుంచి నాటకాలంటే ఎక్కడ లేని పిచ్చి. చదువు పూర్తయి కాస్త పెద్దవాడవగానే వాళ్లనీ వీళ్లనీ పోగుచేసి విజయవాడలో ఒక నాటకసమాజం స్థాపించాడు. అక్కడక్కడ ప్రదర్శన లివ్వటంజరిగింది. ఆర్థికంగా ఒకప్రదర్శనంకూడా ఎక్కిరాలేదు. దాదాపు ప్రతిసారీ హాలు అద్దెదగ్గరనుంచి అన్నీ చేతిదే పెట్టుకోవాలిసి వచ్చింది. ఏడాది తిరిగేసరికి తండ్రి ఇచ్చిన పొలం ఇల్లూ అన్నీ అమ్మగా వచ్చినడబ్బంతా ఈనాటకాలు దాదాపు మింగేశాయి. ఈ లెక్కన అయితే ఇంకా ఒకటి రెండు ప్రదర్శనాలకన్నా ఇచ్చే సత్తాలేదని తేలింది. ఆ రెండు కలిసి రాకపోతే చిప్ప చేతికి రావటం తప్పదు అనుకున్నాడు. ఇప్పుడు మానెయ్యటమా మరొక చాన్సు చూడటమా అని ఆలోచించాడు. మానేస్తే ఓటమిని అంగీకరించడమే! శతవిధాల అనుకున్నా దానికి మనస్సు అంగీకరించలేదు. ఆఖరి ప్రయత్నం చేస్తేనే మంచిదనిపించింది. అలాగే నిశ్చయించుకున్నాడు. అదీ కలిసి రాకపోతే ప్రక్కనే కృష్ణవేణమ్మ ఉన్నది. ఇపుడు ఓటమి అంగీకరించటం కంటె అదే మేలనిపించింది. ఈ నిశ్చయంతోపాటు ఒకరిద్దరు వేషాలు వేసేవారిని కూడా మార్చాలని తీర్మానించుకున్నాడు. ముఖ్యంగా స్త్రీ వేషం వేసే సరస్వతిని మార్చి ఇంకొకరిని పెట్టాలనుకున్నాడు. మొదటినుంచి ఆవిడలో భలానిదని చెప్పటానికి వీలులేకపోయినా ఏదో ఒక లోటున్నదని అనిపిస్తూనే ఉన్నది. అయితే సమాజం పెట్టినప్పటినుంచి, ఉన్నది కాబట్టి ఆవిడను మానుకోమని చెప్పడానికి మనస్కరించక ఇంతకాలమూ తోసుకురావడం జరిగింది. పైగా ఇంకొకరు వెంటనే దొరకటమూ కష్టమే. ఇపుడలా కాదు. ఇంకొకరు దొరికేమాట తరువాత చూచుకుందాం. ముందర ఆవిడను పంపించి తీరాలని నిర్ణయించుకొని పంపించేశాడు. ఇంకొక మనిషి దొరకడం ఆలస్యం కావచ్చు. అందు మూలాన ప్రదర్శనాలు ఆలస్యం కావచ్చు. ఎలాగైనా ఇది ఆఖరి ప్రయత్నం

---

* కామిలా ఆర్. బిట్లే వ్రాసిన 'హర్ లాస్ట్ పెరఫార్మెన్స్' అన్న ఆంగ్లకథకు అనుసరణ.

గదా, కాస్త ఆలస్యమైనా ఫరవాలేదనుకున్నాడు పార్థసారథి.

సరస్వతిని పంపించివేసిన నాలుగురోజులకి మిత్రుడు దశరథరామయ్యవచ్చి గౌరీబాలనుగురించి చెప్పి ఆవిడను తీసుకోమని సిఫార్సు చేశాడు. గౌరీ బాలకు డ్యాన్సు, పాట కొద్దిగా వచ్చనీ, ఊరు కాకినాడనీ, కొద్దిగా స్టేజి అనుభవం ఉన్నదనీ, చదువుకున్నదీ, తెలివిగలదనీ, శిక్షణఇస్తే పైకి రాగలదనీ దశరథ రామయ్య మరీ మరీ చెప్పేసరికి సరేనన్నాడు.

గౌరీబాలకు ఎడతెరిపిలేకుండా రెండు నెలలు శిక్షణ ఇచ్చాడు. రిహార్సల్సు చేయించాడు. మొదటి ప్రదర్శనం జనం బాగున్నదన్నారు. ఖర్చులుమాత్రం గిట్టినాయి. రెండో నాటకం బందరులో వేశారు. అక్కడ అనుకున్న దానికంటే ఎక్కువ కలెక్షన్సు వచ్చాయి. జనంలో పేరు బాగా పాకిపోయింది. అక్కడనుంచి పార్థసారథికి చక్రం తిరిగింది. ప్రతి ప్రదర్శనం హిట్ అయింది. రెండేళ్లపాటు విధివిరామంలేకుండా ఆంధ్రదేశమంతటా తిరిగి ప్రదర్శన లిచ్చారు. అయిదేళ్ల క్రితం మద్రాసు వచ్చారు. అక్కడ కూడా ప్రదర్శనలు జయప్రదమైనాయి. కొందరు సినిమా నిర్మాతలు గౌరీబాలను ఆటకీ, పాటకీ బుక్ చేసుకున్నారు. దేశంలోనూ, మద్రాసులోనూ, ప్రదర్శన లిస్తూ, అక్కడే ఉండిపోయారు. మద్రాసుకు వచ్చేముందే ఇద్దరూ రిజిస్టరు వివాహం చేసుకున్నారు. వారి వృత్తి జీవనం మల్లేనే వారి దాంపత్యజీవితంకూడా చక్కగా ఉన్నది. తమ పని అన్నా, తామన్నా ఇద్దరికీ ఒకరిపై ఒకరికి ఎక్కడలేని అభిమానము. మద్రాసు వచ్చిన ఏడాదికల్లా వారి కొక ఆడపిల్ల కలిగింది. ఆ అమ్మాయికి వసంత అని పేరుపెట్టారు.

## 2

గౌరీబాల అడయారులో తమ ఇంటినుంచి నుంగంబాకంలో ఉన్న డాక్టరు గణపతి క్లినిక్‌కు బయలుదేరింది. దారి పొడుగునా అనేక ఆలోచనలు పుట్టుకొచ్చాయి. డాక్టరు ఏమిచెబుతాడోనని భయం వేసింది. ఏమి చెబుతే ఏమని ధైర్యమూ తెచ్చుకుంది. గత ఏడుసంవత్సరాలు మహా ఆనందంగా, సుఖప్రదంగా గడిచిపోయాయి. తనకూ, తన భర్తకూ ఇద్దరికీ పేరు వచ్చింది. కుటుంబజీవితంలో ఏ లోటూ లోపంలేదు. వారిద్దరిమధ్య అభిప్రాయ భేదమనేది ఎప్పుడూ రాలేదు. ఇద్దరికీ అన్యోన్యత అనేది బాగా ఏర్పడింది. ఆర్థికంగా కూడా అన్నీ బాగానే ఉన్నాయి. అడయారులో ఉన్నది సొంత ఇల్లు. ఇదీ కాక ఇంకో ఇల్లున్నది. తనకి కావలసినన్ని నగలున్నాయి. బ్యాంకులో ఇద్దరి పేరా వేరు వేరుగా పెద్ద మొత్తాలున్నాయి. తను వేషం వేయకపోవటం మూలాన నాటక సమాజం ఎత్తివేయనక్కరలేదు. ఎత్తివేసినా తన భర్త సినీమారంగంలో ఏదోవిధంగా సంపాదించగలడు. తను మానేసినా ఇబ్బందిలేదు. భర్తని కూతుర్నీ చూచుకుంటూ సంతోషంగా, తృప్తిగా కాలం గడుపుకోవచ్చు. ఇలా అనుకుంటూ ఉండగానే డాక్టరు గణపతి క్లినిక్ వచ్చింది.

కారు దిగి లోపలికి వెళ్ళి కూర్చున్న అయిదు నిమిషాలకే డాక్టరు వచ్చి పరీక్ష గదిలోకి తీసుకుని వెళ్లాడు. కుర్చీలో కూర్చోబెట్టి గోడకు తగిలించిన అట్టలమీద రకరకాల అక్షరాలను చూడమన్నాడు. కనబడుతున్నాయా అన్నాడు. తరువాత తల వెనక్కు వంచమని మందుబొట్లు కళ్లలో వేశాడు.

డాక్టరు పరీక్ష చాలాసేపు చేశాడు. టార్చిలైటు తీసికొని గ్రుడ్డుమీద ఫోకస్ చేశాడు. కళ్లరెప్పలను ఎత్తిపట్టుకుని క్రిందరెప్పను క్రిందికిలాగి టార్చిలైటు వెలుగు అటూ ఇటూ ప్రసరింపచేస్తూ చూచాడు. ఒక కన్ను తరువాత రెండో కంటికీ అలాగే చేశాడు. ఇలా చేసిందే చేస్తుంటే గౌరీబాలకి కాస్త విసుగేసి ఇంకా ఎంతసేపు అనుకుంది. భోజనానికి టైము అవుతోంది... ఈ పరీక్ష ఎంతసేపటికీ తెమలటంలేదు. బజారుకు వెళ్ళి ఇంకా రాలేదేమో అని ఆయన అనుకుంటూ ఉంటారు. అయినా ఎందుకో ఆలస్యమైందిలే అని అనుకుంటారు. పరవాలేదు. అయినా ఈ పరీక్ష ఎంతసేపటికి తెమలందే? కళ్ళజోడు వేసుకోవాలని చెప్పడానికి ఇంత ఆలస్యమూ, హంగామా ఎందుకు! తన రంగుకు, ముఖానికి తగిన కళ్ళజోడును కొనుక్కోవాలి. ఇప్పుడు అనేక రకాల కళ్ళజోళ్ళు వస్తున్నాయి. ఇలా తలుచుకుంటూ తన విసుగును కోపాన్ని తప్పించాలని చూసింది గౌరీబాల. కాని కుదురలేదు...

ఇహ పట్టలేకపోయింది.

"ఇంకా ఎంతసేపవుతుందండీ" అని అడిగింది.

"అచ్చే అయిపోవచ్చింది. అయిపోయింది" అని చెప్పి ఆమె వృత్తిని గురించి, ఆరోగ్యాన్ని గురించి

భర్తని గురించి, కుటుంబాన్ని గురించి ఏవేవో ప్రశ్నలు వేశాడు. అన్నిటికి సమాధానమిచ్చింది. ఇపుడేవస్తానని ఆఫీసు గదిలోకి వెళ్ళి అయిదు నిమిషాల్లో తిరిగి వచ్చాడు.

"ఇంతగా ఇదివరకు ఎవరూ నన్ను పరీక్ష చేయలేదండి" అన్నది గౌరీబాల. డాక్టరు కొంత నవ్వాడు.

"మీ ఆయనకు టెలిఫోను చేశాను. మీ కంట్లో వేసిన చుక్కల గుణం ఇపుడిపుడే తగ్గదు. మీరు ఒంటరిగా ఇంటికి వెళ్ళటం నాకిష్టంలేదు."

"నాకు గుడ్డితనం వచ్చిందనే!" చమత్కరించినట్లు ప్రశ్నించింది గౌరీబాల. డాక్టరు ఒక క్షణం మాట్లాడలేదు. సిగరెట్టు ముట్టించి అన్నాడు. "దృష్టి అనేది పోతూవున్నపుడు గాని దాని విలువ, అవసరం మనకు తెలియవు." ఈ మాటలు నెమ్మదిగా మామూలుగా అన్నాడు.

గౌరీబాల ఒక్క పెట్టున కుంగిపోయింది. తాను గుడ్డిది అయిపోతున్నట్లే గుండె ఝల్లుమన్నది. అయితే తత్క్షణం వట్టిదనుకున్నది.

"నిజం, గ్రుడ్డితనంకంటే దురదృష్టం మరొకటి ఏముంటుందండీ" అన్నది.

"కాని అంతకన్న ఇంకా దురదృష్టమైనవి ఉన్నాయి. ఎందుకంటే మీ బిడ్డకే ఒకవేళ గ్రుడ్డితనం వచ్చినదనుకోండి, అది ఇంతకన్న పెద్ద దురదృష్టం కాదా?"

వెంటనే గౌరీబాలకు వసంతరూపం కళ్ళముందు మెరిసింది. వసంతకు ఇపుడిపుడే అదీ ఇదీ తెలుస్తోంది. దానికే గ్రుడ్డితనము వచ్చి అంతా అంధకారమయమయితే, ఇక ఏమీ తెలియదన్నమాట. ఏమీ కనపడదన్నమాట. వళ్ళు జలదరించిందది.

"అవును. అది ఇంకా పెద్ద అరిష్టమే." అన్నది. అలా అనటంలో తనకు గుడ్డితనంరావటం మేలని తనకు తెలియకుండానే అంగీకరించింది.

"మీ ఆయన వచ్చినట్లున్నారు" అని డాక్టరు ఆవిడను చేయి పుచ్చుకొని తన ఆఫీసు గదిలోకి తీసుకొని వెళ్ళాడు. ఆగది పెద్ద వెలుతురులేకుండా మంచి బంగారువన్నె కర్టెనులతో ఉన్న సంగతి జ్ఞాపకము వచ్చింది. ఇపుడు అవేమీ కనుపడటంలేదు. అంతా మసకగా ఉంది. ఎదురుగుండావున్న రెండు కిటికీలు బయటి వెలుతురును తెలుపుతున్న రెండు రంధ్రాలులాగా కనుపడుతున్నాయి.

"హలో పార్థసారథిగారా" అని పలకరించి "ఆవిడను చాలాసేపు కష్టపెట్టాను" అన్నాడు గణపతి.

గౌరీబాల భర్తను చూడలేదు. చూచేలోపలనే పార్థసారథి ఆవిడ చెయ్యిపట్టుకుని "ఏమిటిదంతా. నువ్వపుడూ ఇలా ఉన్నదని నాకు చెప్పలేదే" అన్నాడు.

"ఎక్కువేంలేదు. మీరు గాబరాపడతారని చెప్పలేదు. దాన్ని గురించి అనుకోకుండా ఉంటే మంచిదనుకున్నాను" అని సమాధానమిచ్చింది గౌరీబాల.

"కూర్చోండి. మనం కొన్ని సంగతులు మాట్లాడాలి" అని డాక్టరు సూచించాడు.

పార్థసారథి, గౌరీబాల సోఫాలో కూర్చున్నారు. డాక్టరు కూర్చున్నది కిటికీముందు. అందుకని అతని వెనకాల వెలుతురు బాగా ఉన్నది. అతను ఆమెకు ఒక నీడగా కనుపడుతున్నాడు. మాటనుబట్టి అతను దగ్గరగానే ఉన్నట్లు అనిపించింది. తాను దేన్ని గురించి భయపడిందో అతను దాన్ని గురించే చెబుతున్నాడు. డాక్టరు మాట్లాడిన ప్రతిమాట ఆమెలోకి గుండులాగా దూసుకొనిపోయి అక్కడే నిలిచిపోతున్నట్లున్నది. కాసేపు అయ్యేసరికి డాక్టరుమాటలు వినబడటం మానేశాయి. తాను గ్రుడ్డిదాన్ని అయిపోతానన్న ఆవేదనలో మునిగిపోయింది. మరో ఇతరజ్ఞానంలేదు.

పార్థసారథి ఆమె రెండు చేతులను తనచేతుల్లోకి తీసుకున్నాడు. గట్టిగా పట్టుకున్నాడు. ఆ వత్తిడిని ఓర్చుకోలేక పోతున్నది. అతనిచేతులు తెలుపుతున్న ఆవేదన డాక్టరు మాటలు కలిగించినదానికంటె ఎక్కువగా ఉన్నది.

ఆవిడ అతనిమీద ఆనుకున్నంత దగ్గరకు జరిగింది. "మీరు విచారపడకండి. ఇప్పటికి ఇదీ నయమే. ఇంతకన్న పెద్ద అరిష్టము రాలేదు" అని సముదాయించింది భర్తని.

"అదేమిటి! ఇంతకన్నా ఇంకా దురదృష్టమేం ఉంది రావడానికి" అన్నాడు బాధతో పెగిలీ పెగలని కంఠంతో.

ఇంతలోకే డాక్టరు అందుకున్నాడు "జబ్బు ఇపుడే ఆరంభమైంది. ఇపుడు ఇదివరకు అనుకోని అసాధారణమైన ఆపరేషనులు అనేకం చేస్తున్నారు

మీ దృష్టి తగ్గుతోంది. కాని ఎంతకాలం ఇపుడున్నట్లుంటుందో చెప్పలేము. అదంతా మీ అదృష్టం. కొంతకాలం చీకటికి వెలుతురుకు భేదం తెలుస్తూ ఉండవచ్చు. దానికి అలవాటుపడి వెనుకటి మోస్తరుగానే ముందుకూడా మీ జీవితాన్ని సంపూర్ణంగా అనుభవించవచ్చు."

"ముందు ఏమి చేయమన్నారు. ఇంకెవరిని చూడమన్నారు" అడిగాడు పార్థసారధి.

ఊళ్ళో ఉన్న డాక్టరు లందరినీ చూచారు. కలకత్తా, బొంబాయిలలో ఉన్న పెద్దడాక్టరు లందరినీ చూచారు. డాక్టరులచుట్టూ తిరగడంతోనే ఆరు నెలలు గడిచిపోయాయి. దాంతో నాటకప్రదర్శనలు అంటూ లేకుండా పోయినాయి. అదివరకు ఏర్పాటు అయినవే విరమించుకోవటం జరిగింది. ఇపుడు వాటి తొందర లేదు.

ఏదో...ఒక డాక్టరు తన వ్యాధిని కుదర్చలేక పోతాడా అనుకుంది గౌరీబాల. కాని ఏ డాక్టరూ ఏమీ చేయలేకపోయాడు. ఆపరేషను అనేది వీలు లేదన్నారు. చూచిన ప్రతిడాక్టరూ చీకటిగదిలోకి తీసి కళ్లి పరీక్ష చేసి లాభంలేదని అత్యంత సానుభూతితో నెమ్మదిగా చెప్పటం తప్ప ఏమీ చేయలేదు.

దాంతో గౌరీబాలకు నిరాశ జాస్తి అయిపోయింది. గ్రుడ్డితనం రాబోతూన్నదన్న భయంతో ఒక్కొక్కప్పుడు ఊపిరితీసికొనడం కూడా కష్టమైపోయేది. భయంతో కళ్లు ఆర్చుకుని గట్టిగా చుట్టూఉన్న వస్తువులను స్పష్టంగా చూడటానికి ప్రయత్నించేది. కాఫీ తాగేటప్పుడు కప్పును తిసుకొని దానిలో ఉన్న కాఫీని, దాని ఆవిరిని, కప్పు అంచుకు ఉండే బంగారు రంగు పట్టీని చూడటానికి కళ్లు విప్పి విప్పి చూచేది. కానీ ఏమీ కనుపడేది కాదు.

ఇక లాభంలేదు అనుకుంది. అయితే ఉన్న ఇతర ఇంద్రియాలకు కొత్త శక్తులు ఉత్పన్నమవుతున్నట్టు అనిపించింది. వాసన, స్పర్శ అనేవి మునుపటికన్న బాగా తెలుస్తున్నాయి. వాటివల్ల కొంత ధైర్యం వచ్చింది. కాని ఇవన్నీ దృష్టిలోపాన్ని తీసివేయలేవు. కాఫీకప్పు కప్పుగా కనపడటంలేదు. ఏదో ఒక గుండ్రని ముద్దగా కనుపడుతోంది. ఆ ముద్దని తనపెదిమలకు అందివ్వాలి.

"ఈ డాక్టర్ల చుట్టూ తిరిగి లాభంలేదు. ఇంట్లో ఉండటమే మంచిది. ఇంకా ఆశలు పెట్టుకొని లాభంలేదు. తోసుకువచ్చేదాన్ని ఎదుర్కొనక తప్పదు" అన్నది గౌరీబాల.

## 3

ఇలా అన్నది కాని లోపల ఆమె దిగులుతో నలిగిపోతున్నది. కుమిలిపోతున్నది. కుమిలి కుమిలి కొన్నాళ్లకు కొంత కుదుటబడి 'దృష్టిలేకపోయినా మిగతావన్నీ ఉన్నాయి. ఏలోటూ లేదు. స్త్రీకి కావలసినవన్నీ ఉన్నాయి' అని అనుకున్నది. అయితే అనుకోటం వేరు. నమ్మటం వేరు. తన జీవితాన్ని యథాతథంగా అంగీకరించగల మనస్థితి ఎప్పటికైనా వస్తుందా అనుకుంది.

ఒకరోజున ఎక్కడలేని భయము వేసింది. ఆ భయంతో ఊపిరి ఆగిపోతుందా అనిపించింది. దగ్గరున్న కూతుర్ని ఒళ్ళోకిలాక్కొని ఆ అమ్మాయి మొహంలో తన ముఖం పెట్టి చూచింది. కూతురికళ్ళలో నీలాలు కనుపడతాయి అనుకుంది. బుగ్గలమీద చిన్నగుంటలు కనుబడుతా యనుకుంది.

"అమ్మా నీ ముక్కులో గాలి నా నోట్లోకి వస్తోంది." అన్నది వసంత. గౌరీబాల నవ్వింది. నా ముక్కు అంత దగ్గరగా ఉన్నదా తల్లీ."

"నీకళ్ల నలుపులో నా ముఖం కనుపడుతున్నది" అన్నది వసంత.

"బాగుంది నాకళ్ళు నీ ఫోటోను తీస్తున్నాయి."

"కళ్లు ఫోటోతీసే కెమెరాలు కాదమ్మా"అన్నది వసంత. లీలగా ఛాయగా కనుపడుతున్న పిల్ల అదృశ్యమైపోయింది. గదిలో తిరుగుతున్నట్లు మాత్రం తెలుస్తున్నది. వసంత కిటికీ దగ్గర ఉండి బొమ్మతో ఏదో మాట్లాడుతోంది. తరువాత చప్పుడు చేస్తూ పళ్లరసం త్రాగుతానంటూ వంటావిడ దగ్గరకు వెళ్లింది.

గౌరీబాల పెద్ద నిట్టూర్పు విడిచింది. తను చదువ గలిగితే ఎంత బాగుండు ననుకుంది. గ్రుడ్డివాళ్ళు నేర్చుకొనే లిపి తనూ నేర్చుకొని ఆ పుస్తకాలు చదువవచ్చు ననుకున్నది. తన ప్రపంచమంతా సంధ్యాకాంతిగా ఉన్నా తనకు తాను చదువుకుంటూ ఉండవచ్చు ననుకున్నది. ఈ సంగతి పార్థసారధికి చెప్పింది. కాని అతను ఏమీ మాట్లాడలేదు. ఆమె దృష్టి ప్రసక్తి వస్తే మాట తప్పిస్తాడు. ఆమె దృష్టి పోతుందని అనుకుంటే ఓటమిని అంగీకరించినట్లే అనుకుంటాడు. గౌరీబాలకు ఈ జబ్బు వచ్చినదన్న మాటనే బయటికి రానీయలేదు. వారు ఆ యా పట్టణాలకు ఎందుకు వెళ్ళుతున్నదీ ఎవ

రికీ తెలియదు. ఆమె వేషాలు వేయడం ఎందుకు మాని వేసింది కూడా చెప్పలేదు. పార్థసారథికి తను వేషాలు వేయటం మానివేయటం ఇష్టం లేదని గ్రహించింది. ఒకరోజు ఇద్దరూ ఆ విషయంలో హోరాహోరిగా వాదించుకున్నారు.

## 4

ఒకనాడు సాయంకాలము ఫలహారం వేళ జరిగింది. తను, భర్తా కాఫీ త్రాగటానికి కూర్చున్నారు. ప్లేటులో వేసిన టిఫిను తీసికొని తిన్నది. కాని కెటిల్ లోంచి కాఫీపోసుకోటం కష్టమైపోయింది. అపుడే వసంత నీళ్ళుపోసుకొని సబ్బు వాసనతో తల్లిదగ్గరకువచ్చింది. తల్లి ముద్దుపెట్టుకున్నది. పిల్లతల తడిగావున్నట్లు అనిపించింది. "అమ్మాయి తల గట్టిగా తుడిచి కొస్త ఆరబెట్టు" అని పనిమనిషి సుబ్బమ్మను పిలిచి చెప్పింది.

పార్థసారథి అందిచ్చిన కాఫీ తీసుకున్నది. కుర్చీలో చేరగిలపడి తను చాలా అదృష్టవంతురాల ననుకున్నది. పార్థసారథిలాంటి భర్త, వసంతలాంటి పిల్ల, సుబ్బమ్మలాంటి పనిమనిషి, తనుఇల్లు ఇవన్నీ చూస్తే తనకు ఏమిలోటు అని అనుకున్నది.

"నేను ఇహ వృత్తి మానివేస్తాను. స్టేజిమీదకు రాలేను.మనం కలిసి 7 సంవత్సరములు అయింది. లెక్కవేస్తే ఆ ఏడేళ్ళలో మూడుసంవత్సరాల కాలమైనా నేను స్టేజిమీద గడిపివుంటాను. ప్రతిరాత్రి 8 గంటలు నిద్రపోతే రెండేళ్ళు నిద్రలో గడిపివుంటాను. ఇకపోతే మీతోనూ వసంతతోను అచ్చంగా గడిపింది రెండు సంవత్సరాలుమాత్రమే అయిఉంటుంది. ఇహ తల్లిగా వేరేప్రసక్తిలేకుండా పూర్తిగా భార్యగా జీవితశేషాన్ని గడపటం మంచిది" అన్నది గౌరీబాల.

"నీవు వేషాలు వేయటం విరమించుకోటం అనేది లేదు. నీవులేకుండా ఈప్రదర్శనను ఇవ్వదలచుకోలేదు" అన్నాడు పార్థసారథి.

"నాతో ఎలా జరుగుతుంది. నాకు దృష్టిపోయిందని అందరికీ ఎందుకు చెప్పకూడదు? నాకు గుడ్డితనం వస్తే అది నాతప్పు కాదుకదా!" ఒకవిధమైన ఆవేశంతోనూ, ఆవేదనతోనూ ప్రశ్నించింది గౌరీబాల.

"నీకు గ్రుడ్డితనం లేదు. లేనప్పుడు నీవెందుకు మానెయ్యాలో నాకర్థంకావటంలేదు. కావలిస్తే నీవు అందరికీ చెప్పు. కాని అసలు ఇప్పుడెందుకు చెప్పాలి! అవసర మేముంది."

"నే నెలా నటిస్తాను! ఎలా డ్యాన్సుచేస్తాను! స్టేజిమీద తడుముకుంటూ, పడుతూ లేస్తూ తిరగమంటారా? ఇంటిపట్టున అంటిపెట్టుకుండటమే నాకు సమ్మతం. స్టేజిమీద కనపడటమే నాజీవితం కాదు కదా? కాదు. నిజంగా కాదు."

"నువ్వేమీ పడవు. సెట్సుని జ్ఞాపకం ఉంచుకుంటే సరి. ఉన్నదల్లా మొత్తం మూడుసెట్సు. వెలుగు అనేది కనపడుతున్నంతవరకు ఏమీ ఫరవాలేదు."

"నా కిష్టంలేదు."

"అలా వీల్లేదు. వేసితీరవలసిందే" అని పార్థసారథి గట్టిగా చెప్పాడు. అతనిధోరణిచూస్తే ఇదిగో ఈమాత్ర వేసుకుంటే నయమవుతుందని చెప్పినట్లుంది. ఆవిడకోసమే అతను పట్టుపట్టుతున్నట్లు కనుబడుతోంది. కాని స్టేజిమీదకు ఎలా వెడతాం అన్నదే గౌరీబాల ఆలోచన, సమస్య.

"నేను మానేస్తానంటంలేదు. ఇంటినీ బిడ్డనీ కని పెట్టుకొని ఉండాలని ఉన్నది. అందుకే దేవుడు నాకు దృష్టిలేకుండా చేస్తున్నాడేమో అని అనిపిస్తోంది."

"అలాంటివిచారం అనవసరం. ఇల్లాలుగా నీలో ఏ లోటూ లేదు. ఇంటిని చూడటంలో అంతకంటే లేదు. ఇంట్లో కూరుకుపోటానికి వాటికి సంబంధం లేదు."

ఇలాఅని పార్థసారథి కిటికీ దగ్గిరికి వెళ్లాడు. కారునలుపు అద్దము మీద వెలుతురు పడితే ఎలా కనుబడుతుందో అలా కనుబడింది కిటికీ దగ్గర పార్థసారథి ఆకారము.

"ఇదిగో చూడండీ. నేను మానేస్తున్నాను అని అనడం ఎందుకు? నిజాన్ని తెలుసుకుంటున్నామనుకోండి. నేనెప్పుడు మానెయ్యవచ్చునో చెప్పండి:" అని అడిగింది.

ఛాయగా ఉన్న పార్థసారథి దగ్గరకు వచ్చాడు. "సగం గ్రుడ్డితనం వచ్చినా స్టేజిమీదకు వచ్చి మామూలుగా నటించగలవని రుజువు చేసిననాడు నీవు మానుకోవచ్చు" అన్నాడు. ఈ మాటలు అతనిలోంచి పగలు తీసికొనివచ్చినట్లు అనిపించాయి. "నేను చెబుతున్నా విను. నేను సమాజంపెట్టి ప్రదర్శనలు ఇవ్వటం మొదలు పెట్టినపుడు ఒక్కటీ ఎక్కిరాలేదు. వేసిన నాటకాలు ఒకటి తరువాత ఒకటి దెబ్బతింటూ వచ్చాయి. అయినా నేను ఊరుకోలేదు. ధైర్యం పోలేదు. ఆస్తి అమ్మి డబ్బుపెడుతూనే వచ్చాను.

చివరికి దివాలాతీసే స్థితిలోకి వచ్చాను. అపుడు నువ్వు వచ్చావు. మన సమాజం దిశ తిరిగింది. నువ్వు అధైర్య పడనవసరం లేదు. ఇపుడొకసారి ఈ స్థితిలో స్టేజిమీదకి వచ్చావా తరువాత అదే అలవాటయిపోతుంది."

"అవునవును. మీరు చెప్పే సిద్ధాంతం తరతరాలుగా అందరూ చెపుతూ ఉన్నదే. ఈ తడవ వేషం వేస్తాను. తరువాత మళ్లీ వేయమంటే వేయను. ముందు నాటికి ఇంతకంటే ప్రౌఢతనం వస్తుంది. ఆ ముందు సంవత్సరానికి ఇంకా ఎక్కువవుతుంది. మీరు మాత్రం పరవాలేదు. నీవు వేషం వెయ్యవచ్చు, ఆడవచ్చు, పాడవచ్చునంటూనే ఉంటారు. నువ్వు ప్రౌఢదానివి అయి విరమించుకున్నావని ఎవరూ అనకూడదంటారు. నిజమేనా?"

"చాల్లే నీ మాటలు" అంటూ పార్థసారధి గౌరీబాలను ఒడిలోకి తీసుకున్నాడు. ఆమె పెదవులను ముద్దుతో మూసివేశాడు. ఆతని కౌగిలిలో అన్నీ మరచిపోయింది. భయము నేది పోయింది. అంతా ఆనందమయంగా కనుపడింది.

గౌరీబాల ఒక నిట్టూర్పు విడిచింది. "సరే ఈ సారికి వేషం వేస్తాను. ఈ వేషాలు వేస్తూ ఉండటమే నాకు జీవితలక్ష్యం కాదు. చదవటం నేర్చుకుంటాను. వసంత దగ్గరే అహర్నిశలు ఉంటూ ఉంటాను. మరో బిడ్డను కూడా కంటాను. పిల్లో పిల్లాడో నాకు ఇంకొకరు కావాలి. ప్రౌఢవాళ్లుకూడా పిల్లల్ని కనవచ్చుకదా?"

రిహార్సలుకు వెళ్ళినపుడు కొంతమందికి చెప్పక తప్పిందికాదు. సుబ్బమ్మకు అదివరకే తెలుసు. అందుకనే అదివరకు ఏ సామానులు ఏ వస్తువులు ఎక్కడెక్కడ ఉన్నాయో అన్నీ అక్కడే ఉంచింది. గౌరీబాల ప్రతిచోటికివెళ్ళి అన్నిటినీ ముట్టుకొని చూచింది. సుబ్బమ్మ లేకపోతే గౌరీబాలకు కష్టమయ్యేది.

రిహార్సల్సుకూడా నాటకం వేసినట్లే వెయ్యడానికి నిర్ణయించుకున్నారు. గ్రీనురూములో కూడా ఏర్పాటులన్నీ పూర్వంలాగానే చేశారు. అక్కడ తనకు అదీ ఇదీ అందిచ్చి అన్ని పనులుచేసే రత్తమ్మ అంతా ఊహించుకున్నది. వేషాలు వేసే మిగతావారికి కూడా తెలిసింది. వారందరు ఆమె విచారపడ్డంత గానూ విచారపడ్డారు. ఎవరికీ చెప్పకూడదనుకున్నారు. రహస్యాన్ని జాగ్రత్తగా కాపాడారు.

రిహార్సల్సు స్టేజిమీద ప్రారంభించారు. మొదట్లో కొత్త ఆ బల్లమీద, ఆ కుర్చీమీద పడటం జరిగింది. తరువాత అన్నీ అలవాటు అయిపోయినాయి. అందరూ వెళ్ళిన తరువాత ఆవిడా పార్థసారధీ స్టేజినుంచి లోపలికి, లోపలినుంచి స్టేజిమీదికిరావటం అభ్యాసం చేశారు. ఏ సీనులో ఎట్లా తిరగాలో అట్లా స్టేజిమీదంతటా తిరిగారు. సాయంకాలం ఇంట్లో కళ్ళకు కట్టినట్లు అంతా పార్థసారధి నూరిపోసేవాడు. అందువల్ల అంతా సులువుగానే కనపడింది.

పాత్ర సంభాషణలు కూడా పార్థసారధి చదివి వినిపించి, అనిపించి, వల్లెవేయించాడు. ఆమె నాటిని అప్పచెబుతూ అంటుంటే ఎక్కడాకూడా ఒక పొరపాటు రాలేదు.

అమాంతంగా ఆమెకు ఎక్కడలేని ఆనందమూ కలిగింది. ఈ నాటకము ఏలాగైనా వేయటం అవసరం అనుపించింది. అది జయప్రదంగా వేసి అందరి మెప్పు పొంది తన కీర్తిగంటలు మోగుతుండగా విరమించటం బాగుంటుంది. అందుకనే భర్త అంత పట్టుబట్టాడు ఈ నాటకం ఎలాగైనా వేసితీరాలని. తను వేషం వెయ్యాలనుకుంటే ఇంకా వేసి ఉండేదాన్నే నన్నధీమాతో జీవితశేషమంతా అనుకుంటూ ఉండవచ్చు.

నాటకము వెయ్యటానికి ఇంకా రెండు వారాలే వ్యవధి ఉన్నది. అంతవరదాకా ముద్దలు ముద్దలుగా కనపడే నలుపూ తెలుపూ ఒకే రంగులాగా కనపడటం మొదలుపెట్టాయి. నీడనీడలుగా ఇపుడు కనబడటం అనేది లేదు. దగ్గరకు వెళ్ళి చూస్తే అదివరకు వస్తువులు లీలగా ఏవో అంచులల్లే కనుపడ్డుతున్నాయి. మొదట మనస్సు బెదిరింది. కాని ఇదంతా తను భయపడి ఊహించుకుంటున్నాననుకుంది. అంతవరకు రావటానికి ఇంకాచాలా కాలం పడుతుంది అనుకుంది. వ్యవధికోసం భగవంతుణ్ణి ప్రార్థించింది.

ఒకరోజు ఉదయం లేచేసరికి కడుపులో ఏదో ఆవేదన పుట్టుకొచ్చింది. పక్కలో అటూ ఇటూ దొర్లి ఎదురుగుండా ఉన్న కిటికీలోకి చూచింది. కిటికీకి అవతల బాల్కనీలో ఉన్న అరటి ఆకులాంటి ఆకులున్న క్రోటను మొక్క అదివరదాకా నీడగా కనుపడేది. ఇపుడూ అది అక్కడే ఉన్నది. ఉన్నదని ఆమెకు తెలుసు. ఆ క్రిందటి రోజున సుబ్బమ్మను అడిగితే అది అక్కడనే ఉన్నదని చెప్పింది కూడాను. కాని ఈ ఉదయము అది కనుబడలేదు. కిటికీమాత్రం పొగరంగు తెలుపులో ఒక చట్రంలాగా కనపడుతున్నది. గది మిగతాభాగమంతా ఒక విధమైన అంధకారంతో నిండిపోయింది.

నెమ్మదిగా లేచి బాత్ రూములోకి వెళ్లింది. అలవాటు చొప్పున టూత్ బ్రష్ ఉన్నచోటునుంచి

తడుముకోకుండానే తీసుకున్నది. అలమార తెరచి పేస్టు తీసుకొన్నది. తరువాత హెయిర్ బ్రష్ తీసుకున్నది. ఇవన్నీ చేసుకుంటూనే ఉన్నా ఒక ప్రక్కనిమాత్రం భయం తొలుస్తూనే ఉన్నది. దాన్ని విడిపించుకోటానికి పెనుగులాడుతున్నది. క్రింది పెదిమను గట్టిగా కరచుకొన్నది. ఏమైనాసరే ఈ నాటకం అయ్యేవరకు ఈ మార్పును భర్తకు చెప్పకూడదనుకున్నది. ఇది "నాకు పరీక్ష" అనుకున్నది.

భోజనంచేసే గదిలోకి వెళ్ళి కుర్చీలో కూర్చున్నది. కిటికీలోంచి నీరెండ ఆమె భుజంమీద పడి మెరిసింది. "ఇవ్వాళ పెసరట్లు మంచి వాసన వేస్తున్నాయి. చాలారోజులైంది తిని. ఇదిగో మీరు పేపరు చదవటం మానేయండి. చాలా మంచివారుగాని కాస్త కాఫీ ఇలా పొయ్యండి" అని భర్తతో సల్లాప ధోరణిలో అన్నది. అంతా మామూలుగానే ఉన్నట్లు అనిపించింది. చెవులు, ముక్కు అలాగే చెబుతున్నాయి. కాని భోజనాలగది అంతా ఒకే నల్లని సాగరంపులో ఉన్నది.

"అమ్మాయి ఏదీ?" అని అడిగింది.

"నువ్వు లేచిరావటం ఆలస్యమైంది. నేను అది ఇందాకే తినేశాము. ఇవాళ సిద్ధమవటానికి ఇంత ఆలస్యమైందే?" అడిగాడు పార్థసారథి.

"ఏమీలేదు, వట్టి బద్ధకంతప్ప" అని సమాధానమిచ్చింది. కాని అంతరంగంలో భయపడింది. తను మామూలుగా రాలేకపోతున్నానా అని. ఏదీ చేసుకోలేనేమో? రాలేనేమో? భగవంతుడా అనుకొని ఆయనకు ఇపుడపుడే చెప్పకూడదని మళ్ళీ నిర్ణయం చేసుకొన్నది.

"నీవు క్రిందటి తడవ కళ్ళు పరీక్ష చేసికొని ఎన్నాళ్ళయింది?" అని అడిగాడు పార్థసారథి.

"ఆట్టే రోజులు కాలేదు!"

"ఎన్నిరోజులైందంటే?"

"పదిహేను రోజులైంది."

"ఇవాళో రేపో ఇంకొకసారి చూపించుకుంటే నయం."

"ఎందుకు? అనవసరం."

"అనవసరం అంటావేమిటి. పదిరోజులకో పదిహేను రోజులకో ఒకతడవ చూపించుకోటం మంచిదనుకున్నాంగా! ఈమధ్య ఏమైనా మార్పువచ్చినట్లు అనిపించిందా?"

"లేదు."

"డాక్టరుకు ఫోనుచేసి ఎప్పుడు రమ్మంటాడో అడుగుతాను. నేనూవస్తాను."

"అబ్బే! మీరెందుకు. నేను ఒక్కర్తెనూ వెళ్ళగలను."

"వెళ్ళాలనే, వెళ్ళగలవనే నేను చెప్పేది. నీకలాంటిశక్తి ఉన్నది" అన్నాడు ఉత్సాహంగా.

అతనిమాట నిజంకావాలనుకున్నది. మనోనిశ్చయమేకనుక సరిపోతే తను ఎప్పుడూ నిస్సహాయత అనుభవించనక్కరలేదు. డాక్టరునూ చూడనవసరంలేదు. ఇప్పుడూ అనవసరం. నాటకం వేయటానికి ఇంకా పంరోజులుంది. తన్నేదీ ఆపలేదు, ఏదీ అడ్డలేదు. ఏమైనా ఆ నాటకంలో వేషం వేసి తీరాలిసిందే. తనకిదొక అగ్నిపరీక్షలాంటిది. ఆనాటకం వేస్తేనేగాని తనకూ మనశ్శాంతి ఉండదు. ఆయనకూ మనశ్శాంతి ఉండదు. కాబట్టి నాటకంలో వేసితీరాలిసిందే" అని అనుకున్నది.

తరువాత వారంరోజులు గడవటం యమయాతన అయింది. అప్పుడప్పుడు తనదృష్టి కాస్త నయమున్నట్లు అనిపించేది. ముఖ్యంగా స్టేజిమీద రిహార్సలు చేసేటప్పుడు ఒక్కొక్కసమయంలో కాస్త ఎక్కువగా అనిపించేది. దీపాలు బాగాఉన్నప్పుడు తోటి యాక్టరు తనదగ్గరకు వస్తూంటే ఛాయగా కనుపడేవాడు.

ఈ చిన్న చిన్న మార్పులే, మహత్తరమైనవిగా కనుపడేవి. రాత్రిపడుకుంటూ రేపు ఇంతకన్న బాగా ఉంటుంది. నేనింతత్వరగా ఎందుకూ పనికిరాకుండా పోను అని అనుకునేది. ఒకప్పుడు దృష్టి కాస్తబాగానే ఉన్నట్లుండేది. అయితే అది కొద్దిక్షణాలపాటు మాత్రం. కాని ఆశకలిగించటానికి చాలు.

## 5

ఆరాత్రి నాటకప్రదర్శనానికి భార్యాభర్తలిద్దరు కారులో బయలుదేరారు. భర్తకి దగ్గరగా ఆనుకొని కూర్చున్నది. పార్థసారథి ఆవిడ నడుంపైన తన చేయివేసి దగ్గరకు తీసుకున్నాడు.

"ఎలావుంది?" అడిగాడు.

"బాగానే ఉంది."

"నేను ఆసాంతము దగ్గరలోనే పక్కనే ఉంటాను. భయపడకు."

"అవును. నాకు భయమెందుకు ?" ఇలా అన్నదే కాని నాటకశాలవద్ద కారుదిగి లోపలికి వెళ్లటం ఎలాగు అని ఆలోచిస్తూనే ఉన్నది. ఇంటిదగ్గర కారులో ఎక్కేటప్పుడు తడుముకోవలసి వచ్చినది. ఇప్పుడు దిగేటప్పుడు ఎలా ఉంటుందో అని ఆందోళన పడుతున్నది. ఏమీ లాభంలేదు. అంతా అంధకారమయంగా వుంది. ఇంటికి పోదామని చెప్పాలనుకుంది. అయితే అలా ఉన్నదని నమ్మటానికి తనకే ఇష్టం లేక పోయింది. ఇంకా కనపడటం అనేది పోలేదు. చూడగలను అని తమాయించుకుంది. కారు ఆగేసరికి సంధ్యవెలుగులా కాస్త కనపడింది. అది నాటకశాల దీపాలకాంతి అయిఉండవచ్చు. ఆ కాంతి ఆమెలో అంతర్గతంగా ఉన్న ఆశారేఖ కావచ్చు. కాని దాంతో ఆమెకు ఆత్మవిశ్వాసం ఏర్పడింది. ధైర్యం వచ్చింది.

రత్తమ్మ వచ్చి ఆవిడను గ్రీనురూములోకి తీసుకొని వెళ్లింది. బట్టలు మార్చి వేషధారణ చెయ్యటానికి రత్తమ్మ సహాయపడింది. ఆమె చేతులు తగిలితే హాయిగా ఉన్నది. ఆవిడ చేతులు తొందరలేకుండా తొట్రుపాటులేకుండా బలంగా చురుగ్గా పనిచేస్తున్నాయి. చప్పున రత్తమ్మ చేయితీసి కొన్నది. తన చెంపకు హత్తుకుంది.

"రత్నం! అంతా సరిగా జరిగిపోవాలనికోరుకో."

"ఇంకా ఎక్కువైనట్లున్నదే." ? అంది రత్తమ్మ జాలిగా.

"అవును."

"అయితే వారికి చెబితే మంచిదేమో?"

"వద్దు. ఇపుడే వద్దు." అని ఆతురతతో కూడిన తీవ్రతతో అన్నది. స్టేజిమీదికి వెళ్లబోయే ముందు వెనుక ఎక్కడో విన్నది జ్ఞాపకము వచ్చింది. కొత్తగా పుట్టిన పిల్లనైనా సరే నీళ్లలో పడవేస్తే ఈదటానికి ప్రయత్నిస్తుంది. అది తలుచుకుని ధైర్యం తెచ్చుకుంది. స్టేజిమీదికి వెళ్ళింది. సరిగా నాలుగు అడుగులువేసి స్టేజిమీదకి వెళ్లవలసిన చోటికి వెళ్లేసరికి ఆసీనులో బల్లమీద పువ్వులు అమర్చిఉంటాయి అని తెలుసు. వాటి వాసన తెలిసింది. అక్కడ నుంచుని తన ముఖం కుడివైపుకు భుజంమీదుగా తిప్పితే పురుషవేషం వేసిన అతని రాక అలికిడి వినబడుతుంది. అలాగే వినబడింది. అలా అతనూ వచ్చాడు. కొత్తగా పుట్టిన పిల్ల ఈదగలిగితే దీంట్లోంచి నేనెందుకు బయటపడలే ననుకుంది. ఇలా అనుకున్న మరుక్షణంలోనే పాత్రాభినయానికి ఉపక్రమించింది. దాంతో తనను తాను మరచిపోయింది. పాత్రలో కలిసిపోయింది. పాట అభినయం ఆమెను తరంగాలమీద తేలించి ఆకాశానికి ఎత్తుకుపోతున్నట్లు అనిపించింది. ఆనాడు ఆమె గొంతు ఒక మహాతంత్రి మ్రోగినట్లుగా ఉన్నది. గొంతు ఎప్పుడూ పలకనట్లు పలుకుతోంది. ప్రేక్షకులు మోళీకట్టినట్లుగా ప్రతిమలలా కదలక మెదలక కూర్చుండిపోయారు. హాలంతా మహా నిశ్శబ్దంగా ఉన్నది.

ఆమె పాత్రాభినయం అయిపోయింది. నెమ్మదిగా సైడు కర్టెనులవైపు తిరిగింది. పది అడుగుల వేస్తే లోపలికి వెళ్ళవచ్చని కాళ్ళకి చెప్పింది. పది అడుగులు వేసే సరికి సరిగా రత్తమ్మ చేయిపట్టుకొని తీసకొని వెళ్ళింది.

రంగంమీదనుంచి వెళుతుంటే పెద్ద పెట్టు చప్పట్లు హర్షధ్వానాలు చెలరేగాయి. అవి సముద్ర ఘోషలాగా తుపానుమోతలాగా వెనుకఉన్న గ్రీన రూములోకి వెళ్ళేదాకా వినబడుతూనే ఉన్నాయి.

అక్కడికివెళ్లిన కాసేపటికి వణుకుపుట్టింది. తన భయపడుతున్న అంధకారం ఆవరించింది. నల్లచీకటితప్ప ఇంకేమీ కనబడటంలేదు. భర్తను పిలిచింది. గా స్వరంతో నెమ్మదిగా పిలిచింది. చేతులు చాచింది చూపులేనివాడు తడుముకుంటున్నట్లు ఎదట తడిమి చూచింది. అది ఏమిచేయలేనిస్థితిలో చేసేపని. ఇవ్వాళ దీన్ని ఎదిరించి ప్రతిఘటించింది.

రత్తమ్మవచ్చి పట్టుకుంది. "ఆయన ఇక్కడి ఇంకా రాలేదమ్మా" అన్నది.

"నువ్వుచూచావా రత్తమ్మా? ఎలాపాడాన టావు? ఎలా అభినయించానంటావు? మామూలు చేశానా? వాళ్లందరికి తెలిసిందంటావా?"

"ఇంతబాగా ఇదివర కెపుడు చేయలేదమ్మా నిజం! ఎపుడూ ఇంతబాగాలేదు. చెబితేనమ్మ."

బైట మనుష్యులు తోసుకొస్తున్న చప్పుడు వి బడింది. పార్థసారథి తలుపుతోసుకొని అమాం

లోపలికివచ్చాడు. ఆమెను చప్పున కౌగలించుకున్నాడు. ఆమె తనతలను అతని హృదయంమీద ఆనించింది. కౌగలివదలి ఆమె రెండుభుజాలు పట్టుకొని ముఖంలోకి చూస్తూ "బయట జనం పొంగిపోతున్నారు నిన్ను చూడాలని. వారినిరానిస్తే ఈగది బద్దలై పోతుంది.ఒకర్ని మాత్రం రానిచ్చాను. ఆయన విజయవాడలో ఉన్న ప్రుడు మన ఇంటిడాక్టరు రామారావుగారు. తన అభినందనలు తెలియజేయటానికి వచ్చాడు." అన్నాడు.

"చాలా థ్యాంక్సు డాక్టరుగారూ" అని డాక్టరుతో అన్నది...

డాక్టరు ఆమెనుచూస్తూ కొన్నిక్షణాలపాటు అలా నిలబడిపోయాడు.

"మీరు నాతో ఎందుకు చెప్పలేదు" అన్నాడు పార్థసారథివంక చూచి.

"ఏమి చెప్పలేదంటారు?" అడిగాడు పార్థసారథి.

"మీభార్య గ్రు—" వాక్యాన్ని పూర్తిచేయకనే చటుక్కున ఆగాడు. కాని గౌరీబాలకు "గ్రుడ్డిద" నే వినబడింది.

గుడ్డి! గుడ్డి! గుడ్డి! ఈమాటతో చెవులు గింగురెత్తిపోతున్నాయి. సంవత్సరం దాదాపు ఆమాటను తలచుకుంటూకుంగిపోయింది. ఆమాటభయంతో నే జీవించింది. కాని ఇప్పుడు అది ఒకమాటమాత్రమే అని అనిపించింది. అంతే తేలింది. ఆ అంధకారం తనని కబళించలేకపోయింది. తాను ఎప్పటి గౌరీబాల లాగానే ఉన్నది. తనలోనిజీవశక్తి యథాప్రకారంగానేఉన్నది. జనం కూడా ఇదివరకటి గౌరీబాలే అనుకున్నారు.

తను ఏదో వింత అనుభూతిని పొందుతోంది. ఆ అనుభూతితో తనశరీరం గగుర్పొడిచింది. తను గగనమార్గానికి తారాజువ్వలాగాఎగిరి అక్కడపగిలి పువ్వులై ప్రసరించినట్లనిపించింది. ఒక నూతన ప్రపంచంలో ప్రవేశించబోతున్నట్లున్నది. స్పర్శసౌఖ్యం, శబ్దమాధుర్యం, వాసనానుభూతి, ప్రకాశించటానికి స్టేజిమీద వెనకఉండే నల్లతెరలాంటిది మాత్రమే అక్కడి అంధకారం. అక్కడ సత్యం, ప్రేమ అనే దీపాలకాంతిని అచ్ఛాదించటానికి వీలులేదు. ఆ ప్రపంచంలో తనకు ఒంటరితనము అనేదిలేదు. తనభర్త ఉన్నాడు.

ఇంటికివచ్చారు. పార్థసారథి ఇంటితలుపు తెరిచి అమెను పదమన్నాడు. భయపడవద్దన్నాడు. గడపదాటి గౌరిబాల చేతులుచాచింది. అతను అక్కడ ఉన్నాడు. అతను తనచేతులకి హృదయానికి కనుబడుతున్నాడు. అవి అతన్ని చూస్తున్నాయి. దగ్గరకు తీసికొని ఆవిడ హృదయంమీద తన తలపెట్టి గట్టిగా కౌగలించుకున్నాడు పార్థసారథి. ఒక మాటకూడా మాట్లాడలేదు. ఆ మౌనమే అంతా చెబుతోంది. ఆ క్షణంలో భవిష్యత్తు స్పష్టంగా జాజ్వల్యమానంగా సాక్షాత్కరించింది. అది ఒక మహోత్కృష్టమైన సందర్శనం!

# విమానయానము : జ్యోతిశ్శాస్త్రము

శ్రీ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు

నానావిధ విజ్ఞానశాస్త్రముల అభివృద్ధికై కోట్ల కొలదిగ ద్రవ్యమును వెచ్చించుచు ప్రణాళికలను సిద్ధపరచి నిరంతర నిర్నిద్రదీక్షతో వానిని కార్యరూపమునకు తెచ్చుటకు భారతప్రభుత్వము విశ్వప్రయత్నము చేయుచుండుట మనదేశపు పూర్వపుణ్య ఫలము. వివిధవిషయములలో సూక్ష్మ పరిశోధనము సలుపుటకై అభియుక్తులగు తద్జ్ఞులతో పరిశోధనశాలలేర్పరచబడినవి. ఖండాంతరములకు బోయి ఆయా శాస్త్రములను గురించిన సాంకేతిక రహస్యముల నభ్యసించి వచ్చుటకై ప్రతిభావంతులగు యువకులకు విద్యార్థివేతనము లియ్యబడుచున్నవి. నూతన పద్ధతులతో పారిశ్రామిక సంస్థలు స్థాపించుటకై ఖండాంతర విద్యావంతుల సాహాయ్యము నార్జించుటకొరకు ఎన్నియో సన్నాహములు నడుచుచున్నవి. ఉత్తమ పరిశోధకులకు బిరుదులు, విరాళాలు, బహుమతులు, ఉపకారవేతనములు, మున్నగువాని మూలమున మంచి ప్రోత్సాహము జరుగుచున్నది. శిల్పశాస్త్ర విషయములే కాక, వాఙ్మయము, సంగీతము, నాట్యము, చిత్రలేఖనము, మొదలగు లలితకళలకు సయితము దోహద మిచ్చు కార్యక్రమము లున్నవి. క్రమక్రమముగా, ఇట్టి అభ్యుదయ కార్యములు ఇతోధికముగా స్వతంత్ర భారతము నిర్వహించుననుటకు సందేహము లేదు.

కాని, ఒక్కటి మాత్రము చింతాకరము. శాస్త్రములన్నింటిలో అతిప్రాచీనమై, వేదాంగమని ప్రఖ్యాతి గాంచియున్న జ్యోతిశ్శాస్త్ర మొక్కటిమాత్రము, ఏ గ్రహచార వైషమ్యవశముననో మన రాజ్యాంగమువారి కరుణాకటాక్షవీక్షణముల నందుకోజాలినది కాదు. అస్పృశ్యతాదోషనివారణమునకు బద్ధకంకణమైయున్న రాజ్యాంగమునకు ఈ శాస్త్రమొక్కటి మాత్రము అస్పృశ్యమగుట విషాదకరము. కార్యనిర్వాహకులకు జాతకశాస్త్రమునందు భక్తి విశ్వాసములు, లేకపోవుటయే దీనికి కారణము కావచ్చును.

దీనికొక విచిత్ర పరిణామము ఫలము. భారతదేశమున జనసామాన్యమునకు జ్యోతిశ్శాస్త్రముపైన గౌరవప్రతిపత్తు లుండినా, రాజకీయోద్యోగములలో నుండు నవనాగరిక విద్యావంతులకు అవిచార రమణీయమగు ఒక దృక్పథము పట్టువడినది. జాతకఫలములను తెలుసుకొనవలయునను అభిలాషయుండినా, ఆ విషయములు బైటపడినచో, పై అధికారుల దృష్టిలో తాము లోకువ అగుదురని వారి భయము. ఈలోగా, నాకొక విశ్వవిద్యాలయాధ్యాపకునినుండి జాబొకటి వచ్చినది. "పరమ రహస్యము" అను శీర్షికతో అందున్న వాక్యము లివి.

"ఆర్యా! నాకు జ్యోతిష్యము తెలియదు. దాని యందు నాకు విశ్వాసము సహా లేదు. కాని, నా జాతకమునుగూర్చి మీ ఊహ లెట్లుండునో, తెలుసుకొనుటకు మాత్రము కుతూహలమున్నది. అనుజ్ఞ అయినచో, నా జాతకమును పంపుకొందును."

ఏమి చిదంబరరహస్యమో ఇది? ఈ మూడు ముక్కలు వ్రాయుటసయితము ఇతరులకు తెలిసినచో, అతనికి అవమానమో, లేక భీతియో? ఆ మాననీయునికి నా ప్రత్యుత్తర మిది.

"మహాశయా!

జాతకశాస్త్రమందు విశ్వాసములేని మీరు జాబు వ్రాసి మీ అమూల్యమగు కాలమును వ్యర్థపరచుకున్నారు. మీవంటి వారి ఉబుసుపోకకై వినియోగించుటకు నాకు సహా కాలము చాలదు. క్షమింపుడు." అని.

ఏమి ఈ పండితుల వైదగ్ధ్యము?

అది యట్లుండె. జ్యోతిషము శాస్త్రమే కాదను విమర్శక శిఖామణులు కొందరున్నారు. కొందరు రసిక శిఖామణులు దీనికి 'కళ' అను బిరుదము ననుగ్రహించుచున్నారు. స్వప్రయోజనపరులు పరప్రతారణమునకై ఏర్పరచిన ప్రణాళిక ఇది యని వేరు కొందరు పండితమ్మన్యులు దీనిని తూలనాడుచున్నారు. ఈ శాస్త్రమును అభ్యసించినవారు, పరిశోధించినవారు, అనుభవము నార్జించినవారు, మాత్రమే ఇది శాస్త్రమా, కాదా, ప్రయోజనకరమా, నిష్ప్రయోజనమా, అను సమస్య

లను తేల్చవలసినవారు. అంతే కాని, పరప్రత్యయముపైన ఆధారపడునట్టి ఇతర విమర్శకులకట్టి అధికారము లేదని, పాపము వారి బుద్ధికి తోచదు.

లోకకల్యాణమునకై ఉపయోగపడు శాస్త్రమిదియను ప్రఖ్యాతి అనేక శతాబ్దములకు పూర్వమే దీనికి వచ్చినది. స్వార్థలేశము కాని లేక, నిష్కామకర్మపరాయణులగు వశిష్ఠ పరాశరాది ప్రాచీన మహర్షులు చెప్పినవే దీనికి మూలసూత్రములు. ప్రాచీనకాలంనుంచి సుప్రసిద్ధులయిన చక్రవర్తులనేకులు దీని నాదరించి ప్రోత్సహించిరి. గ్రంథజాలము అపారముగానున్నది. మన దేశ మట్లుండగా, ఖండాంతర దేశములలో సయితము ఈ శాస్త్రము అభివృద్ధిగాంచుచున్న కాలమిది. విపుల పరిశోధనముల మూలమున అచ్చటి విద్యాధికులు నూతనాంశములను గ్రహించుచున్నారు. ఇట్టి పరిస్థితులలో ఇది శాస్త్రము కాదనుట ఏమి నీతి?

పోనిత్తము. ఈ శాస్త్రసూత్రములు లోకకల్యాణమునకు పనికివచ్చునా, లేదా, అను సందేహమున్నచో ఇతర శాస్త్రములవలె దీనిని సయితము పరిశోధించుట న్యాయము. రాజ్యాంగమువారో, విశ్వవిద్యాలయ సంస్థలో, పరిశోధనమును సాగించి, తత్ఫలముగా, ప్రాచీన సూత్రములలో ఏవి సాధులో, ఏవి సందేహాస్పదములో, తేల్చినచో ఎంతో లోకహితము కాగలదు. కాలానుసారముగా జనులులో కలిగిన ఆదర్శభేదములవలన, ఏ సూత్రములకయినా అపవాదము లేర్పడు పక్షమున, అట్టివి నెల్లడించుట సయితము సముచితకార్యమే కాగలదు. వాతావరణపు మార్పులు, వర్షపాతాదులు, వ్యవసాయోపయుక్త విషయములు, దాంపత్యానుకూల్యము, బాలారిష్టాదులు, సంతానప్రాప్తి కాలము, మున్నగు ఎన్నియో లోకకల్యాణమునకు పనికివచ్చు విషయము లున్నవి. జ్యోతిశ్శాస్త్రదృష్టితో వానినిగూర్చి పరిశోధనము సలుపుట లోకహితము కాదా?

ప్రారంభమున ఏ ఒక్కటో, రెండో విషయములను గూర్చి పరిశోధనము నారంభించవచ్చును. ఉదాహరణార్థము. విమానయానమును గైకొందము. విమాన ప్రమాదములనుగూర్చి జ్యోతిశ్శాస్త్ర దృష్టితో పరిశోధనము సలుపుట ఇప్పటి కాలమున ఎంతో ప్రయోజనకరము. వార్తాపత్రికలు అప్పుడప్పుడు ప్రచురించుచున్న విమాన పతనకథలు చదువుచున్నచో హృదయము తరుగుకొని పోవుచున్నది కదా? ప్రముఖ వ్యక్తులనేకులు విమాన ప్రమాదముల కారణమున అపమృత్యువుపాలగుచుండుట దేశమునకు తీరని లోటు. విమానయానసంస్థలు వృద్ధియగుకొలది ప్రమాదముల సంఖ్య సహా పెరుగుచున్నది. ఇట్టి ఘోర సంఘటనములను తగ్గించుటకై, రాజ్యాంగము వారెంతో ప్రయాసపడుచున్నారను మాట సత్యమే. విమాన చోదకులను, విమానములను, విమానాశ్రయ సామగ్రిని, పరీక్షించుటకు నిపుణులయిన వారిని నియమించుచున్నారు. విమానములు పడిపోయినవని సమాచారము వచ్చినసంటనే, ఆ స్థలమును పరీక్షచేసి, పడిన కారణము నరయుటకై తగు వారిని పంపుచున్నారు; న్యాయనిర్ణేతలతో విచారణ చేయించుచున్నారు. వాతావరణములోని మార్పులు సూచించుటకు నిపుణుల నేర్పరచి యున్నారు. ఇట్టి కార్యములన్నియు ప్రభుత్వమువారీ విషయమును గూర్చి ఎంత యోశ్రద్ధ వహించుచున్నారనుటకు ప్రబలనిదర్శనములు.

కాని, ఇన్నింటితోపాటు జ్యోతిశ్శాస్త్రజ్ఞుని అభిప్రాయమును సయితము వారీ సందర్భమున సేకరించి యుపయోగించుకొన వచ్చును. ప్రమాదకరములగువిమాన ప్రయాణములు ఏ దినమున, ఏ యే క్షణములలో, ఆరంభించరాదో, కనుగొని అట్టి కాలములలో ప్రయాణము లారంభించకుండా కట్టుదిట్టములు చేయవచ్చునుకూడ. ఇందులో అసాధ్యమేమియు లేదు.

ఇంతే కాదు. విమాన చోదకుల నెన్నుకొను సందర్భములో సయితము జ్యోతిశ్శాస్త్ర సూత్రములను నిరాదరము చేయరాదు. జే. ఏ. గోల్డు స్మిత్ అను పాశ్చాత్య శాస్త్రజ్ఞుడు చెప్పినట్లు "వాయు విమాన ప్రమాదములను సూచించు జాతక ప్రయోగములు కల యువకులను విమాన చోదకులుగా నియమించుట బాధ్యతారహితమగు కార్యము." వైమానికులు కాగోరువారికి ఎన్నియో పరీక్షలున్నవి కదా? వైద్య శాస్త్రజ్ఞుడు, యంత్రశాస్త్రవేత్త, మనస్తత్త్వ శాస్త్రనిపుణుడు, మున్నగువారెందరో వారిని పరీక్షింతురు. "ఇవి మాత్రమే చాలవు. జాతక పరీక్ష సహా అత్యవసరము." అని లండన్ దివ్యజ్ఞాన సమాజపు అధ్యక్షుడు, ప్రముఖ జాతక శాస్త్రవేత్తియునగు కార్టరు పండితుడు ఘంటాఘోషముగా చాటినాడు. ఇట్టి పరీక్షలో కష్టమేమియు లేదు. దీనికి మహోగ్ర పరిశోధకశాలలు అక్కరలేదు. అపూర్వ యంత్ర తంత్ర సామగ్రితో పనియుండదు. జన్మదినము, జన్మకాలము, జన్మస్థానము, తెలిసినచో యోగ్యతకల జ్యోతిష్కుడు జాతకమును గుణించి, ఆ

వ్యక్తికి వాయు విమానప్రమాదము కలుగు సంభవము న్నదా, అపమృత్యుదోషము కలదా, అను సమస్యలను నిర్ధారించగలము. అట్టి వ్యక్తి వైమానిక వృత్తి నవలంబించినచో, అతని జీవితమున ఏ వయస్సు అట్టి ప్రమాదములకు అవకాశమిచ్చునో, తెలుపుట సయితము సులభమే. దుష్ట దశాకాలములో ఆ వ్యక్తి విమాన చోదకుడు కాకుండ ఊరకున్నచో చాలు. ఈ మాత్రపు జాగరూకత తీసికొన్నయెడల, విమాన ప్రమాదముల సంఖ్య ఎంతో తగ్గిపోగలదు. అపమృత్యుయోగము కలవ్యక్తి విషమదశాకాలములో విమాన సారథియై ఆకాశ ప్రయాణము నారంభించినచో, తన కథ ఎట్లయినా, ఏ కర్మము నెరుగని ప్రయాణికుల నేకులకు పరలోకప్రయాణము సిద్ధపరచగలడు. ప్రమాదముల పాలయిన విమాన చోదకుల జాతకములు పరిశీలించితి మేని, దీని సత్యము కరతలామలకముగ చూపట్టుటకు సందేహము లేదు.

"వారివారి కర్మాధీనముగా వారికి ఫలానుభవము కలుగును. కనుక, ఈ పరీక్షలేల?" అను సిద్ధాంతము నవలంబించునట్టి విమానములకు, విమాన చోదకులకు సహా ఇప్పుడు నిర్వర్తించియుండు పరీక్షలన్నియు, నిస్సారములు, నిరర్థకములు కాగలవు కదా? రాజ్యాంగ నీతి ఈ సూత్రమును నమ్మినయెడల, వైద్యశాలలు, ఆరోగ్యశాఖలు, ప్రవాహ నిరోధక ప్రణాళికలు, క్షామనివారణోపాయములు, సంతాన నిరోధక కృత్రిమ మార్గములు—ఇట్టివే ఇంకెన్నియో కలవు కదా?—వీనికై చేయుచున్న, చేయనున్న, అపార ధన వ్యయమంతయు బూడిదెలో చేయు హోమమగును.

పలుమాటలేల? ప్రమాదముల పాలయిన విమానములు బయలుదేరిన కాలము, స్థలము, విమాన చోదకుని జాతక సామగ్రి, మున్నగు వివరములను సేకరించి, రమారమి నూరు సందర్భములను పరిశీలించి చూడుము. జ్యోతిశ్శాస్త్ర సూత్రములకు విలువ యున్నదో లేదో, తేలగలదు. ప్రజా సముదాయ హితార్థమై ప్రభుత్వము ఈ కార్యమునకు ఎప్పుడైనా పూనుకొనగలదా? ప్రకృత స్థితిలో ఇవి అడియాసలు.

ఈ అరణ్యరోదనమును చాలించి, చదువరులకు దృష్టాంత మొకటి నివేదింతును.

విమాన ప్రయాణములో అపమృత్యువు వాతబడిన ఒకానొక యువకుని సాయన జాతక మీ క్రింద నున్నది.

జన్మదినము——————8-8-1924.

జన్మకాలము——————5-6-5 P.M.(IST)

అక్షాంశ——————14-4 ఉ.

రేఖాంశా కాలము————5-1-28 పూ.

| | | | |
|---|---|---|---|
| వ 20-49 (వ) కు 3-52 (వ) | పుణ్యా 22-58 | | |
| కే 20-23 | (సాయనము) — జన్మకుండలి — | | శుక్ర 5-36 అపమృత్యు 6.36 య 12-53 |
| I 18-41 | | | ర 15-36-54 ఇంద్ర 19-57 VIII 21-47 రా 23-20 ప్రమా 23-48 |
| మృత్యు 25-43 గు 10-3 | చ 19-54 | శ 26-56 X 27-57 | బు 12-4 |

ఉన్నత విద్య (విక్రమభావములో వరుణుడు), చక్కని దాంపత్యము (సప్తమభావములో శుక్రుడు), అభివృద్ధి సూచకమగు మంచి ఉద్యోగము (లగ్నాధిపతి శని ఉచ్చుడై దశమ కేంద్రమునందు), ఆర్థికవసతి (లాభములో చంద్రుడు), కల తరుణుడితడు. స్వయంకృషితో చక్కని ఉద్యోగము నార్జించిన సాహసియే కాని, బుధ గురువులు పరస్పర కేంద్రవేధలో నుండు కారణమున, శక్తి సామర్థ్యములను సద్వినియోగము చేసుకొనలేక పోవచ్చును. నీచ చంద్రునికి వరుణుని కోణదృష్టి యున్నది. స్వతంత్రాభిప్రాయములు, దృఢమయిన ఆత్మవిశ్వాసము, కొంత తల బిరుసుతనము, స్వయంసిద్ధ స్వభావము చూపట్టును.

అవి యట్లుంతము. చర్చనీయాంశము అష్టమ భావమునకు సంబంధించిన దగుటచే ముఖ్యముగా దానిని గమనింతము గాక. ఆ భావమందు కొలువుదీరియున్న గ్రహకూటమును చూచినంతనే గుండియ లదరుచున్నవి. అష్టమాధిపతి రవి ప్రబలుడై ఆ భావమందే యున్నాడు.

# విమానయానము : జ్యోతిశ్శాస్త్రము

"అష్టమే చాయు షోవృద్ధిః,
శుభయోగేక్షణాత్ శుభం."

అను సూత్రము ఆయుర్వృద్ధియనుచున్నది. కాని, రవి అష్టమ స్థితికి "అల్పజీవిత" మను ఫలము సయితము కలదు.

"ఏకగ్రహస్యసదృశే ఫలయోర్విరోధే,
నాశంవదే ద్యదధికం పరిపచ్యతేతత్."

అను వరాహమిహిరుని సూత్రములచే పరస్పర విరుద్ధములగు ఈ ఫలములు నశించినవి. కాని, ఈ రవి మాయదారి ఇంద్రుని సంయోగమునే అభిలషించుచుండుట! ఈ గ్రహద్వయమునకు చంద్రునితో కేంద్ర వేధ! ఈ వేధా ఫలము అష్టమభావము నంటియున్నది. మోసమో, వ్యామోహమో, మాదక ద్రవ్యసేవనమో, తల బిరుసుతనమో, కారణముగా యుక్తాయుక్త వివేచన నశించిన స్థితిలో మృతి కలుగునని సూచన. అష్టమభావమున కభిముఖుడై నాల్కలు చాచుచుండు మహా రాహువు అపమృత్యుభయము తెలుపును. అష్టమ భావపు ద్రేక్కాణము సూచించు మరణ కారణము లలో పతనమొక్కటి యని "సారావళి."

"విషశస్త్రయోగ దోషైః,
అభిశాపాద్వా, తథాచ, పాతాద్వా,
అంత్యే సింహత్ర్యంశే,
భవతిచ మృత్యుర్న సందేహః."

ఇక ఆ ద్రేక్కాణాధిపతియో, సాహసప్రియుడగు కుజుడు. చతుర్థ (వాహన, పాతాళ) భావాధిపతియై అష్టమరాశి (సింహ) నవాంశలో ఇతడుండుట! అగ్నిభయము, యంత్రచోదితవాహన ప్రమాదము, మృత్యుభావఫలములకు ఈ కుజుడు జోడించగలడు. అష్టమభావములో వర్గోత్తమాంశలో నున్న రవి మరణ కారణములలో 'లోహ' ప్రభావమును చేర్చునని యవన మతము.

ఈ యోగముల సమష్టిఫలము వాహనప్రమాదమును సూచించుచున్నదనవచ్చును. కాని ఇది నిరుపాధికమగు సాక్ష్యమని చెప్పుట సాహసమని నా భావము.

ఆకాశయానముతో ముఖ్యమయిన సంబంధముగల వాడు వరుణుడని నానావిధ పరిశోధనముల మూలమున పాశ్చాత్యులు తేల్చియున్నారు. ప్రశంసా విషయము విమాన ప్రమాదమగుటచే, ఈ జాతకమున ఆ గ్రహ స్థితిని గమనించుట కర్తవ్యము. జాతకములో సామాన్య ప్రయాణములకు సంబంధించినది తృతీయ (విక్రమ) స్థానము. అందున్నాడు వరుణుడు. వాహన భావాధిపతియగు కుజుని మనమిచట నిరాదరించరాదు. ఈ హేమాహేమీ లిద్దరును తృతీయ వ్యయాధిపతియగు బృహస్పతి యాజమాన్యములో నుండువారే. ఈ గ్రహముల మధ్య బిందువు మీనరాశిలో 12°-20' లో నున్నదని పాఠక మహాశయులు గుర్తించగలరు. దూరప్రయాణములు, ఆకాశయానము, నవమభావమునకు సంబంధించినవి. ఆ భావాధిపతి బుధుడు ప్రబలుడై అందే యున్నాడు. విమానప్రయాణ విద్యా నిపుణుడు జాతకుడు. ఈబుధునికి గురువుతో గుప్త శత్రుదృష్టి! ఆకాశ యాన విషయమున యుక్తాయుక్త విచారమున కిది ప్రతిబంధకము. ఇట్టి బుధునికి మీనరాశిలోని కుజ వరుణ మధ్య బిందువునకు నికరముగా సమసప్తకము! బుధుని కార్యము కుజ వరుణుల క్రూరశక్తి మీద తులా భారము తూగుచున్నదనుట! సమయము దొరకెనేని, వరుణుడు తటాలున ఈ బుధుని "బోల్తా" కొట్టించ గలడు. ఇంతమాత్రమే కాదు. ఈ కుజ, వరుణ, బుధుల సమష్టి వేధ. ధనుస్సులో 12° వ భాగకు వచ్చుచున్నది. ముఖ్యముగా వాహన ప్రమాదములకు సంబంధించిన విశిష్టభాగమిది. ప్రకృత సమస్యలో ఈ ప్రబల విషమ యోగమున కెంత విలువ యున్నదో, ఊహించుట సులభము.

సారాంశమేమన, అపమృత్యుదోషముకల అష్టమ భావముతో, ఆకాశయాన ప్రమాదమును సూచించు యోగములుగల వ్యక్తి యీ జాతకుడనుట. చాలదని కాబోలు వరుణుని ప్రతినిధియనబడు 'ప్రమాద'సహమము సయితము దుష్టగ్రహములతో 'భాయి భాయి' యనుచు అష్టభావమునే ఆశ్రయించి యున్నది. ఇట్టి జాతకునికి విమానయానము అపమృత్యువు నాహ్వానించగలుగుట ఏమి వింత? ఇతడు విమానయాన విద్య నభ్యసించుట పరలోకయాత్రకు పాథేయము కట్టుట కాక మరి ఏమి?

జాతక వ్యాఖ్యానము లిట్టివి. కాని, తగిన దశ రావల యును కదా? అంతదనుక ఈయోగములు వేచియుండక తీరదు.

దేవమానదశా పద్ధతిలో ఈ జాతకమునకు 1951వ సంవత్సరపు మే నెలకు, చలితగ్రహ మిట్లు రూపరించినది.

చలిత జాతకము

| | | | |
|---|---|---|---|
| వ 19-51(వ) | | పుణ్య 20-30 | |
| శు 27-23 (వ) కే 21-55 I 20-0 | (సాయనము) — చలిత గ్రహస్థితి (విమాన ప్రమాద కాలమునకు) | | య 13-12 ష 25-38 |
| మృత్యు 20-30 | | | ఇ 20-56 రా 21-55 |
| గు 11-15 | చ 13-15 X 28 3ల | శ 29-4 | ర 11-23 ప్రమాద 19-30 బు 25-3 (వ) |

జన్మకాలమున అష్టమస్థానాధిపతియగు రవి ఇపుడు తృతీయ (ప్రయాణ), వ్యయ (స్వయం కృతాపరాధ) భావాధిపతియగు బృహస్పతితో నికరముగా కేంద్ర వేధనందు కొనుట గమనించదగినది. ప్రయాణములో అజాగరూకత పనికిరాని దశ యిది. చలిత రాహువు అష్టమభావ బిందువును కబళించుచున్నాడు. అపమృత్యు సూచక మిది. బుధుడు శుక్రునితో మిత్ర దృష్టికివచ్చి, వినోదవిహారములపై అత్యాశ కలిగించినాడు. కాని, ఆ శుక్రునికి సార్ధకేంద్ర విషమదృష్టిలో నున్న గురువు అది అవివేకమనుచున్నాడు. ప్రమాద సహామము వరుణునికి ఎదురై ఘోర పరిణామమును నాహ్వానించుచున్నది. ఇవన్నియు నిట్లుండ, లగ్నము జన్మచంద్రుని కేంద్రవేధకుపోయి, అష్టమభావములో మాయావి ఇంద్రుని సహవాసమందున్న రాహువునకు సమస్తపకమైనది. ఇది మహాఘోర దశ. పుణ్యసహామము రాహుకేతువుల నడుమ తటపటలాడుచు ప్రారబ్ధమునకు చెల్లుచ్రాసి నిలువతేల్చుమని చిత్రగుప్తుని ప్రోత్సహించుచున్నట్లున్నది. ఆకాశయానాధిపతి బుధుడు మృత్యు సహామమునకు కేంద్రములో నిలిచి వీపుతట్టుచున్నాడు. చలితమృత్యు సహామమునకు, వరుణునికిని సరి మధ్యమునకు పోయి లగ్నము "చతురానన, నాగతి ఏమి?" అనుచున్నది.

దశలిట్లుండగా ఆకాశయానము చేయుట ఎంత ప్రమాదము?

1950, మే నెల, 8 వ తేదీ నాడు రాత్రి 11-52-44 పి. ఎమ్. (I. S. T) గంటల కాలములో జాతకునికి ఇరువదియేడవ వర్ధంతి వచ్చినది. ఆ వర్ష ప్రవేశకాలమునకు జాతక మిట్లుండెను.

వర్ష జాతకము

| | | | |
|---|---|---|---|
| పుణ్య 16-36 మృత్యు 11-38 గు 4-42 | రా 0-29 ప్రమాద 6-23 | I 14-23 | న 17-49 అపమృత్యు 26-27 |
| X 5-25 | (సాయనము) — వర్ష జాతకము — (1950-51) | | వ 7-37 శు 20-30 |
| | | | ర 15-36-54 య 17-47 |
| VIII 11-24 | | కే 0-29 ఇ 15-5 కు 28-50 | బు 10-3 శ 18 3 |

విషమదశాకాలములో, అప్పటి వర్షజాతక మేమనుచున్నదో, చిత్తగింతురుగాక. లగ్నాధిపతికి అష్టమాధిపతితో ఏ వర్షమున ఇత్థశాలయోగము వచ్చునో, ఆ వర్షమున మృత్యుభీతి కలుగునని తాజక వేత్తలు చెప్పిరి.

"లగ్నాష్టమేశయోరిత్థ శాలో మృత్యుభయప్రదః."

ఇచట లగ్నాధిపతి శుక్రుడు, అష్టమాధిపతికి మారుగా, ప్రమాద సహామాధిపతి కుజునితో ఇత్థశాల యోగము చేయుచుండుట సందర్భమునకు సరిపడిన యోగము. అందులో, మృత్యు భావమునకు, మృత్యు సహామమునకు సహా అధిపతియగు గురువునుండి ఈ లగ్నాధిపతికి సార్ధ కేంద్రవేధ! గురు బుధ కేంద్రస్థితి ఇచట సయితము ప్రత్యక్షమైనది. వివేచనా శూన్యత ఫలము. ఈ బుధుడు మృత్యు సహామము నెదురుకొని స్వాగత మిచ్చుచున్నాడు.

## విమానయానము : జ్యోతిశ్శాస్త్రము

జన్మకాలపు అపమృత్యు సహమము నాశ్రయించినాడు వరుణుడు. జన్మ వాహన భావాధిపతి యగు కుజునిమీద వర్ష జాతకపు గురువు స్థానము చేర్చరచుకొని యుండుట. ఆ గురువునకో, ఇచట మృత్యు స్థానాధిపత్యము వచ్చుట! వర్షాష్టమ భావము జన్మ గురువు పైనుండగా, వర్షబుధుడు దానితో ఇత్థశాల యోగము చేయుచున్నాడు. జన్మ లగ్నాధిపతి శని వర్ష చక్రములో చలిత ప్రమాదసహమ స్థానము నాశ్రయించి, చలితవరుణుని సమసప్తమ వేధ నపేక్షించుచుండుట!

ఈ వర్షములో విమానయానము అపమృత్యువు తెచ్చుననుటకు ఈ యోగములు చాలునో, చాలవో, అభియుక్తులు గమనించగలరు.

ఈ జాతకుడు విమానచోదక విద్య నభ్యసించుట గొప్ప పొరబాటు. అదిపోతే, విషమదశా కాలములో ఆకాశయానమునకు పూనుకొనుట వివేక మనరాదు. మృత్యువు నాహ్వానించి ఆతిథ్య మీయనేల? చిరుత ప్రాయపు గృహిణి; చిన్నారి సంతానము కల యీ తరుణుడు తన కుటుంబమును గంగపాలు చేయుటకు సిద్ధపడినాడన్నచో తప్పుకాదు. బెంగుళూరు నగరపు హిందూస్థాన్ విమాన నిర్మాణ సంస్థలో రేడియో ఆఫీసరు ఇతడు. ఇతనికి స్వంతముగా నొకచిన్న (సెంటినల్) విమానముండినది. దానిలో అపుడపుడు వాహ్యాళి వెళ్లుట ఇతని అలవాటు.

**1951** వ సంవత్సరమున మే నెల 5 వ తేదీన, మిత్రుడొకడు అత్యవసర కార్యముతో మద్రాసునకు వెళ్లవలసి యుండగా, ఆ సాయంకాలమున అతనిని తన విమానములో నెక్కించుకొని, మదరాసునకు వచ్చినాడు జాతకుడు. అతని కిది ఉబుసుపోక. మదరాసులో స్నేహితులతో కొంత ప్రొద్దు వినోద విహారములు సలిపి, ఆ రాత్రియే మరల బయలుదేరుటకతడు సిద్ధపడినాడు. ఆనాడు అమావాస్య. ఆ రాత్రి ప్రయాణము తగదని పట్టుపట్టినా రతని స్నేహితులు. ఇప్పటి విద్యావంతు లనేకులవలె, ఇతనికి సయితము జ్యోతిషముపైన విశ్వాసము శూన్యము. గ్రహములతో పాటు తానుసహా ఆకాశయానము చేయు ధీరుడుకదా! తాను వానికి భయపడనేల? కాని, మిత్రుల ప్రతిబంధకము ప్రబలముకాగా, కానిమ్మని ప్రయాణమును మానుకొన్నాడు. ఉదయము వెళ్లవచ్చుకదా! గంట ప్రయాణము.

రాత్రి పండ్రెండు గంటలకు పడకపై మేను వాల్చినా, కంటికి నిద్ర అంటినది కాదు. చీకటి రాత్రి వేళ ఆకాశ సంచారము చేయుచు భూమిపై కనుపట్టు దృశ్యములను తనివితీర చూచి ఆనందించవలయునని అతని ఆశ. ఆ రాత్రి కొంతకాలమయినా విమానములో ప్రయాణము చేయవలయునను ఉత్కంఠ అతనికి కుత్తుకబంటి అయినది. మదరాసు నగరముపైననే విహరించుటకు అమావాస్య అయితే మాత్రమేమి? రెండుగంటల వేళ లేచి తన విమానమును ప్రయాణమున కత డాయత్తపరచినాడు. పలుకు తోడులేక ప్రయాణములో రుచి లేదుకదా? ఆ అకాలమున ఎవ్వరు తోడు రాగలరు? అతడు తోడుతెచ్చిన మిత్రుడు అదృష్టవశమున, తప్పించుకొన్నాడు. విమానాశ్రయపు ఉపహారశాలయందలి పరిచారకు డొక యువకుడు కనుపడగా, జాతకు డతనిని ఆహ్వానించెను. అయాచితముగా లభించిన సావకాశమును వృథాపోనీయనేల యని, ఆ అమాయకుడు ఉల్లాసముతో విమానమెక్కినాడు. 2-20 AM (IST) కాలములో విమానము బయలుదేరి క్షణములో గగనవీథి చేరుకొని విహార మారంభించినది.

ప్రమాదకరమగు విమాన ప్రయాణము ఎట్టి ముహూర్తములో ఆరంభమయినదో చూడుడు. అప్పటి గ్రహభావస్థితి ఇది.

| | | | |
|---|---|---|---|
| రా 16-11<br>I 12-40 | గు 3-10<br>బు 28 34<br>(వ) | చ 12-18<br>ర 14-34<br>III 15-23<br>శు 18-52 | కు 24-19 |
| మృత్యు 27-43 | (సాయనము)<br>—<br>విమాన ప్రయాణారంభ కాలము<br>— | | వ 6 35 |
| | | | అవసాన 14-24 |
| X 16-45 | | VIII 14-2<br>ఇ 17-28(వ) | కే 16-11<br>శ 25-59 |

వృషభరాశి **14°** వ భాగలో రవి చంద్ర సంయోగము కానున్న కాలమది. అనగా, జాతకుని చలిత చంద్రునికి సమసప్తక వేధలో, అతని వర్ష లగ్నముపైన, పర్వవేధ ప్రాలినదనుట! యమదేవతాకమై, క్రూరమయిన, భరణీ నక్షత్రములో ఆపర్వమువచ్చుట! సామాన్యముగా ఏ ప్రయాణము కాని చేయకూడని నక్షత్ర మది. అందులో, అపుడు "కలహాలు" యోగ కాలము. విశేష మేమనగా, భరణీ నక్షత్రపు 'విష

'నాడి' ఆ సంవత్సరమున వృషభరాశిలో 11°-50' నుండి 12°-44' వరకు వ్యాపించి యుండినది. ఆ విషనాడీ ప్రదేశములో ఆనాడు చంద్రుడు 1-26 AM నుండి 3-12 AM (IST) వరకు సంచరించుచుండెను. అమావాస్య, కుహూయోగము, భరణీ నక్షత్రము, విషనాడి! ఈ విషమకాల కాలములో విమానయానమా? ఎంత అసంప్రేక్ష్యకారిత్వమిది?

"విషనాడ్యాం, విషాత్ భీతిః,
అపమృత్యు, రథాపివా."

అని ప్రాచీనులు చెప్పిరి. విషనాడి అపమృత్యు ప్రదమని! ఇంతే కాదు. వర్ష లగ్నమునకు, చలిత చంద్రునికి సహా, ఈ పర్వపు క్రూరవేధ. స్వయంకృతాపరాధము నాశనహేతువు కాగలదని వశిష్ఠమహాముని చెప్పినాడు.

"యస్య జన్మర్క్షగః, చంద్రో,
విషనాడ్యాం కుహూర్భవేత్,
అభిచారేణ కింతస్య?
స్వయమేవ మరిష్యతి."

జన్మచంద్రపరముగా చెప్పిన ఈ వాక్యమును, ఉపలక్షణ సూత్రముగా, చలిత చంద్రునికి సయితము అన్వయించుట అసమంజసము కాదు. అందులో, ప్రమాదకరములగు విషమదశలు అలముకొనియున్న వయస్సులో, ఇట్టి యోగము అపమృత్యు ప్రదమగుట వింత కాదు.

విక్రమ భావములో రవి; అవసాన సహమము అష్టమాధిపతి యగు జన్మ రవి మీదనే! మృత్యుసహమము చలితకుజుని (వాహనాధిపతిని) ఆశ్రయించినది. అష్టమభావమును ఇచట సయితము ఇంద్రుడు వదలలేదు. తృతీయాధిపతి (జన్మ దశమాధిపతి) శుక్రుడు వ్యయాధిపతి (జన్మలగ్నాధిపతి) శనితో కేంద్రవేధనే అభిలషించుచున్నాడు. ప్రయాణమునకు తగని కాలమిదియని వేరుగా చెప్పనేల?

ఇట్టి సన్నివేశములలో విమానము బయలుదేరుట! లగ్నమెట్టిదో, చదువరులొక్కసారి దానిని పరామర్శింతురుగాక! క్రూరమగు జన్మ కుజవరుణులమధ్య బిందువు (మీనము 12°-20') వర్ష జాతక మృత్యు సహమమున కాశ్రయమిచ్చుచు, జన్మబుధునితో, చలితరవితో సమసప్తక వేధలో నున్నదికదా? వెతుకుకొనిపోయినట్లు ఈ ప్రయాణారంభలగ్నము ఆ దుష్టబిందువునే చేరుకోవలయునా? అచటి నిక్షిప్తముపై యుండు మారణశక్తుల సమష్టి వలయమును సంపాదించుకొనుటకై "భవతి, భిక్షాం దేహి!" యని ఈ లగ్నము చేతులు చాచుచున్నట్లు చూపట్టుచున్నది కాదా? ఏమి దుర్విధివిలసితమిది?

విమానము వినువీధి చేరుకొన్న పదినిమిషములకే (2.30 A M) అందలి యంత్రములు లెందుకో సక్రమముగా పనిచేయుటకు నిరాకరించినవి. జాతకుడు సమర్థుడే! ఎంతో పోరాడిచూచినాడు. గ్రహముల శక్తి ముందర మానవుని శక్తి ఏపాటిది? అతడెంత ప్రయత్నించినా, యంత్రములు కుదురుకొనలేదు. కుజవరుణులు యంత్రపుకీళ్లలో ప్రవేశించినారా? తెలియదు. ఈ 'పిట్ట' విమానమునకు వారు రావలయునా? వారి ప్రభావముకల భచక్రభాగ చాలదా? పోనిండు. కారణమేమయిననేల? కడకు, 3-5 A M (I S T) లో, మదరాసు నగరమునకు ఏడుమైళ్ళదూరములో, నీరులేని మీనంబాకం చెరువులో, ఆ విమానము కూలి నామావశిష్టమయినదేమో వాస్తవము. ఎంతో అభివృద్ధికి రావలసియున్న జాతకుని కథ అంతటితో సరి. "సహేంద్రాయ తక్షకాయ స్వాహా!" అను న్యాయము అమాయకుడగు ఆతని అనుచరుని కన్వయించినది పాపము!

ప్రయాణదినము, ప్రయాణారంభకాలము విమానపతనకాలము, అన్నియు పత్రికలలో ప్రకటించబడినవే కాని, నా ఊహ కాదు. జాతకుని జన్మకాలాదులు అతని బంధువులనుండి తెలుసుకొన్నవి. ఎవరు గుణించినా (సాయనముగా), పై ఫలములన్నియు స్పష్టముగ చూపట్టగలవు.

వింత యొక్కటి చూడుడు! ప్రయాణ కాలములో జన్మలగ్నాధిపతి శని కన్యారాశిలో 25°-59' లో కూర్చుండి యున్నాడు కదా? జాతకమందలి మృత్యువునకు, వర్షచక్రమందలి అపమృత్యువునకు, నడుమ చిక్కి ఇతడు "S O S" (రక్షింపుడు: రక్షింపుడు!) మంత్రమును పఠించుచున్నాడని అర్థము. ప్రయాణ లగ్నపు దోషము ఇతనిని చేరుకొననిదే 'భరత' వాక్యము రాదుకదా? మీనరాశిలో 12°-20' యందున్న లగ్నము ఆతనిని ఎదురగుటకు 25°-59' దాక జరుగవలసియున్నది. 13° వ అక్షాంశలో, దీనికి నికరముగా 45 నిమిషములు పట్టునని ఎవరైనా గుణించి కనుగొనవచ్చును. ప్రయాణక్షణము (2-20 A. M) నుండి నికరముగా 45 నిమిషములకే (3-5 A. M) విమానపతనము! ఇంద్రజాలమందురా దీనిని? గణిత శాస్త్రము వలె జ్యోతిశ్శాస్త్రము నికరమయిన శాస్త్రము కాదని విమర్శించువారు దీనికి ఏమి సెలవిత్తురో? కాకతాళీయమందురా?

ప్రయాణదినమునకు దైనిక జాతకమును సాధించి చూడుడు. దైనిక కేంద్రము లిట్లె రాగలవు:—

| | |
|---|---|
| X దశమము | $20\frac{1}{2}°$ కర్కాటకము. |
| I లగ్నము | $21\frac{3}{4}°$ తుల. |

చలితమృత్యు సహమమున కెదురై దైనికదశమము నిలిచియున్నది. అనగా, దైనిక చతుర్థము మీద ఆసహమమువచ్చుట! స్వప్రయత్నములో మృత్యువును సంపాదించుట ఇది. వర్ష జాతకమున ఇంద్ర కుజుల మధ్య బిందువు తులారాశిలో $31\frac{1}{2}°$ లో నున్నది. అచటికే దైనికలగ్నము చేరుకొనుట! యంత్రములు మోసగించినవని వాని ఘర్షణమువలన లగ్నము నలిగినదని, అర్థము.

మరియొక నిదర్శనము. వర్ష జాతకములో తృతీయాధిపతి చంద్రుని కేంద్రములో నున్న నవమ దశమాధిపతి శనికి చలితవరుణ వేధయున్నదికదా? వర్ష పుణ్య సహమమునకు ఆశని సమసప్తకము! పూర్వపుణ్యము దెబ్బతినుటే ఇది! మరి దీని ఫలకాల మెప్పుడో, చూతము.

ఆ సహమమునకు ఆశ్రయమయిన భచక్రారము మృత్యుభావస్థానము నెప్పుడు చేరుకోగలదో, అప్పుడే మరొక కారణమున ప్రారబ్ధము ముక్తాయమునకువచ్చును. ఆ భచక్రారమును కదలించి చూతము.

అష్టమభావ బిందువు ఉదయమగు

| | |
|---|---|
| నాక్షత్రకాలము | 11-3 |
| పుణ్యసహమపు నాక్షత్రకాలము | 17-16 |
| వ్యత్యాసము, | 17-47 |
| వర్షప్రవేశదినపు నాక్షత్రకాలభుక్తి | 9 5 |
| మొత్తము | 2-52 |

ఈ నాక్షత్ర కాలభుక్తి ఏ నాటిదో, ఆ నాడే ఫలకాలము. 'ఎఫెమెరీస్' పుటలు త్రిప్పినచో, 5-5-1951 వ తేదీనాటి రాత్రికే యీ నక్షత్ర కాల భుక్తి సిద్ధించునని చదువరులు సులభముగా కనుగొనగలరు. కాలపురుషుని అప్రమేయ ప్రభావములో కాకతాళములు లేవు.

ఇక, వర్ష జాతక కేంద్రములను చలింపచేసి చూతము. వార్షిక కేంద్రచలనపద్ధతిలో గుణించితిమేని, ప్రమాదదినమునకు ఈ క్రిందిఫలము రాగలదు :

చలిత వార్షిక దశమము=$27\frac{1}{2}°$ కుంభము.

చలిత వార్షికలగ్నము=$7°$ మిథునము.

చలిత కుజునిపై ముహూర్తపు మృత్యు సహమముండగా, ఆ స్థానమునే చలితవర్ష జాతకదశమము (ప్రయత్నము) చేరుకొన్నది. జాతకుడు స్వప్రయత్నముతో సంపాదించుకొన్న ఫలము కాదా ఇది?

ఈ సాక్ష్యములు చాలవను కొనువారు ఓపికతో ఈ జాతకునికి ఆధానకాల కుండలిని సాధించి పరిశీలించవలయునని నామనవి. 1923 అక్టోబరునెల 16 వ తేదీన, సాయంకాలము 7-43-48 P.M (IST) గంటలకు గుణించినచో ఆ కుండలి సిద్ధమగును. అందలి యోగములు సహ క్రూరములయినవే. ఆచక్రమునకే ప్రమాద కాలమునకు వేవమానదశలు సాధించిరేని, ప్రబల సాక్ష్యము లభించగలదు. మరియు, ఆచక్రమునకే దైనికలగ్నము ప్రమాద దినమునకు వృశ్చికరాశిలో $28°$ లో, చలితమృత్యు భావాధిపతి గురువుపై నుండునని ఏర్పడును. ఇది అనుభవమును చూపదా? గ్రంథ విస్తరణభీతిచే, ఆ చక్రాదుల నిచట చూపనైతిని. సహృదయుల కింత చాలు.

వంశోద్ధారకుడు కానున్న పుత్రునికోలుపోయి, జాతకుని తల్లితండ్రు లెంత దుఃఖించిరో. ఊహించలేము. పాపము! కంచంత కాపురము గంగలో కలిసిపోగా, పసికందు నెత్తుకొని జాతకుని నవోఢ ఎంత పరితపించెనో? ఈ విషమావస్థలో ఆమెకు అపనింద యొకటి! జాతకమున సౌభాగ్య యోగములేని ఆమెను వరించి వివాహమాడిన జాతకుడు ఆమెదోషము వలననె అకాలమృత్యువు పాలయ్యెనట! ఏమి ఆగడమిది? విమానప్రయాణము నామె ప్రోత్సహించెనా? అమావాస్య నాటిరాత్రి ఆకాశమున గంతులు వేయుమని ఉపదేశించెనా? హితైషులు వలదని ఎంత బోధించినా పెడచెవిని బెట్టిన అతని స్వయం కృతాపరాధ ఫలితమిది. ఆమెకేమి బాధ్యత? ఆమె కీ నింద మోపుట క్షంతవ్యముకాని మహాపరాధము.

పోనిండు. అపమృత్యుదోషము కలవారిని విమానచోదకులుగా నియమించుట, దుష్టదశలు వ్యాప్తిలోవున్న కాలములో వారిని విమానముల నడుపనిచ్చుట అనునవి ప్రమాదహేతువులని పాఠక మహాశయులు గుర్తించగలరు. వలయునన్నచో ఈవిషయమున ఇంకా పరిశోధనము చేయించుట లోక కల్యాణ దృష్టితో విహితమగు మార్గము. అంతేకాని జ్యోతిశ్శాస్త్రమునే హేళనము చేయుట మాత్రము అవిచారకృతము.

కాళిదాస మహాకవి వాక్యరత్నమిది స్మరింతము.

"సంతః పరీక్ష్యాన్యతరత్ భజంతే
మూఢఃపరప్రత్యయ నేయబుద్ధిః"

# గాలిబ్ గీతాలు

శ్రీ దాశరథి కృష్ణమాచార్యులు

ఆర్ద్రదక తైలతో మాటలాడు కొరకు
చిత్రలేఖన విద్య నేర్చితిని నేను

మల్లియ, గులాబి, చంపకవల్లి పూచె
రంగు వేరయ్యెను వసంతురాక చెప్పె

హారిని ప్రార్థింప తలవంచినట్లుగాన
బాగ త్రాగి మ్రొక్కెను మధుభాండమునకు

ఏలకాళ్లు నొచ్చె బాలామణికి? రాత్రి.
ఎవని స్వప్నసీమ కేగివచ్చె?

ఎంత విరుగబూచెనే తోట! శుకపికా
లెగురబోవ కాళ్లు లిరికె పూల

మందుకొలకు తిరిగి మరి హెచ్చె నాబాధ
కాళ్లు గూడ నెత్తు గ్రక్క జొచ్చె

పరుగులెత్తి మొత్తి పట్టుబడితి నేను
బందిపోటు దొంగ పదములొత్త

ఆమె పాద తీర్థమాన గోరితి గాని
కాళ్లు నేలమీద కడిగెనామె

ప్రేయసి గృహవీథి స్మృహతప్పి పడిపోయి
ముదిత కాలి గురుతు ముద్దుగొంటి

అశ్రుధారా వివర్ణ నేత్రాంచలములు
కాంతిలగ గుండె కోసి రక్తమ్ము నిమురు

పగలు దోయంగబడ, రాత్రిపట్టె నిద్ర
నన్ను దోచిన దొంగకు నతు లొనర్తు

చెలికరమ్ముల తెగు వ్రాత కలదు నాకు
కాన ప్రతి కత్తికడ వంచినాను తలను

మబ్బువచ్చి నాదు మడిని పండింపగా
మెరపువచ్చి దాని మ్రింగ జూచె

శస్త్రవైద్యు కత్తి సైతము రక్తాశ్రు
కణములొలికె, నీవు కరుగ వేమె?

అన్నిరోగములకు నౌషధంబుండియు
ప్రణయరోగమునకు కనము మందు

ఎవని ఇలు కాదు, వాకిలియేని కాదు
దారిలో కూరుచుంటి వద్ద నెదరేల

నాదుగుండెగాయము కుట్టు సూదికంట
అశ్రు జలధార దారమై అనతరించె

నేను తోటలో కాలూనినానో లేదో
కోకిలా బృందములు కావ్యగోష్ఠి జరిపె

సతము నీ వాకిటన్ నిల్వ జాలనైతి
రాయినైనను కాని నా బ్రతుకదేల

వీరలే స్వర్గమున దేవ నారులైన
తగు ప్రతీకారమును సేయదలతు నేను

భానుసోమాదులకు తీసిపోని నాదు
నేత్రముల నీ పదాలంట నీయవేమె

నీ పదమ్ముల చుంబింప నీయవేమె
గగనముల తోడ సమమైన కానె నేను?

# భాస్కర రామాయణ విమర్శ పరామర్శ

శ్రీ కె. హెచ్. వి. శర్మ

శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి గారు సెప్టెంబరు నెల భారతిలో మరల భాస్కర రామాయణ కర్తృత్వ, రచనా కాలములను గూర్చి చర్చించి వెనుక వారి వ్యాసమును విమర్శించునపుడు నేను "తప్పుల తడకయు, అబద్ధముల పుట్టయు నగు తెలంగాణా శాసనము లను"టచే గాబోలు కొంచెము కష్టపడి "తెలంగాణా శాసనసంపాదకులు శ్రీ మారేమండ రామారావు గారు (కావలెనని బుద్ధి పూర్వకము గా?) తప్పుడు శాసనములు ప్రకటించినారని నాకప్పుడు తెలియద"ని వ్రాసిరి. శ్రీ మారేమండ రామారావుగారు కావలయు ననియే బుద్ధిపూర్వకముగ తప్పుడు శాసనములను ప్రకటించిరో లేక మన ఆంధ్రుల దురదృష్టము వలననే తెలంగాణా శాసనసంపుట మట్లు తయారయినదియో నాకు తెలియదు గాని ఆ సంపుటి వెలువడిన వెంటనే చారిత్రిక పరిశోధకు లందఱికిని భారతిద్వారా సుప్రసిద్ధ శాసనపరిశోధకులగు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారే కావచ్చు నిట్లు దెల్పిరి.[1] "...శాసనభాగము లిట్లు తబ్బిబ్బులై కానిచో శాసనపాఠము లింత యకటా వికటముగను, అన్వయదుష్టములుగను ఉండునవి కావు. ఇట్లు తబ్బిబ్బుగ పడిన శాసనభాగములును, అన్వయ రహితములుగనున్న శాసన పాఠములును గల యీ గ్రంథమున కెంతవరకు ప్రామాణికతకలదో వేఱే చెప్పనక్కర లేదు. తప్పు మండలివారిది కాదు. శాసన పరిష్కర్తలది......

ఈ విధముగ నున్న గ్రంథము చరిత్ర పరిశోధకుల కంత విశేషముగ నుపయోగపడదు. దీనికి ప్రామాణికతయు తక్కువ. చరిత్ర పరిశోధకులు కానివారలకు దీని ప్రయోజనమే యల్పము. ప్రకటితమయిన గ్రంథము ఉన్నదున్న రీతిని మండలి వారికిగాని, పేరు పెట్టిన శ్రీ లక్ష్మణరావు గారికిగాని అంత ప్రతిష్ఠావహము కానేరదని తెలుపవలసి వచ్చినందులకు చింతిల్లుచున్నాను. ధనమా వ్యయమైనది. ప్రయాసమా అధికమయినది...ఎంతటి యభ్యాసము గలవారి కయినను శాసన పాఠనిర్ణయమున ప్రమాదము లొండు రెండు రాకపోవు. కాని యట్టివి గణనాతీతము లయిన కారణము ననే ఈ రీతిని విచారపడ వలసి వచ్చుచున్నది...ఈ గ్రంథమున ఫలాన శాసనము లున్నవి, విషయమిది యని తెలుసుకొనుటకు తప్ప దీనివలన నితర ప్రయోజనము లేదు."—నా అనుభవమును బట్టి గత రెండుమూడు సంవత్సరములనుండి తెలంగాణా ప్రాంతములలోని శాసన ప్రతిబింబములను దీయించి తెచ్చి పాఠములను సరిచూచునపుడెల్ల శ్రీ శర్మగారి పై వాక్యములు అక్షరాల నిజమని తెలియుచున్నది. అందు ముద్రిత మొక్క శాసనములోని యొక పంక్తి కూడా తప్పులు లేకుండ లేదు. దీనికి తోడు ఏ శాసనమునకు ప్రతిబింబములు ప్రకటించబడలేదు. ఇట్టి గ్రంథమును తప్పుల తడక, అబద్ధముల పుట్ట యనుటలో గల దోషమేమి?

"'తకతోల' యను నింటిపేరే వింతగా 'తలతోక' లేనట్లున్నది. అనియు శ్రీ శర్మగారనిరి. 'గతే తకతోల' అపపాఠము. 'పతేతకతోల' మూలమును కొనుట తప్పు. ఇప్పుడది 'గళిత కపటో' మూలమైనది కాబోలు"నని రెడ్డిగారు అబ్బురపడినారు. అందులకే వారిని చక్కని శాసనప్రతిబింబములతో ప్రకటితమయిన హైదరాబాదు శాసన సంపుటములను జూడుమని మనవిచేసితిని. శాసనపు రెండవవైపున "సర్వాహ్లాదం కలయతి కలానాథవద్భర్తృభక్తః" అని భాస్కరుని తండ్రినిగూర్చి చెప్పి తదుపరి "తస్మిన్నాసీత కులే తకతోల భాస్కరో మంత్రివర్యః"—అని తండ్రి తాతలవద్దగాక భాస్కరమంత్రివద్ద మాత్రము 'తకతోల' కులముని చెప్పియుండెను గాబోలు!

కాని శ్రీ రెడ్డిగారికి కావలసినది శాసనములోని భాస్కరమంత్రి. అతని ఇంటిపేరు తెలిసిన నేమి లేక పోయిన నేమి. వెనుక నొకసారి భాస్కరమంత్రి వంశమునుగూర్చి వ్రాయుచు నీతనిని కవిబ్రహ్మతిక్కన

---

1. భారతి త్రయోదశ సంపుటము; ప్రథమ భాగము పుటలు 372 - 78.

తాతయగు గుంటూరి భాస్కరమంత్రినిగా చేసిరి.2 తరువాత అపపాఠమునుబట్టి 'తకతోల' యనుకొనినారు. ఇప్పుడు దానిని 'హుళక్కి' గా మార్చివేసినారు. ఇకనాతడు భాస్కరరామాయణ కావ్యకర్త కాకపోవుట యెట్లు? అందుచే భాస్కరరామాయణ రచనాకాలమునే ముందునకు లాగివేసిరి. దీనికి తోడు "శ్రీ శర్మగారు భారతిలో ధర్మసాగరశాసనమూలము ప్రకటించునప్పుడీ భాస్కరరామాయణకాలము మార్పు కూడ సూచించియున్నచో నాకీ జవాబుచెప్పెడి శ్రమ లేకపోయెడి"దనిరి. నిజమే, వారికీ శ్రమకల్గించినమాట వాస్తవమేకాని వారింత పరిశ్రమచేసివ్రాసిన తర్వాతకూడ సుప్రసిద్ధ భాస్కరరామాయణకర్తను, ఈ ధర్మసాగర శాసనములోని భాస్కరమంత్రికిని ఏవిధమైన సంబంధము లేదనియే నా నమ్మకము.

భాస్కరరామాయణ కర్తలలో నొక్కడగు హుళక్కి భాస్కరునిగూర్చి అయ్యలార్య, వల్లభామాత్య, ఆంగర నృసింహాది కవు లెట్లు చెప్పిరో చూడుడు.

"అమర హుళక్కిభాస్కర మ
హాకవి చెప్పగనున్న యుద్ధకాం
డము తరువాయి చెప్పెవిక
ట ప్రతిభామణిం డప్పనార్య"

"నన్నయభట్ట తిక్క కవి
నాయకు లన్న హుళక్కి భాస్కరుం
డన్నను జిమ్మపూడి యము
రాధిపు డన్నను సత్కవీశ్వరుల్"

"ఇద్ధగుణుం బ్రబంధ పర
మేశ్వరు నెఱ్ఱన ప్రెగ్గడన్ మనః
పద్ధతి నిల్పి సూక్తిరుచి
భాస్కరుడైన హుళక్కి భాస్కరున్."

వీరందఱు కంఠోక్తిగా హుళక్కి భాస్కరుని కవిత్రయము వారితో చేర్చి సుప్రసిద్ధ మహాకవిగా వేయినోళ్ళ బొగడుచున్నారు. ఇక ధర్మ సాగర శిలా శాసనపు భాస్కర మంత్రి "తస్మిన్నాసీ ద్దళిత కపటో భాస్కరో మంత్రి వర్యః"—అని మాత్రమే జెలుపబడినాడు. నిజమున కీతనికి అక్షరములయిన వచ్చునో రావో మనకు దెలియదు. మరియు భాస్కర రామాయణములోని బాల, కిష్కింధ, సుందర కాండములను విరచించిన మల్లికార్జున భట్టు తన కాండాంత గద్యములలో "అష్ట భాషాకవిమిత్రకులపవిత్ర భాస్కర సత్కవిపుత్ర మల్లికార్జునభట్ట ప్రణీతంబయిన..."—అని చెప్పికొనుటనుబట్టి యాతని తండ్రి యొక్క సుప్రసిద్ధ మహాకవి భాస్కరుండని తెలియుచున్నది. ఈతడే హుళక్కి భాస్కరుండని కవి చరిత్రకారు లందఱు నేకగ్రీవముగ నంగీకరించిరి. నిజమునకు శ్రీ రెడ్డిగారును ధర్మసాగర శిలాశాసనము నుదహరించుటకు గారణ మిదియే. కాని ఆ శాసనపు సరియైన పాఠమునుబట్టి భాస్కర మంత్రికి మల్లన పుత్రుడు గాడని సుస్పష్టము. ఆశాసనమునుబట్టి భాస్కరమంత్రి ఇంటిపేరు హుళక్కియనిగాని లేదా అతడు విద్వాంసుడనిగాని కవియనిగాని దెలియుటలేదు. అట్టి భాస్కర మంత్రిని సుప్రసిద్ధ రామాయణ కావ్యకర్తయగు హుళక్కి భాస్కరునిగా తీసికొనుట యెట్లు? అట్లయినచో కాకతీయుల శాసనములలో పేర్కొనబడిన భాస్కర నామధారు లందఱు రామాయణకావ్యకర్తలే కావలయునుగదా? కాకతిగణపతిదేవుని కాలవెన్ను తామ్రశాసనములో భాస్కరభట్టు, భాస్కరార్యు లిరువురుగలరు.3 అందు వరుసగా పేర్కొనబడిన కౌండిన్య గోత్రజులగు మల్లన, భాస్కరార్యులు రామాయణ కర్తలగు తండ్రి కొడుకులు భాస్కర, మల్లికార్జున భట్టులేయని ఏల వాదించగూడదు? గూడూరు, కొణిదెన, నరసరావుపేట నున్నగు కాకతీయ శాసనములలోని భాస్కర నామధారు లందఱికీ 'హుళక్కి' శబ్దమును చేర్చి రామాయణ కర్తలేయని వాదించుట పాడియా?

ధర్మసాగరశిలాశాసనపు భాస్కరమంత్రి కాలమున సాహిణిమారయ యెవ్వడును లేడు. అందున కృతిపతి కాలము కలసివచ్చుటలేదు. కావున శ్రీ రెడ్డిగారు "శాకల్య మల్లికార్జున భట్టు మొదలైన బ్రహ్మవిద్వాంసులు,...హుళక్కి భాస్కరుడు మొదలుగాగల సత్కవీశ్వరులు...అశ్వంబుల కధికారియైన సాహిణిమారనయు' కాకతీయ ద్వితీయ ప్రతాపరుద్రుని యాస్థానమున నుండినట్లు సోమదేవరాజీయమను కాకతీయచరిత్రలో చెప్పుట కాలదోషము. మొదటి ప్రతాపరుద్రదేవుని కాలము ద్వితీయ ప్రతాపరుద్రదేవుని కాలముగా మారినట్లు కనబడుచున్న"దని ప్రారం

2. భారతి సంపుటము 31, సంచిక 8, పుటలు 196-97.

3. భారతి సంపుటము 37, సంచిక. 6.

భించి "నా మొదటి వ్యాసములో హుళక్కి భాస్కరుడు — సాహిణి మారనలు సమకాలికులని చెప్పుటలో కొంత సత్యమున్నను, కాలచక్రము తప్పుగా కూర్చబడినది. 'గజాధికారి మారయ' అని మార్పుసూచించితిని. ఇప్పు డీతడు గజాధికారి మారయ కాడనియు, 'అశ్వంబుల కధికారియైన సాహిణి మారయ' కాబోలనుట కవకాశమున్నది. క్రీ. శ. 1311 నాటి కోటనెమలిపురి శాసనవంశము 'గజసాహిణి' వంశమే కాని 'అశ్వసాహిణి' వంశము కాదని ఉద్యోగ భేదమువలన విశదమగుచున్న"దని వ్రాసిరి. దీనినిబట్టి గుఱ్ఱముల నౌకరగు మారయయొకడు, ఏనుగుల నౌకరు మారయ మరియొక్కడుండినట్లు, అందు గుఱ్ఱముల నౌకరునికే భాస్కర రామాయణ మంకితము గావించినట్లు దెల్పిరి. భాస్కర రామాయణ కాండాద్యంత పద్యములలో నెక్కడను అతడు అశ్వసాహిణియనిగాని గజసాహిణి యనిగానిలేదు సరిగదా ధరణీరమణోత్తముడుగను, వీరాధివీరుడుగ, సేనాధిపాగ్రేసరుడుగ వర్ణింపబడెను.

"శ్రీరామాకుచయుగళీ
హారిద్రోల్లసితవక్షు హరిచరణ సరో
జారాధ్యుఁడు మారయ ధర
ణీరమణోత్తముఁడు సాహిణీ తిలక మిలన్.

రాజ రీటకీలిత వి
 రాజితనూతన రత్నరాజినీ
రాజన మంగళాచరణ
 రంజిత పాదసరోజ! ఖడ్గధా
రాజయ లభ్యమాన రుచి
 రద్యుతిమన్మణి శాతకుంభవి
భ్రాజిత సద్వితీర్ణ! రిపు
 పార్థివ ఖండన! కీర్తిమండనా!

లాటీ చందనచర్చ, చోళమహిళా
 లావణ్య సామగ్రి, క
ర్ణాటీ గీతకళా సరస్వతి, కళిం
 గాంతఃపురీ మల్లికా
వాటీమంజరి, గౌడవామనయనా
 వక్షోజహారావళియై
పాటింపందగు నీదుకీర్తి రథినీ
 పాలాగ్రణీ సాహిణీ."

భాస్కరునిదే యని చెప్పబడు ఈ క్రిందిచాటు పద్యముగూడ అతడు రాజని దెల్పుచున్నది.

"అప్పు లిడు నతఁడు ఘనుఁడా
అప్పడొసఁగి మరలఁ జెందునాతఁడు రాజా
చెప్పఁగవలె సాహిణి మా
రప్పను దానమున ఘనుఁడు రాజనటంచున్"

ఇవిగాక సాహిణి మారన్ననుగూర్చిన చాటుపద్యము లనేకములు గలవు. అందలి "సంతత సత్కీర్తిహార సాహిణిమారా!; వృథాసృజ త్సాహిణిమార భూపం"— ఇత్యాది సంబోధనలనుబట్టి భాస్కరరామాయణ కృతిభర్తయగు సాహిణి మారన కేవలము గుఱ్ఱపు లేక ఏనుగుల నౌకరుమాత్రము కాడనియు నొకవిఖ్యాత సామంత మండలేశ్వరుడుగా విశదమగుచున్నది. ఆకాలమున కాకతీయులు సార్వభౌములుగాన నీతడు వారికి సామంతరాజుగనుండి వారి దిగ్విజయములలో పాల్గొనుచుండవలెను. అట్టిసాహిణి మారయవంశము, వారిశాసనములే మనకు రామాయణ కాలనిర్ణయమునకు దోడ్పడునవి. భాస్కరరామాయణమునుబట్టి అతని తండ్రి బుద్ధయ, తల్లి కాచమాంబ, రామాయణములోని గొంత భాగమును రచించిన కుమార రుద్రదేవు డాతని పుత్రుడనియు తెలియుచున్నది. కృష్ణా, గుంటూరు మండలములలో కాకతీయుల సామంతులుగ నీ బుద్ధయ, మారయ, అతని పుత్త్రుడగు రుద్రదేవుల శాసనములు కొన్ని గలవు.

సత్తెనపల్లి తాలూకా కోటనెమలిపురి శాసనమును[4] బట్టి "శ్రీ మన్మహారాయ గజసాహిణి, స్వామిద్రోహర గండ మారయ సాహిణి రుద్రదేవనింగారు పల్లినాండు, గురిందాలస్థలము అఱువైయూళ్లను నిజస్థాయిగా నేలుచుండినట్లు" తెలియుచున్నది. ఇందు పేర్కొనబడిన రుద్రదేవుడు మారయసాహిణి కుమారుడనుట నిస్సంశయము. దీనికాలము శా. శ. 1233 విరోధికృత్తు. (క్రీ. శ. 1311). ఆదేసంవత్సరమున పల్నాడు తాలూకా వొప్పిచెర్ల దేవతలబావి యని పిలువబడు నూతియొద్దగల శాసన మొకదానిలో[5] "శ్రీ మన్మహారాయ గజసాహిణిస్వామి ద్రోహరగండ మాచయ

4. శాసన పరిశోధనశాఖవారి 1934-35 సంవత్సరాంత నివేదిక. నం. 307.

5. దక్షిణ హిందూదేశ శాసనసంపుటము 10, నవంబరు 500.

సాహిణిం గారు గురిందాల స్థలము, పింగళి స్థలమూన సహితముగాను అనేక దేశములూను సుఖసంకథావినోదంబులం పృథివిరాజ్యము సేయుచుండంగాను" గుండయనాయునికిని, మారయసాహిణిం గారికిని పుణ్యముగ కొంత భూమిని దానమిచ్చినట్లున్నది. శాసనభాగము కొంచెము చెరిగిపోవుటచే మాచయ సాహిణి, గుండయ నాయక, మారయ సాహిణుల పరస్పర సంబంధము తెలియుటలేదు. ఆ బావివద్దనే గల మరియొక శాసనములో[6] "కాకతియ్య ప్రతాపరుద్రదేవ మహారాజులదివ్యశ్రీ పాదపద్మారాధకులైన స్వస్తి శ్రీమన్ మహారాయ గజసాహిణి, స్వామిద్రోహరగండ గుండయ నాయంకులు గురిందాల స్థలము పింగలి స్థలము సహితముగాను అనేక దేశములు సుఖసంకథా వినోదంబులం బృథివిరాజ్యము సేయుచుండినట్లు" గలదు. దీనికాలము శా. శ. 1221 వికారిసంవత్సరము (క్రీ. శ. 1299.) పైన మాచయసాహిణి శాసనములో పేర్కొనబడిన గుండయ నాయకు డితడే. కొంగెంపూడి సూరేశ్వరాలయపు శాసన మొకదానిలో[7] "స్వస్తి శ్రీమతు స్వామి ద్రోహరగండ, స్వామి వంచకర గండ, ఇమ్మడి నిశ్శంకవీర, పరమమాహేశ్వర, సమయచక్రవర్తి, కలియుగ వీరభద్ర, కీర్తి సముద్ర, జనులిక బోగలింగ, శ్రీమతు మాంచయ నాయకులు" పేర్కొనబడెను. దీని కాలము శా. శ. 1225 శోభకృతు సంవత్సరము (క్రీ. శ. 1303). పల్నాడు తాలూకాలోని తంగెడ[8], మాచెర్ల[9], దుర్గిలలో[10] గల మూడు శాసనములనుబట్టి "స్వామి ద్రోహరగండ, ఇమ్మడి నిశ్శంకవీర కలియుగ వీరభద్ర, జనని కత్రినేత్ర, కాకతి రాజ్యస్థాపనాచార్యులైన స్వస్తి శ్రీమతు మాచయనాయనింగారి కొడుకులు దేవరినాయునింగా" రని తెలియుచున్నది. పైశాసనములలోని మాచయసాహిణి లేక మాచయనాయకులకు గల నిశ్శంక వీర, కాకతి రాజ్యస్థాపనాచార్య మున్నగు బిరుదములు గమనింపదగినవి. కృష్ణాజిల్లా గన్నవరము తాలూకా ప్రగడపత్తను పట్నము శాసన మొకదానిలో "శ్రీమత్సకల సేనాధిపతి మహాసామంత పట్టసాహిణి బుద్ధయదేవ మహారాజు, అతని నిజరాజ్యభారధౌరేయకుండను గుంటూరి విషయ పాలకుండును" పేర్కొనబడినారు. ఇందు కాలములేదు. భాస్కర రామాయణమున సాహిణిమారయ తండ్రిగా చెప్పబడిన బుద్ధయ ఈతడే కావచ్చును.

పై శాసనాధారములను బట్టి తాత్కాలికముగ నాకు తోచిన వీరి వంశవృక్షము నీ క్రింద నిచ్చుచున్నాను.[11]




6. డిటో డిటో నంబరు 488.

7. డిటో డిటో నంబరు 491.

8. డిటో డిటో నంబరు 495.

9. డిటో డిటో నంబరు 505.

10. డిటో డిటో నంబరు 526.

11. వీరుగాక మరి కొందరు 'సాహిణులు' గూడ శాసనములలో కాకతీయ సామంతులుగను, సేనాధిపతులుగను పేర్కొనబడినారు. కాని వారలకు వీరికి గల పరస్పర సంబంధములు తెలియుటలేదు.

వీరందఱు సుమారు 13వ శతాబ్ది యుత్తర భాగమునను 14వ శతాబ్ది ఆరంభమున కాకతీయుల సామంతులుగనుండి గుంటూరిమండలములోని పల్నాటి ప్రాంతమున కంతకు నధిపతులై పాలించుచుండిరనుట సుస్పష్టము. భాస్కరరామాయణములో కృతిపతిని గూర్చి దెల్పిన ధరణీ రమణోత్తమ, రథినీ పాలాగ్రణీ, నిశ్శంకవీర, ఘున్నగువర్ణన, వంశవృక్షము గూడపైన జూపినదానితో సరిపోవుచున్నవి. వీరు కాకతీ రుద్రాంబ, ద్వితీయ ప్రతాపరుద్రుల సమకాలికులు.

"ఇప్పుడీ గజసాహిణి మారయ కృతిపతి కాకపోయినను, అశ్వసాహిణి మారయ భాస్కర రామాయణ కృతిపతి కాకపోడుకద! ఇతడు ద్వితీయ ప్రతాపుని అశ్వసాహిణి కాడనియు, ప్రథమప్రతాపుని అశ్వసాహిణి యనియూ చెప్పవీలున్నది. సోమదేవరాజీయ చరిత్రలో ఈ విషయము పొరపాటుగా మార్చి చెప్పబడినది." అని శ్రీ రెడ్డిగారు వచించిరి. ఓరుగల్లు, కొండవీటి దండకవిలెలలో గూడ నీ విషయమిట్లే సాహిణి మారన్న యాదిగా గలసేనానులు, హుళక్కి భాస్కరాది కవీశ్వరులు మున్నగువారందఱు కాకతి ద్వితీయ ప్రతాపరుద్రుని యాస్థానమున నుండిరనట్లే దెలుపబడినది. మరియు కాకతి ప్రథమప్రతాపరుద్రుని ఆస్థానమున అశ్వసాహిణి మారన్న యొకడు కలడనియు ఆతని వంశము, వర్ణన పైన జూపిన సాహిణి వంశవృక్షముతో సరిపోవునట్లు శాసనాద్యాధారములను బట్టి స్థిరపడినదేగాని శ్రీ రెడ్డిగారి ఈమార్పును అంగీకరించలేము.

"ఈజంట పేర్లు మారయ లిద్దరికిని, ప్రతాపరుద్రదేవు లిద్దరికిని, భాస్కరమంత్రు లిద్దరికిని సమానముగా ఉండుటవలన చరిత్రలో కొన్ని పొరపాట్లు జరుగుట సహజము. అవిగుర్తించి సరిదిద్దుట తప్పుకాదు."— కాకతి ప్రథమరుద్ర ద్వితీయ ప్రతాపరుద్రులకు మధ్య మహాదేవ, గణపతి, రుద్రాంబలచే పాలనముండుటవలన సుమారు నూరు సంవత్సరములకు పైన కాలభేదముగలదు. అదిగాక వారి వారిచరిత్రములను స్పష్టపఱుచగలదు. అట్లే గుంటూరి భాస్కరమంత్రి హుళక్కి భాస్కరులకును గలదు. ఇకనీ జంటపేర్ల కుతోడు శ్రీ రెడ్డిగారు ప్రథమప్రతాపుని కాలమున నొక అశ్వసాహిణి మారయనుగూడ నూతనముగ సృష్టించిన చరిత్రాంశములు తబ్బిబ్బు లగుటయే గాక యెవ్వరికిని సరిదిద్దుటకు వలనుపడదు.

ఈమధ్య బ్రహ్మశ్రీ అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు: భాస్కరరామాయణకర్తలలో నొక్కడగు కుమార రుద్రదేవ కవినిగూర్చి 83 పుటల గ్రంథమును బ్రకటించిరి. అందువారు రామాయణ కావ్యకర్తయగు కుమార రుద్ర దేవుడు కాకతిద్వితీయప్రతాపరుద్రుడే గాని అన్యుడు గాడనియు, భాస్కరరామాయణ కృతిపతి యగు 'సాహిణి మారయ'యే ఆతని తండ్రియు, రుద్రమదేవి మహారాజ్ఞికి ఇల్లరికపు టల్లుడనియు వ్రాసిరి.

శ్రీ శాస్త్రిగారి వాదములోని ప్రధానవిషయమిట్లున్నది.12 "విద్యానాథ విరచితమైన ప్రతాపరుద్ర యశోభూషణమను నలంకార శాస్త్రములోని యొక శ్లోకము—

శ్లో. మురారే ర్యః పూర్వం
జలనిధిసుతాయాముదభవ
న్మహాదేవా జ్జాతః
సపున రవనీభృద్దుహితరి,
వపుష్మాన్ కామోయం
జయతి జగతీ భాగ్యవిభవైః
ప్రతాపశ్రీరుద్రః
స్వయమితి మనీషా మృగదృశాం.

(ఈ శ్లోకమును జూచి కాబోలు నీవల కొందఱు చరిత్రకారులు 'ప్రతాపరుద్రుని తండ్రి మహాదేవరాజు' అని చెప్పుచున్నారు. కాని శ్లేషప్రధానమైన యీ శ్లోకము నాయకౌజ్జ్వల్యమున కుదాహరణముగా వ్రాయబడినది. 'అవనీభృద్దుహితరి' అను నీ పదము ప్రతాపరుద్రుని తల్లి పేరెట్లు కాజాలదో అట్లే మహాదేవశబ్దము నైతమాతని తండ్రిపేరు కాజాలదు. అతని తల్లి ముమ్మడాంబ యైనట్లే తండ్రియు నేదో యొక పేరుగలవాడు కావలసియున్నాడు. కనుక తండ్రి పేరు విద్యానాథు డెచ్చటను చేర్కొనలేదనియే తలంపవలెను. అతని తల్లి పేరు మాత్రము కవిచే నీక్రింది శ్లోకమునం జేర్కొనంబడినది. చూడుండు.

శ్లో. కౌసల్యాసీత్ప్రథమ జననీ
దేవకీ చ ద్వితీయా
విష్ణోర్మాతా తదను మహితా
ముమ్మడాంబా తృతీయా
యస్త్రేతాయాం రఘుపతి రభూత్
ద్వాపరే శౌరి రాసీత

12. కుమారరుద్రదేవికవి. పుటలు46—48, etc.

ప్రాతుం క్షోణీం స జయతి కలౌ
వీరరుద్రావతారః.

(నాయకమహామహిమత్వ సందర్భమున) అయితే "మహాదేవాజ్జాతః స పున రవనీభృద్దుహితరి" అను నీ వాక్యమునకు వ్యాఖ్యాతయగు కుమారస్వామి సోమ పీథి — 'మహాదేవాత్ = మహాదేవనామకాత్ మహారాజాత్, అవనీభృద్దుహితరి = రాజపుత్ర్యాం' అని వ్యాఖ్యానించి 'ఈశ్వరాత్ పార్వత్యా మితి చ ధ్వన్యతే' 'అత్ర మదనతో ఽ ప్యుత్కృష్టా రూపసంపత్తి రుక్తా' అని వివరించియున్నాడు. నాటకప్రకరణములో నున్న—

'భూభృత్సుతా మహాదేవౌ
పితరౌ యస్య విశ్రుతౌ,
నరనాగాకృతిః శ్రీమాన్
సదేవః శ్రేయసేఽస్తువః.'

(అను శ్లోకమునకు గణాధిపార్థమును ముందుగా వ్రాసి పిమ్మట నా వ్యాఖ్యాత 'నూచ్యార్థస్తు యస్య కథానాయకస్య భూభృత్సుతా రాజపుత్రీ ముమ్మడాంబా, మహాదేవ స్తన్నామకో మహారాజః పితరావితి విశ్రుతౌ నరనాగాః=నరశ్రేష్ఠాః...అని వివరించియున్నాడు.

ఇందువలన నీ వ్యాఖ్యాత మహాదేవ శబ్దము ప్రతాపరుద్రుని తండ్రి పేరని తలంచినట్లే యున్నది. అట్లు విడిగాఁ దలంపవలసిన పనిలేదు. కవి కాయుద్దేశ మున్నట్లు కానరాదు. విద్యానాథుడు కథానాయకుని మహారాజైన రుద్రదేవుని పుత్రుడుగనే ప్రతిఘట్టమునను వర్ణించుచున్నాడు. అట్లు వర్ణించుటకుఁ గారణము తత్స్వీకార పుత్రత్వమే. కనుక రుద్రమదేవి రుద్ర మహారాజైనట్లే, తద్దౌహిత్రుఁడైన ప్రతాపరుద్రుఁడు తత్ (మహాదేవ) పుత్రుడైనాఁడని మనము గ్రహింప వలెను—అతని తండ్రి పేరు చెప్పు నుద్దేశమే అతని కున్నట్లు గానరాదు. ఉన్న యెడల 'కౌశల్యాసీత్పుత్రమ జననీ' అను శ్లోకమునందువలె నేదో యవకాశము కల్పించుకొని యొచ్చటనో స్పష్టముగాఁ జెప్పియుండు వాఁడే.

...నిజములోఁ బ్రతాపరుద్రుని తండ్రిపేరెచ్చటను నే సందర్భమునను నెవ్వరిచేతను జేర్కొనం బడినదను నవకాశము గానరాదు. అతని తల్లి మాత్రము ముమ్మడాంబ యనుటకును నామె రుద్రమదేవి పెద్ద కుమార్తె యనుటకును మాత్రమే చక్కని యవకాశము లున్నవి. కనుకఁ బ్రతాపరుద్ర జనకుఁ డవిజ్ఞాత నామధేయుఁడై యున్నాఁడు. ఇందువలన నతఁడు నిశ్శంకవీర మారయ్య యగు ననుటకు గాని, కాదనుటకుఁ గాని యెవ్వరికి నెట్టి కారణములు నుండవు. కాని యాతని కొక తండ్రి యుండితీరవలసినదే కదా!

...ఇట్లు మనకుఁ దెలియవచ్చిన యాకాలపు మహాదేవరాజులు నలుగురును గాక పోగా నికఁ బ్రతాప రుద్రుఁడు మహాదేవపుత్రుఁడనుట కే మహాదేవుని వెదుకుదము? అంతటి యప్రసిద్ధుఁడు చక్రవర్తినియైన రుద్రమ దేవి కల్లుఁడు గాఁజాలునా?

ప్రతాపరుద్రీయకవి శ్లేషకోఱకు మహారాజార్థమున నామహాదేవశబ్ద ముపయోగించెనను నా నిర్ణయమునకే నేను మరలఁ దిగి వచ్చి—భాస్కరరామాయణములోని యయోధ్యాకాండ కవియును, నతని తండ్రియైన నిశ్శంకవీరమారయయు, కాకతీయ ప్రతాపరుద్రుఁడును, దత్పితయు నగుదురేమో యను పూర్వోక్త చర్చనే కొనసాగింపఁబూనితిని. అందుపైవచ్చు నాక్షేపణములు చాలవఱకు నా దృష్టిలో విఱిసిపోయినట్లే భావించుచున్నాను. అయినను దీనిపై నింతకంటె సరియైన నిర్ణయ మెవ్వరైనఁ జేయఁగలిగినచో నాకంటె సంతోషింపఁగలవారు మఱియొకరుండరని విజ్ఞులకు నివేదించుకొనుచున్నాను."

శ్రీ శాస్త్రిగారు చెప్పినట్లే ప్రతాపరుద్రుడు మాతామహిరుద్రాంబచే పుత్రుడుగ స్వీకరింపబడుటచే గాబోలు నాతని తండ్రినామము తెలియవలసిన యగత్య మెవ్వరికిని లేకపోయినది. అకాలపు వాఙ్మయమునగాని శాసనములలోగాని అతని నామము తెలుచు పేర్కొనబడలేదు. కాని శ్రీ శాస్త్రిగారు ఏలకో శివయోగసారము నందలి ఈ క్రింది పద్యమును వారి చర్చలలో విడిచిపెట్టిరి.

"అకుపిత రుద్రమాంబికకు
నాత్మజనాఁ బొగడొందు ముమ్మడ
మ్మకు మహాదేవరాజునకు
నాత్మజుఁడైన ప్రతాపరుద్రుఁడా
సకల మహీభరంబును వె
సన్ దనయంత వహించి దాల్చె నా
యకమహిమంబులన్ దొరిదె
యన్నయదేవుడు రుద్రదేవుఁడున్."

## ముళుకుంటి తామ్రశాసనము

దీనినిబట్టి ప్రతాపరుద్రుని తల్లి దండ్రులు ముమ్మడాంబా మహాదేవరాజులని స్పష్టముగ తెలియు చున్నది గదా! ఇక ఎపిగ్రాపియా కర్నాటికాలో ప్రకటించబడిన తుముకూరు జిల్లా తుముకూరు తాలూకా ముళుకుంటి యగ్రహారపు తామ్రశాసనములోని 13వ క్రింది శ్లోకములు చూడుడు.

"ఆసీ త్పురీ కాకతీయా
రాజ్ఞాం లోకే యశస్వినీ,
ఆంధ్రదేశ ధరాపద్మ
మధ్యేకోశవదాస్థితా. 1

సౌధమాలాగ్ర కనక
కలశైః కేసరైరివ
ఉద్యాన శతసాహస్రైః
పత్రైరివ సువేష్టితా. 2

తాం పురీం వోరుగల్లాఖ్యా
మావస ద్రాజవల్లభః
కాకతీయమహారాజ
వంశ దుగ్ధాబ్ధి చంద్రమాః. 3

మహాదేవ ఇతి ఖ్యాతో
రాజా సర్వగుణాన్వితః
సోప్యుమాం శంభువత్కన్యాం
ముమ్మడాంబాం మనోరమాం
భూధరేంద్రసుతాం స్నిగ్ధా
ముపయేమే మహామతిః. 4

తస్యా మావిరభూ చ్ఛ్రీమా
న్మహాదేవః ప్రతాపవాన్
ప్రతాపరుద్రరాజాసౌ
కందర్ప ఇవ మూర్తిమాన్." 5

శ్రీ శాస్త్రిగారీ శాసనమును జూచియుంటే ఇంత గ్రంథమును వ్రాసేవారే కాదేమో! ప్రతాప రుద్రుని తండ్రి మహాదేవరాజని స్పష్టముగ విద్యానాథునికి, కుమారస్వామి సోమయాజికి, శివయోగ సారకర్తకు, ముళుకుంటి తామ్రశాసన కవికిని అందరికి తెలియును. అందుకే వారు కంఠోక్తిగా 'మహాదేవ రాజ'ని పేర్కొనినారు. శాసనములలో కనబడు మహాదేవనామధారులలో నొక్కనితో (చాళుక్య) వాని కుదురలేదని, మరియొకనికి (పురవరి) ఈడు లేదనియు, ఇంకొకనికి (యాదవ) రుద్రాంబపిల్ల నివ్వ దనియు చర్చించి తుదకు శ్రీ శాస్త్రిగారు సాహిణి మారయ సర్వవిధముల తగినవాడని ముమ్మడమ్మకు ముడి వేసి, రుద్రాంబకు ఇల్లరికపు టల్లునిగ జేసి భాస్కర రామాయణకృతి పతిత్వము నంటగట్టిరి. మా తామహి జీవించియుండగ తాను యువరాజుగ నుండిన ఏకొద్ది శాసనములనో కాకతి ద్వితీయ ప్రతాపరుద్రుడు 'కుమార రుద్రదేవ మహారాజ'ని వ్యవహరించబడి యుండవచ్చును. కాని అతడు సింహాసన మధిష్ఠించిన పిమ్మట వీరరుద్రుడు, ప్రతాపరుద్రు డనియే గాని 'కుమార రుద్రదేవుడని' ఏ శాసన, వాఙ్మయమునను పేర్కొనబడి యుండలేదు. నిజమున కాతడు భాస్కర రామాయణ కర్తయగుచో తన తండ్రిని గూర్చి 'నిశ్శంక వీరమారయ' యని సంబోధించి యుండడు. ప్రతాప రుద్రుడు గొప్ప కవియు, విద్వాంసుడే కావచ్చును. అంతమాత్రమున భాస్కరరామాయణ కర్తృత్వ మాతని కంటగట్టలేము. శ్రీ శాస్త్రిగారి యూహాలను, సిద్ధాంతములను చర్చించవలెనన్న మరియంత గ్రంథ మగును. ప్రస్తుత మది మన పనికాదు గాన దీని నింత టితో విడిచిపెట్టుట యుక్తము.

కవిచరిత్రకారులగు శ్రీచాగంటి శేషయ్యగారీ విషయమున విచిత్రమార్గము నొక్కదాని నవలంబించిరి. 14"...రుద్రదేవుడని వ్యవహరింపబడుచున్న రుద్రాంబకు, ముమ్మడమ్మ యను గన్యను దెచ్చి పరిణయమును గావించిరని కూడ చెప్పుదురు. కాని తనకుం దాళిగట్టిన వ్యక్తి స్త్రీయని యెఱింగి ముమ్మడమ్మ చాల దుఃఖించె ననియు, రుద్రాంబ యామె నోదార్చి పుత్రికా ప్రేమతోఁ బెంచెననియుఁ జెప్పుదురు. ముమ్మడమ్మ రుద్రాంబ కౌరసపుత్రిక కాదనుటకు శివయోగ సారమునందలి యీ క్రిందిపద్యము సాక్ష్య మిచ్చు చున్నది.

13. ఎపిగ్రాఫియా కర్ణాటికా, తుముకూరు నంబరు. 14.

14. ఆంధ్రకవి తరంగిణి మూడవ సంపుటము. పుటలు 41-43.

'అనుపిత రుద్రమాంబికకు
నాత్మజనాఁ బొగడొందు ముమ్మడ
య్యకు మహాదేవ రాజునకు
నాత్మజుఁడైన ప్రతాపరుద్రుఁ.'

ముమ్మడమ్మ, రుద్రాంబ ఔరస పుత్రికయైనచో నీ పద్య మున 'నాత్మజయై' అని యుండును గాని 'నాత్మజనా' అని యుండదు. దీనిని బట్టి పైనఁ జెప్పిన కథయందుఁ గొంత సత్యమున్నదని నమ్మవలసి యున్నది...

పుత్రికాప్రేమతోఁ బెంచిన ముమ్మడమ్మను, రుద్రాంబ దన మఱఁదియైన చాళుక్య మహాదేవ రాజున కిచ్చి గణపతిదేవుని యనంతరమున క్రీ. శ. 1265 ప్రాంతమున వివాహము జరిగించియుండును. రుద్రాంబ భర్త, చాళుక్య వీరభద్రేశ్వరుఁడును, ముమ్మడమ్మ భర్త మహాదేవరాజును సోదరులని శ్రీ చిలుకూరి వీరభద్ర రావుగా రూహించియున్నారు. ముమ్మడమ్మ భర్త మహాదేవరాజనుట నిశ్చయము. వారి కిరువురకుఁ బ్రతాపరుద్ర మహారాజు జన్మించెననుటయు నిశ్చయమే. అందులకు గ్రంథాధారములు విశేషముగా నున్నవి. దానిని కాదనలేము.

ముమ్మడమ్మ భర్త చాళుక్యమహాదేవుఁడు కాఁడనియు, మహాదేవ నామధారియగు మఱి యేయితర వంశీయుఁడో యైయుండునని యు, చాళుక్య వంశజుఁడే యైనను రుద్రాంబకు మఱఁది కాఁడనియుఁ గొందఱభిప్రాయపడుచున్నారు. దానికి వారు రెండు కారణములను జూపుచున్నారు.

మొదటిది :— తల్లి కూఁతుల నన్నదమ్ము లెట్లు పరిణయ మాడుదురనునది. ఈ యాక్షేపణము నిలువదు. రుద్రాంబ, తల్లియును గాదు. ముమ్మడమ్మ కూఁతురును గాదు. కావున నా సంబంధము వివాహమున కభ్యంతరము కలుగఁజేయదు.

రెండవది : ఓరుగల్లున బ్రతాపరుద్రమహారాజు రాజ్యము చేయుచున్న కాలమున చాళుక్య మహాదేవ చక్రవర్తి శాసనములు గోదావరి మండలమునఁ గాన్పించుచున్నవి. పుత్రుఁడు రాజాధిరాజై యాంధ్రదేశము నంతను బరిపాలించుచుండఁగా దండ్రి నిడదవోలులో (నిరవద్యపురము) నుండుట, అసంభవము కావున చాళుక్య మహాదేవుడుఁ బ్రతాపరుద్రుని తండ్రి కాఁడనుట. ఈ యాక్షేపణము కూడ సరియైనది కాదు. ప్రతాపరుద్రుడు, రుద్రాంబకు స్వీకృతపుత్రుఁడు. దత్తతగా నిచ్చిన పుత్రునింట జనక తండ్రి యుండవలయునను నియమము లేదు. నియమము లేకపోవుటయే కాదు, అట్లుండుట ఆచారవిరుద్ధమును స్వభావ విరుద్ధముగూడనై యున్నది. కావున నీ యాక్షేపణములు గమనింపఁ దగినవి కావు."—అసలు విషయము దెలియనపుడు మనవిమర్శలు, సిద్ధాంతము లిట్లే యుండును గదా!

పై నుదాహరించిన ముళుకుంటి తామ్రశాసనమును బట్టి కాకతివంశాంబుధిలో ప్రభవించిన మహాదేవరాజు ముమ్మడాంబను వివాహమాడినట్లు, వారిరువురకును బ్రతాపరుద్రమహారాజు జన్మించినట్లు దెలియుచున్నది. మరియు నాతడు రాజవల్లభుఁడు (రాజ్ఞః+వల్లభః) నియు, ఓరుగల్లుననే నివసించు చుండిన ట్లున్నది. రుద్రాంబపితామహుఁ డొక కాకతి మహాదేవరాజు కలడు. ఆ మహాదేవ రాజునకు గణపతి, కుందమాంబ యని యిరువురు మాత్రమే సంతతి కల్గినట్లు తెలియుచున్నది. ఇక నీ ముళుకుంటి తామ్రశాసనములో చెప్పబడిన కాకతి మహాదేవరా జెవ్వడనునది ప్రశ్న. గణపతిదేవుని ఏకామ్రనాథాలయపు శాసనమును[15] బట్టి కాకతి రెండవ ప్రోలరాజునకు రుద్ర, మహాదేవులు గాక యింకను మరికొంతమంది పుత్రులు గలరని తెలియుచున్నది.

తదను పవనవేగ ప్రత్యనీకాశ్వధాటీ
విహిత మహిత భూభృద్విద్రవో రుద్రదేవః
అలమకృత కులం తత్ క్ష్మాపకోటీరహీర
ప్రకరముకురబింబత్పాద బిబ్బోకలక్ష్మీః
తదనుజగణముఖ్య శ్రీమహాదేవరాజ
స్తపనకులసముద్రా ద్వ్యదృశః పారిజాతః[16]

ఆ యజ్ఞాత నామధేయులగు కాకతిరుద్రదేవుని సోదరుల సంతతివాఁడీ మహాదేవుడు. ఈతని తండ్రి పేరు కూడా తెలియదు. ఈతడు గణపతిదేవుని తండ్రి యగు మహాదేవుని పేరింటి వాడగుటచే రుద్రాంబకు పినతండ్రి కుమారుడును, ముమ్మడాంబకు మేనమామయు కావలెను. చాళుక్య వీరభద్ర రుద్రాంబల కుమార్తె యగు ముమ్మడాంబ తన మేనమామ యగు నీ కాకతి

---

15. ఇండియన్ ఎంటిక్వొరి. సంపుటము 21, పుట 200.

16. ఈ శాసనమును ప్రకటించిన హుల్ష్ దొర గారు ఇందలి 'పారిజాత' శబ్దము ద్వారా శాసనకవి ఆ సోదరులసంఖ్యను దెల్పుచున్నాడనియు, దానినిబట్టి రుద్ర, మహాదేవులు గాక మరి ముగ్గురు ఉండవలెనని సూచించిరి.

మహాదేవుని వివాహమాడుట కెట్టి యాటంకమును లేదు. మరియు నట్టి వివాహము మనదేశ సంప్రదాయము. ఈ కాకతిమహాదేవ ముమ్మడాంబలకు జన్మించిన ప్రతాపరుద్రుడు కాకతి వంశజుఁడే యగుటచే మాతామహి రుద్రాంబచే స్వీకృతపుత్రభావన మాత్రము గలవాడై, ఆమె యనంతరము కాకతి సింహాసన మధిష్ఠించగలైను. నాటి శాసనవాఙ్మయములలో సర్వత్ర ప్రతాపరుద్రుని కాకతివంశములో ప్రభవించిన వాడనుటలో గల మర్మమిదియే. "స్వీకృతే పుత్రభావేన దౌహిత్రే పితురాజ్ఞయా"—అను ప్రతాపరుద్రీయము లోని శ్లోకమును బట్టి ఇది యంతయు నయ్యుఁడను గణపతిదేవుని ఏర్పాటని తెలియుచున్నది.

"ఇప్పుడీ ధర్మసాగర శిలాశాసనమూలముతోను, నిర్వచనోత్తర రామాయణకవి వంశావళితోను సమకాలికులైన భాస్కర మంత్రు లిద్దరు కలరని చారిత్రకముగా జవాబు చెప్పవీలున్నది. కాని...'అతని (మల్లనమంత్రి) ప్రపితామహుఁడగు భాస్కరమంత్రి అధమము గణపతిదేవుని పితామహుడగు. కాకతి రెండవ ప్రోలరాజు కాలమువాఁడు అనగా క్రీ. శ. 1110 1158 ప్రాంతము వాఁడగును. అప్పుడు వారు చెప్పిన కృతిపతి మారయ సాహిణి కాలము బొత్తిగ కలిసిరాదు.' అను శర్మగారి వాదములో చారిత్రికసమన్వయము లేదు. ఆక్షేపము మాత్రమే కనబడుచున్నది. గుంటూరు భాస్కరమంత్రి వంశమునకును, తెలంగాణా హుళక్కి (ఎట్లు?) భాస్కర మంత్రి వంశమునకును మధ్యనున్న ఒక్కతరము వ్యత్యాసమును సగుబాటు చేసినచో (అందులకే గాబోలు వారు గుంటూరు భాస్కరమంత్రి వంశవృక్షములో అన్నదమ్ములగు మల్లన, కొమ్మనలకు 30 ఏండ్లు వ్యత్యాసములను చూపిరి!) వీరిరువురు క్రీ.శ. 1158 రెండవ ప్రోలరాజు కుమారుడు మొదటి ప్రతాపరుద్రుని సమకాలికు లగుట కవకాశ మున్న" దని రెడ్డిగారనిరి. నా వాదములో నాక్షేపమే గాని చారిత్రిక సమన్వయము లేదట. చారిత్రిక సమన్వయ మనగా ఇంటిపేరులేని భాస్కరమంత్రికి 'హుళక్కి' యని చేర్చుట, సోమదేవరాజీయ మున్నగు గ్రంథములలోని విషయములు తారుమారనుట, జంటపేర్లను తోడు మరికొన్ని సృష్టించుట కాగలదా?

శ్రీ రెడ్డిగారు వారి వ్యాసమును ముగించునపుడు "యుద్ధకాండ గద్యలోని 'శాకల్య మల్లకవి రవిరాహు

వీరనరసింహాఖ్య జొప్పలార్యనందన — అయ్యలార్య విరచితంబు' చరిత్రకూడ క్రీ॥ శ॥ 1175-95 ప్రాంతము కాకతీయ ప్రథమ ప్రతాపరుద్రుని రాజ్యాంతకాలముగా సమన్వయ మగుచున్నదే కాని, క్రీ. శ. 1407 తేది వేదగిరి రాయనింగారి శాసనకాలమునకు సమకాలము కుటలేదు. ఇందలి 'శాకల్య మల్లకవే' కాకతీయ— చరిత్రలో చెప్పిన 'శాకల్య మల్లికార్జునభట్టు-బ్రహ్మ విద్వాంసు' డన్నచో, ఇతని కాలము ద్వితీయ కాకతీయ ప్రతాపరుద్రుని కాలముతో కూడా సమన్వయము కాదు:"—అని చెప్పిరి. ఎందుకు సమన్వయము కాదో కారణము కూడా చెప్పి ఉంటే బాగుండేది. బహుశః పైన వారు వివరించిన కాలదోషమే నేమో! కాని అయ్యలార్యుడు చెప్పిన "శాకల్య మల్లకవి రవి రాహు నర (లేక నృ) సింహ" అను గద్యమున కర్థము శాకల్యమల్లకవి యను సూర్యునకు రాహువు వంటి వాడనగా తద్విజేతయైన నృసింహకవి యని. దీనిని బట్టి శాకల్య మల్లన, నృసింహులు సుప్రసిద్ధ మహాకవులగుటయే గాక సమకాలికులని గూడ తెలియుచున్నది. వెనుక నేను 'కాకతీయులనాటి శాసన కవు'లని భారతిలోను[17], 'వరంగల్లులో దొరికిన అపూర్వ శాసనము'లను వ్యాసమున శార్వరి ఉగాది సంచికలో[18] కూడ ప్రకటించినది ఈ నృసింహకవిని గూర్చియే. వరంగల్లు కోటలో దొరికిన చిన్న శాసనములనుబట్టి కాష్టఘాట నిసర్గనిరతయశస్సుగల ఈతడు నిరర్గళమైన వాక్కులచే ఋగ్వేదవ్యాఖ్య, కాకతీయచరిత్ర, మలయవతి గద్యకావ్యము మున్నగు హృద్యమగు గ్రంథముల నెన్నింటినో సంతరించినట్లు, దశవిధరూపకములలో ప్రగల్భుడనియు తెలియుచున్నది. కాకతీయ సంచికలో పేర్కొనబడిన కాదంబరీ నాటకకర్తయగు నృసింహుడీతడే. సిద్ధ దంపతుల చరిత్రమును వర్ణించు శాసనకావ్యమునుబట్టి ఈతని కల్పనాచాతుర్యము, శైలి, వర్ణన మున్నగునవి స్పష్టముకాగలవు. అచ్చటనే నాగరి లిపిలోగల మరియొక శాసన కావ్యమునుబట్టి ఈ నృసింహకవి కాకతి గణపతిదేవుని దీక్షాగురువగు విశ్వేశ్వరశంభుని దౌహిత్రుడని తెలియుచున్నది. ఈతనిచేయగు కాదంబరీ నాటకమునుబట్టి యితడు గంగాధరుని పుత్రుడు, సిద్ధనాథుని పౌత్రుడనియు తెలియుచున్నది. వరంగల్లు కోటలో పోతన్నగుట్టయని పిలువబడు పెద్దబండపై తాళఫలప్రమాణముగల అక్షరములతో చెక్కబడిన "అవ్యా దుర్వీ ముదధిరశనా మగ్రణీః కాకతీనా" మను శ్లోకమునుబట్టి ఈతడు కాకతి ద్వితీయ ప్రతాపరుద్రుని ఆస్థానమున నుండినట్లు స్పష్టమగుచున్నది. ఈ నృసింహుని సమకాలికుడగు శాకల్య మల్లన ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమువాడు గాక ప్రథమ ప్రతాపరుద్రుని కాలమువాడు క్రీ. శ. 1175-95 ప్రాంతము వాడెట్లగును ?

ఈ సందర్భమున హనుమకొండ కాగ్నేయమునగల సిద్ధేశ్వరునిగుట్ట గండశిలపై చెక్కబడి అసంపూర్తిగ నాగిపోయిన సుందరమైన కావ్యమును గూర్చికొంచెము చెల్పుట యావసరము. ఇయ్యది ఓరుగల్లు నగరమును, కాకతీయ రాజ్యవైభవమును వరించుచున్నది. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు మెకంజి దొరగారి వ్రాతలనుండి సంగ్రహించి దీనిని 1924 సంవత్సరపు భారతిలో వెనుక ప్రకటించిరి. ఈ శాసనపు ప్రతిబింబమును దీయించి పరిశీలించగా నీ కావ్యమంతయు నిరోష్ఠ్యముగనున్నది. శాకల్యమల్లన నిరోష్ఠ్యరామాయణమును విరచించినట్లు తెలియుచున్నది. ఈ శాసన లిపియు, నరసింహుని కావ్య లిపియు నొక్కటిగ నుండుట, రెండు కావ్యములును ఎదురెదురుగా వేర్వేరు గుట్టలపై చెక్కబడియుండుటను బట్టి ప్రతిస్పర్ధులగు నీ కవివృషభులు తమ, తమ కావ్యములను శిలాక్షరములుగ జెక్కించినారని యూహించుటకవకాశముగలదు. అయిన నీ యసంపూర్ణ నిరోష్ఠ్య శాసనకావ్యకర్త శాకల్య మల్లన యగునేమో యని తలంచవచ్చును. ఇట్లు శాసనాద్యాధారములను బట్టి కూడ శాకల్య మల్లన లేక శాకవల్లి మల్లికార్జున భట్టు సోమదేవరాజీయ, స్థానిక చరిత్రములలో చెప్పినట్లు కాకతి ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమువాడే యని రుజువగుచున్నది. "శాకల్య మల్లకవి మొదటి ప్రతాపరుద్రుని కాలమువాడనుట భాస్కరకవుల సమకాల సమన్వయ" మని శ్రీరెడ్డిగారు సిద్ధాంతీకరించిరి. పైన వివరించిన శాసన, వాఙ్మయాధారములనుబట్టి శాకల్య మల్లన, సాహిణి మారన మున్నగువా రందరు సోమదేవరాజీయ, స్థానిక చరిత్రములలో చెప్పబడినట్లు ద్వితీయప్రతాపరుద్రుని కాలమువారేగాని ప్రథమ ప్రతాపరుద్రుని కాలమువా రెంత మాత్రము కారు. వారి సమకాలికుడుగ పేర్కొనబడిన హుళక్కి భాస్కరుడు కూడ ద్వితీయప్రతాపరుద్రుని కాలమువాడే యనుట నిశ్చయము. క్రీ. శ. 1311 నాటి పల్నాటిప్రాంతపు శాసనములలో సాహిణి మారన పేర్కొనబడి యుండుటచే అతని యాస్థానకవీశ్వరుడగు హుళక్కి భాస్కరుడు తత్పుత్రుడగు మల్లికార్జునభట్టు, కృతిపతి కుమారుడగు కుమారరుద్రదేవుడు అందరును గాకతీయ ద్వితీయ ప్రతాపరుద్రుని రాజ్యకాలము ననగా 14 వ శతాబ్ది యారంభమున భాస్కర రామాయణమును రచియించి యుండిరనుటయే సమంజసము. భాస్కరరామాయణ కర్తృత్వ, కాలములను గూర్చి ఈ మాత్రము చర్చించుట కవకాశము గల్పించిన శ్రీ రెడ్డిగారికి నా హృదయపూర్వక ధన్యవాదములు.

---

17. భారతి సంపుటము 36, సంచిక 3, పుట 20.

18. ఆంధ్రపత్రిక శార్వరి ఉగాది సంచిక 1960-61; పుట 38.

# కలలే ఫలించినా....

'ధనిష్ఠ'

పేవ్ మెంట్ మీద నడుస్తున్న మధుపక్కనే, పేవ్ మెంట్ ని రాస్తూ కారొకటి ఆగి కీచుగా ఎలక్ట్రిక్ హారన్ మ్రోగింది. ఉలిక్కిపడిన మధు సహజ కౌతుకంతో కారువేపు దృష్టి సారించాడు నిలబడిపోయి. వెనకసీటు తలుపుపక్కకి జరిగి తలబైటకు పెట్టిందో అప్సర. "మీ పేరు మధు కదూ?—" తేనెలొలుకుతూ పలికింది. ఆ ప్రశ్న మధు మతిని పోగొట్టేసింది. ఎవరీమె? తన పేరు యీమెకెట్లా తెలుసు? ఇంతకీ అది తన పేరేనా? లేక తాను కలకంటున్నాడా ఈగ యిల్లలుకుతూ పేరు మర్చిపోయిందిట! మధుకి నిజంగానే తన పేరు మధోనని నమ్మకంపోయింది. ఎటూ తేలని ఆలోచనలలో కొట్టుకుంటూ అప్రయత్నంగానే "కాదు" అన్నాడు. ఆ జబాబు ఆమెను ఆశ్చర్యపరిచేబదులు నవ్వించింది. "మార్చుకున్నారా?" అంది నోరార నవ్వుతూ. అనూహ్యమైన ఆ సంఘటన మధు మెదడు స్తంభింపజేసింది—

"లేదు" అన్నాడు మరో ప్రపంచంలోంచి— ఏం మాట్లాడుతున్నాడో తెలియకుండానే—

"మీ పేరు మీరు మర్చిపోయినా నాకు జ్ఞాపకం ఉందిలెండి. రండి లోపలకి—తరవాత ఆలోచిద్దురు గాని-ఆలశ్యమైతే జనం మూగుతారు" — పట్టలేని ఆనందంతో వికసిస్తున్న ముఖంతో—అంది.

అంత ఆప్యాయంగా ఒక అపురూపసుందరి ఆహ్వానిస్తూంటే—పోనీ అదికలే అయినా కొంతసేపు సాగనీ—అనుకుని తలుపు తెరుచుకొని ఆమె అటు జరిగి చేసిన కాళీలో కూలబడ్డాడు.

తలుపు మూసుకోగానే కారు కదిలి సెకండ్ల మీద వేగాన్ని వృద్ధిచేసుకుని ట్రాఫిక్ ని దూసుకుంటూ సాగిపోసాగింది.

గట్టిగా కళ్లు మూసుకున్నాడు మధు. తెరిస్తే కల చెదిరిపోతుందేమోనని భయం వేసింది! ఊహలోనైనా ఆ అనుభవం ఎక్కువసేపుంటే బాగుండునని పించింది!

"ఏం చేస్తున్నారిప్పుడు?" ఆ ప్రశ్న అతనికళ్లు తెరిపించింది.

దృశ్యం చెరిగిపోతుందనుకున్నాడు గాని చెరగలేదు. ముందు కార్లని తప్పించుకుందుకు హారన్ మ్రోగుతోంది. డ్రైవర్ ముందున్న అద్దంలో వెనకాల కార్లు కనిపిస్తున్నాయి — సడెన్ గా పల్లంలో పడ్డ కుదుపును అణిచివేసేంత మెత్తని సీటుమీదున్నాడతను. పక్కకి తిప్పాడు ముఖం — అత్యధికమైన సంతోషంతో ఉజ్జ్వలంగా దీపిస్తున్న ఆ ముఖం తానెక్కడో చూసినగుర్తు మధుకి — చాలాసార్లు— చాలారూపాలలో చూశాడు తను — ఎక్కడ — ఎక్కడ — వాల్ పోస్టర్లమీద — సినిమాల్లో — సినీతార తపతి కదూ?

"ఇప్పటికైనా తెలివిలోకి వచ్చారా?"— పరిహాసపూర్వకమైన ఆ మాటలు మధుకి చిర్రెత్తించాయి —

"డ్రైవర్ కారాపు —" అరిచాడు.

"కణ్ణా — ఆపకు —"

"ఏమిటీ జబర్దస్తీ?" విసుగ్గా ప్రశ్నించాడు మధు.

"అంత కోపమైతే ఎల్లాగస్వామీ? — అయినా నిజం చెప్పండి — ఆపేస్తే దిగిపోతారూ?—కనీసం బాధపడకుండా — మీతత్వం నాకు తెలీదూ — ఇల్లాగే జరిగితే బాగుణ్ణని కదూ అసలు మీరనుకుంటారు? — నా కళ్లల్లోకి చూసి చెప్పండి—" చెంపకు చారెడున్న ఆమెకళ్లు చిలిపిగా నవ్వుతున్నాయి—

ఇదో చిన్న సైకలాజికల్ బ్లఫ్ — ఆ పరిస్థితిలో ఆ మాటలు ఎవర్ని అడిగినా కాదు, అవును, అనలేని స్థితిలోనే ఉంటారు — తపతి అంత తార ఆప్యాయత ఒలకబోస్తూ ఎంతో సన్నిహితంగా యీ ప్రశ్న వేస్తే నూటికి తొంభైతొమ్మిదిమంది తలక్రిందులౌతారు — జీవితంలో ఏదో క్షణంలో అటువంటి కోరిక ప్రతీవారిలోను ఉత్పన్నమౌతుంది.

చాలా కటువుగా ఉన్నా — ఆనగ్న సత్యం అతన్ని చిత్తుచేసింది. సిగ్గు ముంచెత్తింది— ముఖం

ఎర్రబడిపోయింది – అదికతే అయినా కొంత పొడుగ్గా ఉంటే బాగుణ్ణని కదూ తాననుకున్నది! — అంతకు ముందు, ఏ తారేనా పెళ్లాడకూడదా అనికదూ బాధ పడ్డది?

మళ్లీ మొదటి ప్రశ్న ఎదురైంది.

తనీమెకెల్లా తెలుసు?

అదే అడిగాడు.

"ఆ మొహం చెప్పటంలా! —" సమ్మోహితం చేసే మందస్మితంతో కావాలనే వేళాకోళంగా అందీమాట.

ఈ మాట యీ మాటలుకోపం కలిగించడానికి బదులు గిలిగింతలు పెట్టాయి మధుని... ఆమె తన్నెరుగున్నా నంటోంది. అంత అదృష్టం తన్ను వెన్నంటి వస్తుంటే తాత్కాలికంగానైనా ఆనందించక కోపం దేనికి — ఇదీ బాగానే ఉంది అనుకున్నాడు.

"నేనసలు గుర్తు రావటంలా మీకు?—" ముద్దుమూతి పెట్టి అడిగింది.

"ఒకలా గుర్తుకి రావేవచ్చారు. మిమ్మల్ని తెర మీద చూశాను. గోడలమీద చూశాను," సందు దొరికి నప్పుడెందుకు వదలి పెట్టాలని విసిరాడు మధు.

"అలా కనీసం కొన్ని లక్షలమందికి తెలుసు నేను. అది సరేగాని నన్ను మీరు మీరనడం బాగులేదు— ఊహు — కారణాలు చెప్పొద్దు — నన్ను నువ్వనే హక్కు మీకిస్తున్నాను—అది ఉపయోగించుకోండి—"

"నిన్ను నువ్వనేహక్కు యిచ్చానంటున్నావు గనక నువ్వే అంటాను. నాభావాలని చదివేశావు— నన్ను గుర్తించానంటావు—అపారమైన ప్రేమ ఒలక బోస్తున్నావు—కలనేమోనన్న భ్రమ యింకా వీడిపో లేదు నన్ను—కనీసం యీ నాటకం ఎందుకు ఆడుతున్నావో — ఎప్పుడు అంతమౌతుందో కూడా చెప్పెయ్యి—"

"మీరు వద్దనుకున్నప్పుడు—కాని యిది నాటకం కాదంటే నమ్మతారా?"

"అయితే నువ్వెవరవో చెప్పు."

"అయితే పోల్చుకోలేరన్నమాట!—పోనీ ఆలోచించి చూడండి. అప్పుడూ అంతే అయితే ఎల్లాగూ తప్పదు.—సస్పెన్స్ అంటే మా ప్రొడ్యూసర్స్ పడి ఛస్తారు—నాకూ అదే అలవాటయింది. నిజమూ అంతే నమకోండి — పిడికిలి తెరిచేస్తే ఓసి యింతేనా అంటారు—"

"అయితే నువ్వు కాస్సేపు మాట్లాడకుండా కూర్చో—" ఆమె మాటల్లో తొణికిసలాడిన ఆత్మీయత అతన్ని పురిగొల్పింది.

"అమ్మయ్య — యిప్పటికి వీడిపట్టింది మత్తు. అసలు ధోరణిలో పడ్డారు."

మధు ఆలోచనలకి ఉపక్రమించాడు. ఎవరామె? ఎక్కడ చూశాడు తను—ఎంతసేపూ తెరా, పోస్టర్లూ, వివిధ భంగిమలలో, భావాలతో, గోచరించే వదనమే సాక్షాత్కరిస్తుంది గాని అదివరలో ఎరుగున్న గుర్తు రాదు. పోనీ ఆ మాటలతీరు, ఆమె చేష్టలు—వాటిలో ఏదీ ఆమె అసలు తత్వాన్ని పట్టియ్యడం లేదు. కారణం ఆమె నటి—వివిధ పాత్రల నభినయించిన అనుభవం ఆమెకు ఏభావాన్నైనా చేష్టలనైనా ప్రదర్శించే నేర్పు నిచ్చింది—ముక్కు మొగం ఎరగనివాడితో ముప్ఫైఏళ్ళ పరిచయం ప్రకటించగలదు. ప్రేమ నటించగలదు. జీవితాన్నే నటించడం నేర్చుకుందేమో.

మధు ఊహాప్రవంతిలో మునిగి తేలుతూండగా కారు ఒక పెద్ద కాంపౌండ్ ముందు ఆగి, గూర్ఖా తలుపు తియ్యగా మెల్లిగా లోపలకి చొచ్చుకుపోయి పోర్టికోలో ఆగింది.

"దిగుతారా మహాత్మా!" అంది తనవైపు తలుపు తెరుచుకుని దిగుతూ.

మధు దిగాడు. మొజాయిక్ గచ్చుచేసిన వీధి వరండా గడిచి హాల్లోకి వచ్చారు. హాలు మధ్యగా అత్యంత సుందరంగా ఉన్న చేపలతోను, నాచుతోను ఉన్న ఎక్వేరియం. ఖరీదైన ఫర్నిచర్. కుడిపక్క గది లోంచి మెట్లు. మేడమీదకి బాల్కనీ. పై హాలులోకి అంతమైనాయి మెట్లు. నేలంతా ఖరీదైన కార్పెట్లు పరిచి ఉన్నాయి. పోర్టికో మీదకి బాల్కనీ. అక్కడ ఒక చిన్న రౌండ్ టేబిల్ చుట్టూ రాకింగ్ ఛైర్స్. లతలకమ్మలు అమర్చిన పెద్ద కిటికీలు—వాటికి తెరలు—ఫ్లవర్ వాజ్ డోమ్స్‌లో అమర్చబడి కళ్లలోకి సూటిగా వెలుతురును పంపని దీపాలు. హాలులోంచి కుడిపక్క తలుపు తెరిచిన తపతితో మధు కూడా వెళ్లాడు.

అది ఆమె శయనాగారం: రోజ్ ఉడ్ డబుల్ కాట్ — పైన దట్టమైన డన్‌లపిల్లో ఫోమ్ రబ్బర్

డబుల్ బెడ్—ఖరీదైన దుప్పటి—రెండు ముఖమల్ దిళ్లు—తలవేపు కుడిపక్కకి 'S' ఆకారంగా ఉండే బెడ్ సైడ్ టేబిల్. ఒక పక్కకి గోడలోకి అమర్చబడ్డ వార్డ్ రోబ్—ఆపక్కనే ఒక డ్రెస్సింగ్ టేబిల్—మూడు బింబాలు చూపించే నిలువుటద్దం—టేబుల్ మీద తీరుగా అమర్చిన వివిధ రకాల కాస్మెటిక్స్. గోడలకు వివిధ భంగిమలలో ఉన్న తపతి ఫోటోలు—ఖరీదైన పెయింటింగ్స్ ప్రకృతిని చిత్రించేవి. ఒక్క ముక్కలో చెప్పాలంటే—డబ్బుమీద ఉండే నిర్లక్ష్యతని అంగుళం అంగుళాన్ని చాటుతోందా యిల్లు.

మధుకి మరోసారి మతిపోయింది. ధనంతో ఇంత భౌతిక సౌఖ్యాన్ని కొనవచ్చునన్నది మొదటిసారిగా గోచరమైందతనికి. "కూర్చోండి—ఒక్క నిమిషంలో వస్తాను." అంటూ తపతి కుడిపక్కకు ఉన్న పెద్ద ఒంటి అద్దం బీరువా తలుపు తెరిచి లోపలికి అదృశ్యమై పోయింది. తపతి మాటలకు ఉలిక్కిపడిన మధు యిది చూసి మరింత ఆశ్చర్యపోయాడు. ఎటాచ్డ్ బాత్ గాబోలు!

మంచంమీద చతికిలపడ్డాడు మధు. ఒక్కసారిగా కిందకు కూరుకుపోయి మళ్లీ లేచాడు. ధనవంతుల మీదుండే అసూయాగ్ని ఒక్కసారిగా ప్రజ్వరిల్లింది మధు మనస్సులో. వాళ్ళ విచ్చల విడిగా అర్థంపర్థంలేని పనులలో వెచ్చించే డబ్బుతో ఎన్ని బీద కుటుంబాలు నిశ్చింతగా వెళ్లిపోతాయ్!—వీరి యీ దుబారాని అరికట్టి ఆ ధనాన్ని బీదలకు పంచే ప్రయత్నం ప్రభుత్వం ఎందుకు చెయ్యదు? ఇంతలో ఒక ఊహ వచ్చి అతని గుండెల్లో బల్లెంగుచ్చింది--అరగంట క్రితం తననుకున్న వేమిటి? యీ భౌతిక సౌఖ్యాలన్నీ పొందాలనే కదూ?—నిజంగా ఇప్పుడు మాత్రం తనకివన్నీ ఉంటే త్యజించి బీదలకు పంచిపెట్టగలడా తను!

ఇన్ని సౌఖ్యాలమధ్య కొట్టుకుంటున్న యీ ధనవంతుల కింకా హృదయం ఉందనేచెప్పాలి—ఎప్పుడో తన్నెరుగున్నానంటున్న యీమె యింత ఉన్నత స్థితిలో, తన (మధు) స్థితికీ ఆమె స్థితికీ యోజనాల వ్యత్యాసం ఉన్నాకూడా, తన్ని గుర్తించి ఆదరించింది.

లేక కేవలం యిదంతా ఒక నాటకమా?—ఒక సామాన్యుణ్ణి దిగ్భ్రాంతిలో ముంచాలనే వెర్రికోరిక కలిగి యిల్లా ప్రవర్తిస్తుందా? లేక ఎంతసేపూ ధనపూరితమైన వాతావరణంలో చరించే యీమె రిలీఫ్ కోసం ఒక సామాన్యుడి పరిచయం వాంఛిస్తుందా?—ఏమిటి తనఊహ లిలా పోతున్నాయ్—పైవే కారణాలయితే తనపే రామె కెల్లా తెలుస్తుంది?—యీమెను తనెన్నడో ఎరుగుండి ఉండాలి—ఆడవాళ్ల జ్ఞాపకశక్తి, సంఘటనలని గుర్తించుకోడంలోని వివేకం అధికం కావడంవల్ల తానామెకు జ్ఞాపకం ఉన్నాడు.—ఈమె నెక్కడ చూశాడో—ఎంత తన్నుకున్నా ఆమెను తొరగా చూసిన జ్ఞాపకమే యితర స్మృతుల్ని మరుగు పరుస్తోంది.

"పాపం! ఎంత ప్రయత్నించినా గుర్తుకి రావటం లేదుకదూ?—" హేళనా మిశ్రమమైన ఆమె నవ్వ మధు ఆలోచనలకి భరతవాక్యం పలుకుతూ, మధు పక్కనే చతికిలబడింది.

"నువ్వెంత హేళనచేసినా సరే,నిజంగానే గుర్తుకి రావడంలేదు—బహుశః నిన్ను తొరగా ఎరిగి ఉండకపోతే చప్పున గుర్తుకి వచ్చిఉండును." అన్నాడు మధు.

"అయితే నా పూర్వాశ్రమనామం కల్యాణి అంటేమాత్రం మీ కేం తెలుస్తుంది?" తల ఊగిస్తూ ఆమె అడుగుతుంటే దీపాలకాంతికి ఆమె రవ్వల దుద్దులు తళుక్కున మెరుస్తున్నాయి.

కల్యాణి పేరు విన్నగానే మధు మనోవీథిలో చటుక్కున ఒక్క మెరుపుమెరిసి అంతలో అంతర్థానమైపోయి అంధకారం అలుముకుంది. ఆ పేరెక్కడో తాను విన్నాడు. జ్ఞాపకం వచ్చినట్టే వచ్చి చటుక్కున జారిపోగానే అమితమైన బాధకు గురి అయ్యాడు మధు. జుట్టు పీక్కోవాలన్నంత యిది పుట్టుకొచ్చింది. కనుబొమలు ముడివడి ముఖంమీద దీర్ఘాలోచనా సహాయతాముద్ర వేసుకున్నాయి. తపతికి జాలి వేసింది—తన్ను గుర్తించలేకపోయాడే అని బాధ వేసింది. అయినా చెప్పకూడదనే పట్టుదలవల్ల—

"పోనీ యింకోపని చేస్తాను. ఒక్కక్షణం ఆగండి—"అంటూ డ్రెస్సింగ్ టేబిల్ ఎడంవైపు అట్టడుగు సొరుగులోంచి కార్డుసైజ్ ఫోటో ఒకటితీసి మధుకి అందించి "యిది చూసినా గుర్తుకి రాకపోతే నా ఖర్మ!" అంటూ నుదురు చేత్తోకొట్టుకుని వేళాకోళంగా నవ్వుదామని విఫలురాలైంది.

పదిహేను పదహారేళ్ల అమ్మాయిదా ఫోటో—కోల మొహం—పెద్దవాలు గన్నులు—పలుచని బుగ్గలు—బుగ్గలు

మరీ పలుచనకావడంతో కొద్దిగా ఎత్తుగా కనబడే చిన్ననోరు-చక్కని ముక్కు. అమాయికత ఉట్టిపడు తూండా ముఖంలో - పట్టులేని ఆశ్చర్యం ప్రతిబింబించింది మధుముఖంలో. తపతిని ఆపాదమస్తకం పరిశీలించాడు.

కండపట్టడం చేత గుండ్రంగా తయారైనముఖం- పూడిన బుగ్గలవల్ల సమంగాఉన్ననోరు-ఆమెకళ్లలో అంతఅందమూ ఉంది గాని యిదివరకటి చిన్నముఖంలో కనబడ్డంత పెద్దవిగా కనబడ్డంలేదు. కొంచెనవ్వుతోను, అనుభవాలు ప్రసాదించిన విజ్ఞానవికాసాలతోను అలరారే ఆమె యిప్పటి ముఖానికీ అప్పటి ముఖానికీ పోలికలు చాలాతక్కువ. నలుపుకుమొగ్గే చామనచాయ, సామాన్యపు దుస్తులు-తాను మనిషిగా ఎరుగున్న కల్యాణి ఫోటోలో అంత అందంగా ఉంటుందని తనకి అనిపించ నేలేదు. శ్రద్ధతీసుకుని అలంకరించుకుంటే అప్సరసలా ఉంటుందన్నఊహ అసలే రాలేదు.

"నమ్మలేనంతమార్పు వచ్చిందినీలో—"కొద్దిగా తేరుకుని అన్నాడు.

"అంచుకే మీరు గుర్తుపట్టలేక పోయినా బాధ పడలేదు నేను—కాని మీరు నాటికీ నేటికీకూడా ఒక్కలాగేఉన్నారు. అరమైలు దూరంనుంచిగూడా గుర్తించగలనేమో మిమ్మల్ని—"

శూన్యదృక్కుల్తో తనకేసి చూస్తున్న మధు తన మాటలు వినడంలేదనీ, జీవితగ్రంథంలోని పాతపుటలు తిరగవేస్తున్నాడనీ గ్రహించిన తపతి తానూ పూర్వపు సంఘటనలని నెమరువేసుకోవడంలో నిమగ్నురాలైంది.

ఎప్పటికల్యాణి !

మధు గతంలోకి ఎనిమిదేళ్లు ప్రయాణించాడు. తెరమీదికి ప్రొజెక్టుచేసిన సినిమారీలులా తన రెటీనామీదకి ఒక్కటొక్కటిగా ఆనాటి సంఘటనలు ప్రతిబింబిస్తున్నాయి.

అవి తన బియ్యే ఆఖరిసంవత్సరపు చివరిరోజులు. మాంబళంలో ఒకచిన్నయింట్లో ఒకరూం అద్దెకుతీసుకుని ఒకరిజోలి కొంతీ అక్కర్లేకుండా మెలిగేవాడు. పక్కవాటా ఖాళీకావడం, అందులోకి మళ్లా ఒక పదహారు వసంతాల పడుచు, ఒకనడికారు స్త్రీ ప్రవేశించడం లీలగా తెలుసు తనికి—పరీక్షలు దగ్గిరికి వచ్చినకారణంగా వాళ్లెవరో, ఎందుకు వచ్చారో తెలుసుకోవాలనే కుతూహలంకూడా ఉత్పన్నంకాలేదు తనలో.

ఒకసాయంత్రం తాను వీధిలోకి బైలుదేరిబోతుండగా ఆనడికారు స్త్రీ వచ్చి "బాబుగారు ఒక చిన్న ఉపకారం చేసిపెడతారా ?" తెలుగులో అడిగింది.

"ఏంకావాలి ?" అడిగాడు తను కాస్త విస్మితుడయి.

"అమ్మాయికి రెండురోజులనించి జ్వరంగా ఉంది. అదేతగ్గుతుందని ఊరుకున్నాం గాని యివాళ మూసినకన్ను తెరవకుండా పడిఉంది. మాకీభాష రాదు—కొస్త డాక్టర్ని పిలిచి—"

"అల్లాగే తీసుకువస్తాను."

"తరవాత—" తటపటాయించింది.

"చెప్పండి"

"ఈ గాజు కొంచెం అమ్మిపెట్టాలి." గతుక్కుమన్నాడతను. తనకటువంటివి అనుభవంలో లేకపోవడమే కాక భయంగూడాను.

"ఉంచండి. డాక్టర్ని నేను తీసుకువస్తాను." అన్నాడు అతను.

"కాదు బాబూ యిది అమ్మేతీరాలి—"

"అది తరవాత చూద్దాం లెండి. ముందు డాక్టర్ని తీసుకువస్తాను పదండి." అని ఆమెను పంపించి తను డాక్టర్ నిమిత్తం వెళ్లాడు.

డాక్టర్ని తీసుకుని మొదటిసారిగా వాళ్లవాటాలో అడుగుపెట్టాడు. వీధిగదిలో కిందపరిచిన పక్కనంటిపెట్టుకుని బల్లిలా పడుకుని ఉంది తాను మొట్టమొదట చూసినకల్యాణి. ఆ గదిలో చెప్పుకోదగ్గ వస్తువులేమీ కనపడలేదు చుట్టపెట్టి మూలకి బారవేసిన చాప ఒక చిన్నట్రంకు పెట్టి తప్ప. అదికాక యింకోగది. అదీ వాటా.

డాక్టర్ చెయ్యిచూసి జ్వరంగా ఉందనీ, అంత కుమించి బలహీనంగా ఉందనీ, న్యూట్రిషస్ఫుడ్ యివ్వాలనీ చెప్పి ఒక యింజక్షన్ యిచ్చి ఒక ప్రిస్క్రిప్షన్ రాసిచ్చి వెళ్లిపోయాడు. ఇంజక్షన్ యిస్తుంటే నీరసంగా మూలిగింది కల్యాణి.

డాక్టర్ వెళ్లాక 'ఏమిటి సుబ్బులూ యిదంతా! నిన్ను పెళ్లి అయిన్ని అవస్థపెట్టి డాక్టర్ని ఎవరు తీసుకురమ్మన్నారు ?' అంది నీరసంగా - అసహాయతని

అంగీకరించలేని అభిమానం తెప్పించిన కోపంతో. "జ్వరంగా ఉంటే చూస్తూ ఎల్లా ఊరుకోను తల్లీ!" అంది. జాలిగా సుబ్బులు.

తనకి అప్పటికి అర్థమైనది – వారిదారిద్ర్యం. ఆ పరిస్థితి తనకి జాలిగొల్పింది – అసహాయతలో మునిగి ఉన్న సాటి తెలుగువారికి అరవదేశంలో తానండ కాక తప్పదు. సుబ్బులు బలవంతపెట్టినా ఆ గాజు తీసుకోకుండా తనే వెళ్లి హార్లిక్స్ గ్లూకోజ్, డాక్టర్ చెప్పినమందు తెచ్చియిస్తూ – "ఇప్పుడోమాత్ర, రాత్రి పదిగంటలకోటి, రేప్పొద్దున్న ఒకటి యివ్వండి – నాలు గేసి గంటలకి ఒకసారి హార్లిక్స్ కలిపియివ్వండి గ్లూకోజ్ తో – ఏమీ కంగారుపడకండి. భయమేమీ లేదు– కాస్త నీరసంగా ఉందన్నాడు – రేపటికి తగ్గిపోతుంది. నేను రేప్పొద్దున్న మళ్లీ వస్తాను. ఏంకావలసినా నాతో చెప్పడానికి మొహమాటపడకండి." అని వచ్చేశాడు తను.

రూంకి వచ్చి వాళ్లని గురించే ఆలోచించాడు: వాళ్లెవరు? ఎందుకొచ్చారు? – పరిస్థితి అర్థంకాలేదు – కాని ఆ సుబ్బులు ఆమె కేమీ కానట్టుంది. కల్యాణి సంస్కారంగాని, కుటుంబపు తాహతుగాని సుబ్బులు కున్నట్టులేదు. వారిద్దరికీ మధ్యనున్నది సేవ్యసేవికాసంబంధమే. పోతే సుబ్బులికి కల్యాణిమీద అనంతమైన వాత్సల్యం ఉన్నట్లు తోస్తుంది. – ఉపకృతి పొందడానికి ఎంత అభిమానం! – డాక్టర్ 'బలహీనంగా ఉంది. న్యూట్రిషన్ ఫుడ్ యివ్వాలి' అన్నాడు. – అసలు ఆమె అనారోగ్యానికి కారణం దారిద్ర్యమే నేమో – ఇల్లు అయ్యవారినట్టిల్లులా ఉంది––

మొన్నాడు పొద్దున్న హోటల్ నించి తిరిగివస్తూ ఒక పదిరూపాయల యింటిసరుకులు తీసుకుని వాళ్ళున్న వాటాలోకి వెళ్లాడు. సుబ్బులు తలుపు తెరిచి వస్తువులు చూసి విస్తుపోయింది.

"ఎందుకు బాబూ యివన్నీ?"

"ఉంచండి. వీటికి నేను డబ్బు తీసుకుంటాను. మీరూరికే మొహమాట పడక్కర్లేదు" అన్నాడు తను.

ఇంకేం మాట్లాడకుండా ఆమె అవి తీసుకుని రెండో గదిలోకి వెళ్లి పనిలో మునిగిపోయింది.

"మీకెందుకీ శ్రమ? అసలు నిన్న నే మిమ్మల్ని అనవసరంగా బాధ పెట్టాం. దానికి తోడు..." జ్వరం కాస్త తగ్గి, లేచి కూర్చునే ఓపిక వచ్చిందామెకు.

"చూడండి! అవసరాలు, ఆపదలు అనేవి అందరికీ వస్తాయి. మొహమాటం పెట్టుకు కూర్చుని అవస్థపడ్డందు వల్ల లాభం ఏముంది? ఇరుగు, పొరుగు, అయింతరవాత ఆమాత్రం సాయం చెయ్యడం నా విధి" అన్నాడు తను.

కృతజ్ఞతవల్ల ఉక్కిరి బిక్కిరి కావడంవల్లో, అభిమానం ముంచుకొచ్చినందుకల్లో తెలీదుగాని ఆమెకు కన్నీళ్ళు తరుముకొచ్చాయి.

"చూడండి–" అనునయించే ధోరణిలో మొదలు పెట్టి యింకెల్లా పొడిగించాలో తెలీక నసిగాడు.

"లేదు, నేను ఏడవను. కాని నన్ను మీరు మీరనడం బాగులేదు. నా పేరు కల్యాణి. అల్లాగే పిలవండి" అంది కళ్ళు తుడుచుకుని దుఃఖాన్ని ఒక్క–సారిగా విదిలించేసి. మధుకి ఆమె స్థైర్యం అచ్చెరువు కలిగించింది.

"చూడు సుబ్బులూ! కొంచెం కాఫీపెట్టి ఆయన కియ్యి" అంది లోపలున్న సుబ్బుల్నుద్దేశించి.

"చూడండి..."

"అదుగో మళ్లీ అండీ అంటున్నారు!"

"చూడు – నేనిప్పుడే తీసుకువచ్చాను. ఆ శ్రమ అనవసరం."

"అయితే మీరు ఫ్రపడేదంతా, బెట్టు చెయ్యకండి." వయస్సుకు మించిన శిక్షణ కనబడింది ఆమె ప్రవర్తనలో.

"ఇవాళ ఎల్లా ఉంది ఒంట్లో?" మాట తప్పిస్తూ అడిగాడు.

"చూస్తున్నారుగా, కాస్త లేచి కూర్చోగలుగుతున్నాను మీ దయవల్ల. మీకెల్లా కృతజ్ఞత చెప్పాలో తెలియకుండా ఉంది."

"ఇల్లా కృతజ్ఞతతో ఉక్కిరి బిక్కిరి చేసేస్తే యీ ఛాయలకే రాలేను. అయినా యిందులో ఏమంత ఉందని––"

పది నిమిషాల్లో కాఫీ పట్టుకొచ్చింది సుబ్బులు.

నాలుగయిదు రోజులకి కల్యాణి పూర్తిగా కోలుకుంది. ఈలోగా సుబ్బులువల్ల విషయాలన్నీ తెలుసుకున్నాడు తను.

కల్యాణి తండ్రి తాలూకా ఆఫీసు గుమాస్తా. గంపెడు పిల్లలు – ఆదాయం తక్కువ. సుబ్బులు

యింట్లో పని మనిషి. ఒంటరిది. చాలా ఏళ్ళుగా వారింటిలో పని చేసింది. కల్యాణిని చిన్నప్పటినించీ ఎత్తుకు మోసింది. కల్యాణి అంటే ఎంతో వాత్సల్యం ఆమెకు. కల్యాణి ఐదవఫారం పాసై పరిస్థితు లనుకూలించక విరమించింది. పుస్తకాలు అవీ చదువుకుంటూ, తల్లికి పనులలో సాయపడుతూ కాలక్షేపం చేసింది. పెళ్ళీడుకొచ్చిన పిల్లను గుండెలమీద కుంపటిగా మోస్తూ కట్నం యిచ్చి పెళ్ళి చెయ్యలేక రెండో పెళ్ళివాడికివ్వ నిశ్చయించారు తలిదండ్రులు. తనకి పెళ్ళొద్దని ఏడ్చి మొత్తుకుంది కల్యాణి. వారు వినలేదు. కల్యాణి దుఃఖం చూసి సుబ్బులు కరిగిపోయి ఓదార్చింది. దుఃఖం దిగ మ్రింగి కల్యాణి తప్పించుకు బయటపడడమెలాగా అని ఆలోచించి పారిపోవడానికి నిశ్చయించింది. సుబ్బులు అనుసరించడానికి అంగీకరించింది. తండ్రి జేబులోవి యాభయిరూపాయలు సంగ్రహించి అర్ధరాత్రి రైలెక్కి ఇక్కడికొచ్చి పడ్డారు. రెండు రోజులు సత్రంలో మకాం అయిం తరువాత యీ ఇల్లు తీసుకుని ఎడ్వాన్సు ఇచ్చేసరికి డబ్బు అయిపోయింది. చేతికున్న గాజుల్లో ఒకటి అమ్మేశా రిద్దరూ వెళ్ళి.

కల్యాణి తప్పులతో యింగ్లీషు మాట్లాడేస్తుంది. వచ్చినప్పటినుండీ ఉద్యోగంకోసం ప్రయత్నిస్తూనే ఉంది. దొరకలేదు. డబ్బు అయిపోయింది. మిగిలిందల్లా యింకొక్క గాజు! పొదుపు చేద్దామని అర్ధాకలిగా భుజించిన ఫలితంగా జ్వరం వచ్చింది కల్యాణికి. ఆమె జ్వరపడడంతో దిక్కు తోచలేదు సుబ్బులికి. తను స్వతః అమాయకురాలు. ఏమీ తెలియదు కల్యాణికి; అండగాను, పెద్దదిక్కుగాను ఉండడం తప్ప తను చెయ్య గలిగింది శూన్యం. పిల్ల జ్వరపడేటప్పటికి బెంబేలుపడిపోయింది. కల్యాణి బలవంతంవల్ల రెండు రోజులూరుకుని మూడోరోజున వళ్ళు తెలీకుండా పడి ఉంటే చూసి దుఃఖం ముంచుకొచ్చి తన సహాయం అర్థించింది.—

తరవాత రెండు రోజులకి—

పరీక్షలముందు సెలవులిచ్చారు తనకి. సాయంత్రం నాలుగుకి రూంలో కూర్చుని చదువుకుంటున్నాడు. దగ్గు వినిపించింది. తలెత్తిచూస్తే గుమ్మంలో కల్యాణి. నమస్కరించింది. తను ప్రతినమస్కారం చేసి "రా కూర్చో" అంటూ కుర్చీ చూపించాడు.

టేబిల్ దగ్గర కొచ్చి నిలబడి " ఇవి ఉంచండి " అంటూ కొన్ని అయిదు రూపాయి కాగితాలు టేబిల్ మీద పెట్టింది.

"దేనికి?" సాశ్చర్యంగా అడిగాడు తను.

"మీరు మా కింద ఖర్చు పెట్టిందానికి." అంది తలొంచుకొని. డబ్బైతే తీర్చగలనుగాని దయాఋణం ఎల్లా తీర్చను? అని ప్రశ్నిస్తూన్నట్టుంది ఆమె తీరు, తను ఆ బొత్తితీసి లెక్కపెట్టాడు. ముప్ఫైఉన్నాయి.

"ఇంత అవదు." అన్నాడు యింకేమీ అనలేక..

. "ఎంత అయితే అంతా తీసుకోండి" అంది కల్యాణి యింకా తలొంచుకునే.

"ఉద్యోగం దొరికిందా?" అనడిగాడు.

"దొరికింది." అందికాని ఆ ఉత్సాహం కనబడ లేదు మనిషిలో. అబద్ధం ఆడే అలవాటు లేని కారణంగా అది బైటపడి పోయింది.

"అబద్ధం ఆడడానికి కూడా అలవాటుండాలి కల్యాణీ!" అన్నాడు తను.

"సరే—అబద్ధం ఆడవలసిన అవసరం కూడాలేదు నాకు. ఉద్యోగంరాలేదు. అయినా మీకు రావలసినవి మీరు తీసుకోండి." అంది అభిజాత్యంతో.

తను యిరకున పడ్డాడు. వద్దంటే అపార్థం చేసుకుంటుందేమో. పుచ్చుకుంటే — యింకామె చేతిలో పాతికో పరకో ఉంటాయి. దానితో యింకెన్నాళ్ళు గడిచేటట్టు?—అసలీ ముప్ఫై ఉంటే మాత్రం?— ఆమె అలవంబించే యీపద్ధతి అంత సులువైనదికాదనీ తన్నకున్న చదువుతో స్వతంత్రంగా పొట్టపోసుకోవడం తేలిక కాదనీ ఆమెకు నచ్చ చెప్పాలి—అదీ కాక ఆమె తలిదండ్రులీ పాటికి ఎంతో పశ్చాత్తాప పడుతూ ఉండొచ్చు - ఏ అఘాయిత్యం చేసిందోనని భయపడుతూ ఉండొచ్చు—యీ పరిస్థితిలో ఆమె యింటికెళ్ళిపోతే అన్నీ చక్కబడవచ్చు.

తన ఆలోచనలతో మౌనం వహించి ఉంటే కల్యాణి వెళ్ళిపోవడాని కుద్యమించింది.

"కల్యాణీ ఒక్కమాట"

ఆగి "చెప్పండి" అంది.

"నన్ను నీ స్నేహితుడుగా తీసుకుని అపార్థం చేసుకోనంటే ఒక్క సలహా—"

"చెప్పండి" పొడిగా అంది.

"నువ్వు యింటికి వెళ్ళిపో."

చురుక్కున ఒక్కసారి చూసింది తనకళ్ళలోకి —కల్యాణివి అంత పెద్ద కళ్ళని తన కప్పుడే తెలిసింది.

కోపగించుకోకు—సుబ్బులుమీద అలగకు. నా మాట విను."

"మీకు తెలీదు" కళ్లనీళ్లెట్టుకుంది.

"నాకంతా తెలుసు. అప్పటి పరిస్థితులలో నువ్వల్లా చెయ్యడం తప్పులేదు. యీపాటికి మీవాళ్లు చల్లారిఉంటారు. నీకోసం బెంగపెట్టుకుని కూడా ఉంటారు — ఇక యిక్కడ నీ చదువుతో నీకొచ్చే ఉద్యోగంతో బతకడం చాలా కష్టం. నీకు అనుభవం తక్కువ. అడుగడునా కష్టాలే ఎదుర్కొంటూ బాధ పడడంవల్ల నిస్పృహ ఎక్కువౌతుంది—నామాట విని వెళ్ళిపో కల్యాణీ! ఈ డబ్బుకూడా వుంచు. ఇంటికి వెళ్ళి పంపించు."

"అల్లాగే" ఆ డబ్బు కూడా తీసుకుని వెళ్లిపోయింది కల్యాణి.

మొన్నాడు యిల్లు కాళీచేసి వాళ్లు వెళ్లిపోయారు. వెళ్లే ముందు కనీసం తనతో చెప్పైనా వెళ్ళలేదే అని బాధపడ్డా తన మాటమీద విలువ ఉంచి వెళ్ళినందుకు తానొక విధంగా సంతోషించాడు.

నాటికి నేడు చూడ్డమే మళ్ళీ. ఇది కలలో కూడా ఊహించలేని సంఘటన. బుద్ధిగా యింటికివెళ్లిపోయి ఉంటుందనుకున్నాడుగాని యీ విధంగా మళ్లీ కలుస్తానని అనుకోలేదు తను.

"కల్యాణీ—" రీలు ఆఖరి ఫ్రేము చూస్తూ మరో లోకంనించి పిలిచాడు మధు.

"టైం మెషీన్ ముందుకి తిప్పండి సార్" చిలిపిగా నవ్వుతూ అంది తపతి.

"అక్కడ అంతర్ధానమైన రాకుమారి యీ మణిమయ హార్మ్యంలోకి వచ్చేలోపున జరిగిన కథ ఏమిటి?" కుతూహలంతో అడిగాడు.

"తరువాయి కథ వెండి తెరపై తిలకింపుడు."

"అది పాంప్లెట్స్‌మీది భాష. కావాలనుకున్న వాళ్ళకి తెరమీద దొరుకుతుంది జవాబు. ఇక్కడది చెల్లదుగా."

"అట్లయిన సావధానంబుగా నాలకింపుడు. ఆనాడు మీ వచనంబుల శిరసావహించలేకను మిమ్ము నొప్పింప నిష్టంబులేకను మరొక గృహంబునకు తరలితిమి. హస్తంబునందలి ద్రవ్యంబు వెన్నవలె కరుగజొచ్చె— అబ్బ యింక గ్రాంధికము ఆపేస్తాను—డబ్బు చెల్లబడి అయిపోతూంటే నిస్పృహ ఎక్కువౌతూ మీ మాటైనా విననైతినే అని బాధపడి అందుకూడా డబ్బు చాలని స్థితిలోకొచ్చాం. అల్లా యింకొద్ది రోజులు జరిగితే ఏమయ్యేదో చెప్పలేనుగాని ఒక గర్ల్స్ స్కూలు ఆఫీసులో అటెండర్ పోస్టు దొరికింది. అమాంబాపతులు యాభైరూపాయల జీతం. అది చాలక నానా తిప్పలు పడుతున్నా కొంతవరకు నిరాశ తొలిగి బ్రతుకుమీద ఆశ జనించింది. ఎటండర్‌నే అయినా నాలుగు ముక్కలు వచ్చును గనక క్లర్క్ పని చేసిపెట్టి హెడ్‌మిస్ట్రెస్ మన్ననకి పాత్రురాలి నయ్యాను. ఆమె నామీద దయదలిచి రెండుమూడు యిళ్ళల్లో ఒకటి రెండు తరగతుల పిల్లలకి ట్యూషన్స్ యిప్పించింది. అవో పాతిక వచ్చేవి. ఇల్లా ఆరునెలలు గడిచాయి. యీలోగా మా హెడ్‌మిస్ట్రెస్ ప్రోత్సాహంతో నేను మెట్రిక్‌కి కట్టడానికి సన్నాహాలు చేసుకున్నాను.

"కాని యింతలో మరో సంఘటన పరిస్థితుల్ని తారుమారు చేసింది. ఒకనాడు ఒక ఇంట్లో ట్యూషన్ చెప్తూండగా ఒకాయన వచ్చారు. పాఠం చెప్తున్న నన్ను యాధాలాభంగా చూసి, ఆపైన ఆగి పరిశీలనగా చూసి నేను తలదించుకోవడంతో బాగుండదనుకొని లోపలకు వెళ్ళిపోయారు.

"అరగంట తరవాత తిరిగి వస్తూ అప్పుడే పాఠం ముగించి వెళ్లిపోబోతూన్న నన్నుద్దేశించి 'చూడమ్మా! నీకు సినిమాలో నటించడానికి ఏమైనా అభ్యంతరం ఉంటుందా?' అని అడగేసరికి నాకుమతిపోయి కళ్లప్పగించిచూస్తూఉండిపోయాను. ఆయన నా అదురుపాటు గ్రహించి నవ్వి, 'కంగారు పడకమ్మా! ఆలోచించుకునే చెప్పు.' అంటూ నిష్క్రమించారు.

"తరవాత తెలిసింది ఆయన కెమేరామన్ అనీ, ఆ యింటాయన స్నేహితుడనీ, ఆయన పని చేస్తున్న పిక్చర్లో కొత్తవాళ్లకి స్థానం యివ్వాలని వాళ్ల ప్రొడ్యూసర్ నిర్ణయించారనీ, వాళ్లు కొత్తముఖాల కోసం వెతుకుతున్నారనీను.

"కెమెరాతోటి అనుభవంవల్ల నా మొహం ఫొటోజెనిక్‌గా ఉంటుందని ఆయన గ్రహించారు.

"ఆయన ఆ ముక్కలన్నప్పటి నా అవస్థ వర్ణనాతీతం. అది నిజమో వేళాకోళమో తెలీదు. కాని చాలా ప్రసన్నంగా వున్న ఆయన ముఖంలోకాని మాటల్లోకాని వేళాకోళానికి తావు కనబడలేదు. అయినా

ముక్కూ మొగం ఎరుగని నాతో ఆయనకి పరాచికాలేమిటి?–కాని సినీమాకి పనికివస్తానని నేను నమ్మలేకపోయాను. గొప్ప అందగత్తెనని ఎప్పుడు అనుకోలేదు! ఎవరూ నాతో అనలేదు.

"ఏం చెయ్యడానికీ తోచలేదు. యింటికి వెళ్లాను. ఏదో తెలియని భయం, ఆనందం–రెండూ నన్నావహించాయి. ముళ్లమీద వున్నట్టనిపించింది. ఎవర్ని సలహా అడుగుదామన్నా — మా సుబ్బులు వట్టి వెర్రిది – మా హెడ్ మిస్ట్రెస్‌ని అడిగితే తానేటూ చెప్పలేనంది. ఒకలా చూస్తే అదృష్టం—కాని భవిష్యత్తు ఎలా ఉంటుందో తెలీదు—నిశ్చయం తీసుకోవలసివచ్చింది. ఎంత యోచించీ ఏదీ తేల్చుకోలేక రెండు చీట్లు 'చేరు, 'వద్దు' అని రాసి లాటరీ వేసి సుబ్బులుచేత తీయించాను. 'చేరు' అని వచ్చింది—తెగించి చేరడమే మంచిదనిపించింది. అదివరలో ఒకసారి తెగించి యింట్లోంచి పారిపోయాను భావిమీద ఊహ లేకుండానే. సరే యిప్పుడూ అదే మంచిదనిపించింది.

"మూడోరోజున ఆయన వచ్చి మళ్ళీ అడిగారు–ఒప్పుదల సూచించాను. స్క్రీన్ టెస్ట్‌కి తీసినఫోటోలో నా మొహం చూసిన నాకే ఆశ్చర్యం వేసింది. అ మాత్రం బాగుంటానని నాకేనాడూ తట్టలేదు—అదివరలో నేనెన్నడూ ఫోటో తీయించుకుని ఎరగను.

"మొదటి పిక్చర్లో నా పాత్ర చిన్నదైనా చాలా మందిని ఆకర్షించింది—తరవాత చెప్పకోదగ్గ వేమీ లేవు—రొటీన్‌లో పడడం–పేరు పెరగడం–ఆదాయం పెరగడం తప్ప—" కథనం ముగించింది తపతి.

ఇంతలో పని మనిషి ట్రేలో రెండు గ్లాసులలో పళ్ళరసం–రెండు సాసర్లలో రెండేసి స్లైసుల బ్రెడ్ మరో డిష్‌లో బట్టర్, రెండు చక్రకేళీ అరటిపళ్ళు—రెండు నైవ్స్ (Knives) గోడపక్కనున్న మూవబుల్ టేబుల్ మీద పెట్టి తోసుకుంటూ వచ్చింది మంచం దగ్గిరికి.

తపతి కత్తితో వెన్న తీసి బ్రెడ్ స్లైస్‌లకి రెండు వైపులా దిట్టంగా పట్టించి ఒకటి మధుకి అందిస్తూ "తీసుకోండి" అంది.

"నేను భోజనం చెయ్యాలి పోయి. ఇప్పుడివి తింటే ఆకలి చెడుతుంది. అయినా నీకు మాత్రం భోజనం ముందు యివి ఏమిటి?" అన్నాడు ఆమెను వారిస్తూ.

"నాకు రాత్రి భోజనం యిదే. ఎక్కువ తింటే లావెక్కిపోతానని చెప్పాడు డాక్టర్." అంటూ నవ్వి "మీకు అభ్యంతరం అయితే మానెయ్యండి" అంది నిష్టూరంగా.

"అభ్యంతరమని కాదు—" గొణిగాడు.

"అయితే తీసుకోండి" అని అతని కొకటి అందిచ్చి తానొకటి తీసుకుంది.

"అమ్మగారూ" అంది పని మనిషి.

"ఏమిటి రుక్మిణీ?" అడిగింది తపతి.

"సెక్రటరీగారు మిమ్మల్ని కలుసుకోవాలంటున్నారు."

"సరే రమ్మను—అయితే యింతకీ అమ్మగారేరీ ?"

"పార్థసారథి కోవెల కెళ్లారు."

"తిరిగి వచ్చిం తరవాత పైకోసారి రమ్మను వెళ్లు" అంది.

ఆరగింపులయ్యే వేళకి సెక్రటరీ వచ్చాడు.

తల సగం తెలుపుకి తిరిగిన నలభై అయిదేళ్ళ వ్యక్తి ఆయన.

"కూర్చోండి" అంది కుర్చీ చూపించి.

కూర్చున్నాడు.

"చెప్పండి" అంది తపతి.

"రేపు మీకు '—' పిక్చర్కు సెవెన్ టు నైన్ కాల్ షీట్ ఉంది."

"జ్ఞాపకం ఉంది. కణ్ణాకి కూడా చెప్పండి."

"తరువాత '—' ప్రొడక్షన్స్ వాళ్ల సుందరం గారు మూడు సార్లు ఫోన్ చేసి అయిదింటికి స్వయంగా వచ్చారు. వచ్చే నెలలో 16, 17, 18 తారీఖులలో కనీసం సింగిల్ కాల్ షీట్స్ అయినా కావాలట."

"మరి మనం యిచ్చిన డేట్సు—"

"హీరోగారికి ఆ సెట్‌లో వచ్చే మరినలుగురికీ అవి సరిపడలేదుట."

"ఎడ్‌జస్ట్ చెయ్యగలరా ?"

"కుదరదు."

"ఏమాత్రమూ"?

"ఊహు".

"అయితే అల్లాగ చెప్పెయ్యండి."

"ఆవతెల్లుండి షెడ్యూల్‌లో మార్పులొచ్చాయి. '—' ఆర్ట్స్ ప్రొడక్షన్ వాళ్ల క్లైమాక్స్ సీన్స్‌కి కాల్

షీట్ ప్రొవైడ్ చెయ్యవలసి వచ్చింది. అవాళ మీకున్న పని '—' మూవీస్‌తో—అది వాళ్ల అనుమతితో కాన్సిల్ చేసాను."

"వాళ్లు మీ కెంత యిచ్చారు?" నవ్వుతూ అడిగింది తపతి.

"ఏమిటి మీ రనేది?" కోపం ప్రకటించాడు.

"తగ్గండీ—"

"ఇల్లా ఐతే—"

"ఇక్కడ పని చెయ్య లేనంటారు. మంచిది. శుభస్య శీఘ్రం" టక్ మని అనేసింది—

గబుక్కున ఆమె అనెయ్యడంతో సెక్రటరీ నోరు మూతపడిపోయింది.

"చూడండి—ఎందుకు మీ కివన్నీ — మీకు యిబ్బంది అయినప్పుడు నన్నడగరాదా?—మొన్న మీ అమ్మాయి పెళ్లంటే రెండు వేలిచ్చాను—అబ్బాయి చదువంటే యిచ్చాను—ఇంక మీకు తృప్తి ఎక్కడికి? నాకు ఒకరిద్దరు చెప్పారు. వాళ్లని డబాయించాను మీ తరఫున వాదించి. కాని నిప్పులేందే పొగరాదు' ఈ విషయంలో నాకు మళ్లా కంప్లెయింట్ వస్తే బాగుండదు—పైనెల్లో కాల్‌షీట్స్ కావాలన్నారన్నారే సాధ్యమైనంతవరకు ప్రయత్నించి సరి పెట్టండి. వాళ్లదగ్గిర ముక్కుపిండి వసూలు చేస్తున్నాం గదా! డబ్బు—వాళ్లనెందు కిబ్బంది పెట్టాలి చెప్పండి" సన్నసన్నగా చివాట్లు వేస్తూ నచ్చజెప్పే ధోరణిలో అంది తపతి.

మౌనం వహించాడు సెక్రటరీ—కాని యింకా కదలలేదు.

"ఇంకేం కావాలి?"

"ఇన్‌కమ్ టాక్స్ వాళ్లు దగ్గర్నించి పదివేలు ఫైన్ కట్టమని నోటీ సొచ్చింది. '—' పిక్చర్స ఎక్కౌంట్సులో మనకిచ్చిన 'బ్లాక్' 'వైట్'లో ఎంట్రీ వేసారుట—"నసిగాడు.

"కిక్కురు మనకుండా కట్టేసి ఆ రసీదు చూపెట్టి ఆ పదీ ఆ ప్రొడ్యూసర్ దగ్గిర వసూలు చెయ్యండి—ఇంక మీ పని ముగిసినట్టేనా?"

"ఆఁ" అని సెలవు తీసుకున్నాడు సెక్రటరీ.

ఒక్క నిట్టూర్పు విడిచి "యిదీ వరస!" అంది తపతి మధుతో.

క్షణక్షణానికి అధికమౌతున్న ఆశ్చర్యం కనపించిందతని ముఖంలో.

"ఇంక నే వెడతాను—"అంటూ లేచాడు.

"అప్పుడే—అన్నట్టు శ్రీమతి ఎదురు చూస్తూంటుంది గాబోలు—"

"అంత భాగ్యానికి నోచుకోలేదు." నవ్వుతూ అన్నాడు మధు.

"ఏం?" యీ మాటు నిజంగానే ఆశ్చర్యపోయింది తపతి.

"ప్రత్యేకం కారణాలంటూ ఏమీలేదు — అయినా ఘటన ఉండొద్దూ?" మళ్లీ నవ్వాడు.

"మకాం ఎక్కడ?"

"టి. నగర్."

"అయితే యిప్పుడు రూంకెళ్లి మాత్రం చేసేదేముంది? ఇక్కడ ఉండిపొండి."

"ఊహు"

"ఏం పరువు తక్కువా?"

"ఎందుకూ?"

"మరంత మొహమాట మేం? ఒకపూట నా ఆతిథ్యం స్వీకరించలేరూ?" బతిమాలే ధోరణిలో అంది.

"సరే అల్లాగే కానియ్యి."

"ఇంతకీ ఉద్యోగం ఎక్కడ ?"

"ఏదో ప్రైవేట్ ఫర్మ్."

"ఎంతిస్తారు?—అయినా అడిగితే కోపం వస్తుందేమో?"

"కోపం ఎందుకూ?—నూటయాభై."

"ఇంతే!!?"

"ఏం సబ్బు కరుస్తుందనుకున్నావా?"

"స్కూల్ ఫైనల్ పాసయ్యాడు మా సెక్రటరీ—నేను అడపా తడపా యిచ్చేది కాక నెలనెలా మూడు వందల యాభై యిస్తాను."

"నువ్వు అదీ పాసవలేదు. లక్షలార్జిస్తున్నావు."

"ఎంత అసూయ?" కళ్లు గుండ్రనచేసి మూతి సున్నాలా చుట్టి ముద్దు ముద్దుగా అంది.

"మానవ సహజం."

బైట అడుగుల సవ్వడి వినవచ్చినది.

తలుపు తెరుచుకుని సుబ్బులు వచ్చింది.

ఖరీదైన దుస్తులు, కొద్ది నగలు తప్పించి అప్పటికీ యిప్పటికీ ఆమెలో మార్పులేదు.

మధుని చూసి ఆశ్చర్యపోయింది.

"నమస్కారం బాబుగారు! ఎన్నాళ్ళకి మళ్ళీ!"

"మౌంట్ రోడ్డులో కనబడితే లాక్కొచ్చాను సుబ్బులూ—మన్ని బొత్తిగా మరిచేపోయారు.—" అంది తపతి.

"ఏనాటి మాటమ్మా! కులాసాగా ఉన్నారా బాబూ?"

"ఆ!" అన్నాడు మధు.

"మా సుబ్బులు మాత్రం నన్ను వది లెయ్యలేదు." అంది తపతి మధుతో.

"అదేమిటి తల్లీ అల్లా అంటావు—"అని వాత్సల్య పూరిత దృష్టితో తపతిని తిలకించి—మధుతో "ఎన్నో సార్లు ఉత్తరాలు రాసింది—నన్ను పంపింది—తండ్రి పోనేపోయాడు, తల్లి చెల్లెళ్లు తమ్ముళ్లు—ఒక్కళ్లు రారు. అమ్మాయిని రమ్మనరు. కాని అమ్మాయిపంపే-" అర్థోక్తిలోనే ఆగిపోయింది, "సుబ్బులూ" సగం నిర్లిప్తత, సగంకోపం కలిసిన స్వరంతో తపతి అనగానే.

మధుకి అర్థం అవనే అయింది.

"తల్లీ బాబుగారి భోజనం—"

"పైకి పంపించు."

"నేనిలా ఉండడం నీకిష్టం లేదా? — ఇప్పుడివన్నీ తిని—"యిస్తే అంతే తినండి — కాదంటే ఇంకో గంట పోయాక—"బలవంతపెట్టింది తపతి.

"తప్పనప్పుడు చేసేదేముందీ - యిప్పుడే చేస్తాను. కాని—"

సుబ్బులు కిందకెళ్లి వంటమనిషిచేత భోజనం పంపించింది.

"ఆ కూరలా పారేస్తారేం?" "ఇంకొక్క ముద్ద తింటే ప్రమాదమా" "ఆ పెరుగు వదిలేస్తే నా మీదొట్టే" —ఇలా అంటూ ఆప్యాయంగా బతిమాలీ, కోప్పడీ, పట్టుపట్టి తపతి తినిపిస్తుంటే వద్దనుకుంటూనే మరి నాలుగు ముద్దలు ఎక్కువ తిన్నాడు మధు.

పక్కన మనిషి కూర్చుని తినిపిస్తే భోజనం యింత తృప్తిగా ఉంటుందని అతనికి జీవితంలో మొదటి సారిగా, తట్టింది. గత పదిపన్నెండేళ్లుగా హోటల్ కూటికి అలవాటుపడి పప్పూ, సాంబారు, పెరుగూ పొద్దున్నా, కూరా, చారూ, పెరుగూ రాత్రీ ఆకలిగా ఉన్నా అర్థాకలిగాతిని లేచిపోయే అతనికిది నూత్నాను భవమే. ఇంటిలో తానొక్కడే సంతానం కాదు— అంచేత తల్లి తనకేనాడూ యింత శ్రద్ధగా తినిపించే యోగ్యత దక్కలేదు. చదువు ఉద్యోగాల మధ్య తనించుమించు ఇంట్లో పరాయివాడే అయిపోయాడు.

ట్రేలోని తాంబూలపు సామగ్రిని తీసి వక్కపొడి మధుకిచ్చి తాను వేసుకుని, ఆకులకి రోజ్ కలర్ సెంటెడ్ సున్నం రాసి యీనెలు తీసి చిలకలు చుట్టి అతనికిచ్చి తాను వేసుకుంది.

బాల్కనీ నంతా కాంతివంతం చేస్తున్న లైట్ ఆర్పి వెన్నెల వెలుగులో ఆకాశపు చాందినీ కింద కుర్చీలలో కూర్చున్నా రిద్దరూ.

మబ్బులులేని ఆకాశంలో మిణుకు మినుకు మంటున్నాయి చుక్కలు. అష్టమి చంద్రుడు అర్ధ వృత్తమయిన కృతిలో ఉన్నాడు. చుట్టూఉన్న గార్డెన్ లోని మొక్కల ఆకులు ఆ మసక వెల్తురులో నల్లగా కనిపిస్తున్నాయి. చల్లనిగాలి, ప్రకృతీ కలిసి మనసును చల్లబరుస్తున్నాయి.

అప్పుడప్పుడు తిరిగే కార్ల హారన్ల మోత నిశ్శబ్దాన్ని భంగపరచడం — హెడ్ లైట్స్ వెల్తురు చెట్ల మీదనించి నీడలని సాగించుకుంటూపోవడం — ఇవే మార్పులు ఆ వాతావరణంలో.

చాలా నిమిషాలు మౌనంగా గడిచాయి వారి మధ్య.

"కల్యాణీ — " నిశ్శబ్దాన్ని చీలుస్తూ మధే పిలిచాడు.

"ఊఁ" పలికింది తపతి.

"నిద్రవస్తోందా ?"

"ఉహు."

"ఆలోచిస్తున్నావా ?"

"ఉహు."

"మరి మౌనం వహించావేం ?"

"ఊహకి కూడా అతీతమైన సంతోషంతో నిండింది నా మనస్సివాళ — ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అయిన నా మెదడు ఆలోచించదు — నా నాలుక మూగవోయింది—" కళ్లు మూసుకుని అంది తపతి.

"ఏమిటా సంతోషానికి కారణం ?"

"మీ రాక."

"ఏ స్క్రిప్టులోది కల్యాణీ యీ డైలాగులు" నవ్వాడు మధు.

చటుక్కున ఒక్కసారి కోపంతో లేవబోయి, మళ్ళీ సంబాళించుకుని - "కల్యాణి ఆత్మకథలోది" అంటూ నవ్వేసింది.

"నవ్వుతావేం?"

"మీరు నమ్మలేని నిజాన్ని చెప్పిన పొరపాటుకు—"

"అడుగులకి మడుగులొత్తే యింతమంది మధ్య, డబ్బుతో తులతూగే నీకు నా ఉనికి ఆనందాన్నిస్తుందంటే ఎలా నమ్మను కల్యాణీ—"

"డబ్బు, డబ్బు, డబ్బు—దానితోనే నాకున్న గౌరవమంతా - మనిషిగా నేనెవ్వరికీ అక్కర్లేదు మా సుబ్బులికి తప్ప—ఛీ!" చీత్కారం చేసింది.

మౌనంగా ఊరుకున్నాడు మధు.

కొద్ది క్షణాల తరువాత "ఊరుకున్నారేం? కోపం వచ్చిందా?" మృదువుగా అడిగింది తపతి.

"లేదు."

"అనుమానాలు పెంచుకోకుండా కాస్సేపు హాయిగా ఎందుకుండలేరు మీరు?"

"దానికీ అలవాటుండాలి."

"ఇంక ఆపండి — మీరోటి - నేనోటి - యిల్లా అనుకుంటూపోయి ఏం ప్రయోజనం?—వాటికేంగాని మీకు ఒకవారం లీవు దొరుకుతుందా?"

"ఎందుకూ?"

"చెప్పండి."

"కావాలంటే దొరుకుతుంది."

"మీరో వారం సెలవు పెట్టి యిక్కడేందు కుండిపోకూడదూ?" బ్రతిమాలే ధోరణిలో అడిగింది.

"అల్లాగే — కాని నా బట్టలు అవీ రూంలో ఉండిపోయాయి."

"రేపొద్దున్నే మీరు లేచేవేళకి తెప్పిస్తాను. 'కీ' యిటివ్వండి."

యిచ్చాడు మధు.

మళ్ళీ నిశ్శబ్దమైంది వాతావరణం.

భోజనం ఉదాత్తం కావడం మూలానా, చల్లటి వెన్నెల, చిరుగాలి, ప్రకృతి జోలపాటల కారణంగాను మధుకి కునుకు పట్టింది.

పది నిమిషాల తర్వాత—

"చూడండి—" అని మొదలెట్టి మధు పలకపోయేటప్పటికి లేచి అతని దగ్గరికెళ్ళి కుదిపి "మిమ్మల్నే—భలే! అప్పుడే నిద్రపోయారే—లోపలికెళ్లి నా గదిలో పడుకోండి" అంది తపతి.

"మరి నువ్వో" లేచి బద్ధకంగా అడిగాడు.

"నా సంగతికేం ఆ పక్క గదిలో పడుకుంటాను."

మధు లేచి యాంత్రికంగా పక్కమీదకు వెళ్లి పడ్డాడు.

కూడా వెళ్లిన తపతి పెద్దలైట్ ఆర్పి ఆకుపచ్చటి బెడ్‌రూం లైటు వెలిగించి సీలింగ్ ఫాన్ తక్కువ స్పీడ్ ఉంచి పక్క గదిలోకి వెళ్లిపోయింది.

తీరా పక్కమీద వాలిం తరువాత అతని నిద్ర తేలిపోయింది. అంత మెత్తటి పరుపు అలవాటులేని కారణాన సుఖాపాది కాలేకపోయింది.

మళ్ళీ ఆలోచనలు చుట్టు ముట్టాయి.

ఇన్ని భౌతిక సుఖాల మధ్య తపతి వైరాగ్యమే అనుభవిస్తున్నట్టు తోస్తుంది. సౌఖ్యమైనంతవరకు మనస్సును మభ్యపెట్టి సుఖిస్తున్నానని అనుకోవడానికి ప్రయత్నిస్తున్నట్టే కనబడుతుంది. ఎందుకని? - యీ వాతావరణం కృత్రిమం కావడంనించా?—తన డబ్బు చూసి గౌరవిస్తే మాత్రం బాధపడడం ఎందుకు? ఎవరైనా తమకున్న ఏదో ఒక గుణంవల్ల గౌరవింపబడతారు. ఆ గుణం డబ్బే ఎందుకు కాకూడదు? తనకే డబ్బుంటే ధన్తే యిన్ని ఆలోచనలు చెయ్యడు - హాయిగా అనుభవిస్తాడు.

ఇల్లా ఆలోచిస్తూ ఎప్పుడో నిద్రపోయాడు.

మెలుకువ వచ్చి వాచీ చూసుకునేసరికి ఎనిమిది అయిపోయింది. తూర్పువైపు కిటికీలోంచి ప్రొద్దుటి ఎండలో శోభిస్తున్న వివిధ రకాల పువ్వుల మొక్కలు. వాటి మధ్య తోటమాలి.

ఇంతసేపు నిద్రపోయినందుకు సిగ్గుపడుతూ గబుక్కున లేచాడు.

పక్కనే టేబిల్ మీద తన బ్రష్, పేస్ట్, టవల్ పంచ చొక్కా అన్నీ ఉన్నాయి. అవి చూడగానే కల్యాణిని తల్చుకుని "ఎంత శ్రద్ధ" అనుకుని కాలకృత్య నిర్వహారణకి బాత్ రూంలో చొరబడ్డాడు.

మూడడుగుల ఎత్తువరకు పాలగచ్చు చేయబడ్డ గోడలు, షవర్, టాప్ ఎరేంజ్ చెయ్యబడ్డ టబ్— ఇవి కాక ఒక పక్కగ సింక్స్, వేడినీళ్ళకీ చన్నీళ్ళకీ చెరోపక్కా టాప్‌లు, భుజాల దగ్గిరనించి పైకి కనబడేటట్టు గోడకి అమర్చిన అద్దం - దండాలమీద టవల్స్-

ఒక అలమారులో సబ్బు బిళ్లలు, లిక్విడ్ సోప్ బాటిల్, డెట్టాల్, ఫినైల్—

డబ్బు విలువ మరోమారు దిగ్భ్రమను కలిగించింది మధుకి.

కాలకృత్యాలు ముగించి గదిలోకి ప్రవేశించేసరికి పని మనిషి రుక్మిణి కాఫీఫలహారాలు సిద్ధంగా ఉంచింది.

కాఫీ తాగుతూ "అమ్మగారేరి?" అని అడిగాడు.

"రెండు గంటల క్రితమే పెద్దమ్మగారు, చిన్నమ్మగారు షూటింగ్‌కి వెళ్లిపోయారు, మీరు లేచేవరకు మిమ్మల్ని లేపవద్దన్నారు. ప్రతి పావుగంటకీ వచ్చి పోతున్నాను. ఇది మీకిమ్మన్నారు" అంటూ ఒక చీటి అందించింది.

నిద్రలేపడం యిష్టంలేక చెప్పకుండా వెళ్లిపోయినందుకు ఏమీ అనుకోవద్దనీ, పెద్దకారు అట్టేపెట్టాననీ ఎక్కడికి కావలసినా వెళ్లమనీ, చదువుకోదల్చుకుంటే లైబ్రరీరూంలోకి వెళ్లమనీ, ఏవిధమైన మొహమాటమూ పెట్టుకోవద్దనీ సూచించిందందులో.

"ఎంత శ్రద్ధ ! ఇన్ని పనుల మధ్య—" మరోసారి అనుకోకుండా ఉండలేకపోయాడు మధు. అతని మనస్సంతా మాధుర్యంతో నిండింది.

"మీ బట్టలు బీరువాలో ఉన్నాయి-మంచానికి హాలులోను కాలింగ్ బెల్లు మీటలున్నాయి మీ రెవర్నైనా పిలవదల్చుకుంటే—"అంటూ కాఫీప్లేట్లు తీసుకుని వెళ్లిపోయింది రుక్మిణి.

మాయామందిరంలోకి వచ్చిపడ్డట్టయింది మధుకి. తనకి కావలసినివన్నీ వాటంతట అవే ప్రత్యక్షమౌతున్నాయి.

క్రిందకు వచ్చాయి.

హాల్లో ఒక మనిషి ఎదురై "కారు తెమ్మంటారా?" వినయం ఉట్టిపడుతూ అడిగాడు.

"అక్కర్లేదు, కాని లైబ్రరీరూం ఎక్కడ?"

"ఇటురండి" అంటూ లైబ్రరీలోకి దారితీశాడు.

నీట్ గా బీరువాలో సర్ది ఉన్నాయి పుస్తకాలు.

ఒక యీజీఛైర్ పక్కనో చిన్న టేబుల్, దాని మీద టేబిల్ లైటు.

తనకు తెలిసి ఉన్న పుస్తకాలన్నీ ఉన్నాయి బీరువాలో. తనకి తెలియని వెన్నో ఉన్నాయి.

కల్యాణి యివన్నీ చదివి ఉంటుందా?—లేక కేవలం యివన్నీ గృహాలంకరణలోని భాగాలేనా ?

అలెగ్జాండర్ డ్యూమా కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో తీసి పడక కుర్చీలో కూలబడి అందులో మునిగి పోయాడు.

పదకొండు గంటలకు రుక్మిణి వచ్చి భోజనం మాట గుర్తుచేసేవరకు అతనికి యీ ప్రపంచపు ఉనికే గుర్తులేదు.

తపతికి అత్యంత సన్నిహితుడని తెలియడంతో ఎంతో శ్రద్ధాభక్తులతో మెలుగుతున్నారు సేవకులు మధుపట్ల. ఇంప్లిసిట్ ఒబీడియన్స్ తప్ప ఒకరి ప్రవర్తనని విమర్శించే తత్వం కాదు వారిదని గ్రహించాడు మధు.

సాయంకాలం అయిదు గంటలకి డ్రైవర్ని పిల్చాడు.

మౌంట్ రోడ్ లోంచి మెరీనాకి పొమ్మన్నాడు.

స్పెన్సర్ కంపెనీ—మహమ్మద్ యిబ్రహిం—ఎయిర్వేస్ బోర్డులు—అన్ని దాటిపోతున్నాయి.

నిన్నటికీ యివాళ్టికి ఎంత తేడా?

నిన్న అదేప్రదేశాలని పేవ్ మెంట్ మీద నడుస్తూ తిలకిస్తూ కార్లల్లో పోయేవాళ్లని చూచి అసూయ పడ్డాడు.

కాని యివాళ అల్లా అనిపించడం లేదు.

తారు రోడ్డుమీద నిశ్శబ్దంగా జారిపోయే నలభైవేలు ఖరీదుచేసే కారులో ఉన్నాడతను. పేవ్ మెంట్స్‌మీద నడుస్తున్న వారిమీద జాలివేసింది—తనలాటి కొందరు తన కారులోకి నిక్కినిక్కి చూస్తున్నారు.

కారు మెరీనాలో ఆగింది. డ్రైవరు వచ్చి తలుపు తెరిచాడు.

దిగుతున్న మధుకి "తపతి కారు కదూ అది—వాడెవడు" అన్నమాటలు ఏమూలనుంచో వినబడ్డాయి.

అతని గుండెలు పిడచగట్టుకుపోయాయి.

గబుక్కున మళ్లీ కారెక్కేద్దామా అనిపించింది-అయినా ఎవడో ఏదో అంటే తనకెందుకు బాధ—వారిని తానాపగలడా?

అటూ యిటూ నాలుగడుగులు వేశాడు.

ఆ సముద్రపు హోరు—ఆ జనసందోహం—ఆ కోలాహలం—ఎందుకో అతన్ని ఉత్సాహపరచలేక పోయాయి.

కొంతసేపు మళ్లీ మాగున్నట్టు గడిపి యింటికి తిరిగి వచ్చేశాడు.

అతనికి అన్ని మర్యాదలు టైం ప్రకారం జరిగి పోతున్నాయి.

రాత్రి పది గంటలకి కూడా రాలేదు తపతి.

గత రాత్రి సరిగ్గా నిద్రలేనందున వెంటనే నిద్ర వచ్చేసింది మధుకి.

ఒంటిగంటకి మెలుకువ వచ్చేసింది—

కల్యాణి వచ్చిందో లేదో?

లేచి ఆమె గది తలుపు తోసుకుని లోపల ప్రవేశించాడు.

దుస్తులన్నా మార్చకుండా Exhaustedగా పడుకుని నిద్రపోతోంది కల్యాణి. కటిక రాతి నేలమీద గూడా ఆమెకా స్థితిలో నిద్ర వచ్చేస్తుంది—ఆ పరుపుల సౌభాగ్యాన్ననుభవిస్తున్న స్మృతి కూడా ఆమె కున్నట్లులేదు.

మంచం దగ్గరగా వెళ్లాడు. ఆ స్థితిలోవున్న ఆమెను చూచేసరికి మధుకి అపరిమితమైన జాలి వేసింది. లక్షలార్జించికన్నుసెట్టేఆమెకు క్షణంవిశ్రాంతిఉండదు! రాత్రి భోజనమే లేదు—ఇన్ని భౌతిక సుఖాల మధ్య ఆమె తన యిచ్చవచ్చినట్లుండడానికి వీలులేదు.

పక్కమీద కూర్చుని ఆమె ముఖంమీద పడుతున్న ముంగురులని సవరించి చిరుచెమటను తుడిచాడు.

ఆ స్పర్శకు ఆమెకు మెలుకువ వచ్చింది—

బద్ధకంగా అరమోడ్పుగా తెరిచిన కన్నులలోంచి అతన్ని చూస్తూ "మీరా—నిద్రపట్టటంలా" అంది నిద్రతో బరువెక్కిన కంఠంతో—

ఇటు ఒత్తిగిలిన ఆమె శరీరం మధుశరీరాన్ని తాకింది—వెచ్చగా తగిలిన ఆ స్పర్శ అతని రక్తాన్ని ఉడుకెత్తించింది.

పొద్దున్నే లేచిన మధు రాత్రి జరిగినది కలేమో ననుకున్నాడు గాని, తను తన గదిలో లేకపోవడం, కాదని సాక్ష్యం పలికింది.

చచ్చే సిగ్గు వేసిందతనికి—

నిన్నటిలాగే తపతి యివాళ కూడా మధు లేచేసరికి వెళ్లిపోయింది.

కాని సాయంకాలం అయిదుగంటలకే వచ్చేసింది.

వస్తూనే మధు దగ్గరకి వచ్చి "ఎక్కడికి వెళ్లలా మీరు—భలేవారే—" నవ్వింది వెన్నెలలు కురిపిస్తూ.

కాని మధు మాత్రం ఆమె ముఖంలోకి చూడలేకపోయాడు.

అది గ్రహించిన తపతి అతని గడ్డంపట్టుకుని తల పైకెత్తి కళ్ళల్లోకి చూస్తూ "ఎందుకో మూగనోము—" అంది.

"అబ్బే ఎందుకూ?" అన్నాడు తడబడుతూ.

"అదే నేనూ అడుగుతూంట—సరే మీరూ ఎక్కడికీ వెళ్ళలేదన్నారుగా—రెండు నిమిషాలలో బట్ట మార్చుకుని వస్తాను. మీరూ రెడీ అవండి" అంటూ వెళ్లిపోయింది మేడమీదికి.

మధు కూడా అనుసరించాడు.

పావుగంట తరువాత యిద్దరూ కిందకి దిగారు.

పోర్టికోలో పెద్ద కారుంది.

ముందు తలుపు తెరిచి "మీరెక్కి ఆ పక్కకి జరగండి—" అని అతను ఎక్కిన తరువాత తను ఎక్కి స్టీరింగు ముందు కూలబడింది.

అతి చాకచక్యంగాను, వేగంగాను ట్రాఫిక్‌ని తప్పించుకుంటూ ఊరు వదిలి తిన్నగా పోనివ్వసాగింది.

పక్కలకి సరుగుడు చెట్ల వనాలు, ఎడతెగని యిసుక దిబ్బలు, దూరంగా ఆకాశంతో చేతులు కలిపే నీలికడలి.

ఊరు దాటగానే ఆ ఆటోమాటిక్ కన్వెర్టిబుల్ టాప్ వెనక్కి తప్పించేసింది తపతి.

వేగంగా పోతున్న కారుకి ఎదురు వస్తున్న చల్లటి సముద్రపు గాలి ఎంతో ఆహ్లాదాన్ని కల్గిస్తూంది.

పదిమైళ్లు పోనిచ్చి ఒక పక్కకి కారాపి డాష్ బోర్డు సొరుగు తాళం తీసి అందులోంచి ఒక ట్రాన్సిస్టర్ రేడియో బైటకి తీసి తను దిగి, "దిగండి స్వామీ" అంది.

మధు కూడా దిగాడు.

ఫోల్డింగ్ కెమెరా అంత ఉంది సెట్.

పదిగజాలు యిసకలోకి నడిచి యిద్దరూ కూలబడ్డారు—క్రింద రుమాలు పరిచి ఏరియల్ ఎక్స్‌టెండ్ చేసి సెట్ ఆన్ చేసి ట్యూన్ చేసింది.

చక్కని జాజ్ సంగీతం వస్తోంది ఏదో స్టేషన్ నించి. ప్రకృతి నాట్యానికి తాళం వేస్తోందా సంగీతం.

కొద్ది నిమిషాలు మౌనంగా గడిచాయి.

"నువ్వు పెళ్లి చేసుకోవా కల్యాణీ!" హఠాత్తుగా అడిగాడు మధు.

"ఏం అల్లా అడుగుతున్నారు?" కొంచెం చకిత అయింది.

"చెప్పు."

"మీరే అన్నారుగా ఘటన ఉండొద్దూ?" వేళాకోళంగా అంది.

"వేళాకోళం కాదు కల్యాణీ—"

"నన్నెవరు చేసుకుంటారు—నా డబ్బు కోసం తప్ప." యింకా వేళాకోళంగా నే అడిగింది.

చటుక్కున తపతి రెండు చేతులూ తన చేతులలోకి తీసుకుని "నీ తప్పొప్పులన్నిటితోను నిన్ను నేను స్వీకరిస్తాను కల్యాణీ—" అన్నాడు ఆవేశంతో తడబడే కంఠంతో.

"ఇంచుమించు యిలాటి మాటలే కనీసం నేను అక్టు చేసిన ఆరు పిక్చర్లలో విన్నాను" పెదాలు బిగించి నవ్వుతూ అంది చేతులు వెనక్కి తీసుకోకుండా నే.

"నిజం కల్యాణీ —" రెట్టించాడు మధు సీరియస్ గా.

"నా డబ్బంతా ఏ శరణాలయానికో పంచిపెట్టేసినా?—" విచిత్రమైన నవ్వుతో అంది.

మౌనం వహించాడు మధు.

"ఊరుకున్నారేం?"

"నిజమని నమ్మించడం కష్టం-ఇంకా ఓపెన్ గా చెప్పెయ్యాలంటే నిన్ను నమ్మించుకోవడమే కష్టం."

"మీరంత కష్టపడొద్దు లెండి – ఇదంతా పంచిపెట్టేసి దారిద్ర్యాన్ని కొని తెచ్చుకునేటంత మూర్ఖురాల్ని కాదు" పక పకా నవ్వేసింది.

"కాని యిన్నిటి మధ్య నువ్వు పొందే సుఖం ఏమిటి? ఎవరికోసం యీ సంపాదనా నిరంతర శ్రమాను?"

"ఒక్కొక్కప్పుడు నాకూ అల్లాగే అనిపిస్తుంటుంది."

"అటువంటి అప్పుడు యీ జీవితాన్ని ఎందుకు వదిలెయ్య కూడదు? ఇప్పటికి ఆర్జించిన దానితో ఎందుకు సంతృప్తిపడి సుఖ జీవనాన్ని సాగించ కూడదు?"

"ఎందుకా? – నా బాంక్ ఎక్కౌంటు ఎంత ఉంటుందనుకుంటున్నారు?"

"కనీసం ఏడెనిమిది లక్షలు."

"కాదు – కేవలం రెండు లక్షల చిల్లర-మరి మా యింటి ఖర్చు నెలకి ఎనిమిది వేలు – ఎన్నాళ్లొస్తుందీ రెండు లక్షలు?"

"యీ జీవితం వదిలేస్తే యింత ఖర్చెందుకు?"

"ఒక స్థాయికి అలవాటుపడ్డ జీవితం గబుక్కున మారదు విధి ఎదురైతే తప్ప. అప్పటికీ అది భరించలేక నిస్పృహచెంది ఆత్మహత్య చేసుకున్న వాళ్లనీ, పిచ్చెత్తినవాళ్ళనీ ఎరుగుదున్నేను. తొరగా నేనెంత కాలం వెలుగుతానో నాకే తెలీదు. వరసగా రెండు పిక్చర్సు ఫైలైనా-నేను విపరీతంగా లావెక్కిపోయినా నా వయస్సు ముదిరినా – వీటిలో ఏ ఒక్కటైనా నా విలువని తగ్గించేస్తుంది. దీపం ఉండగానే యిల్లు చక్కబెట్టుకోవాలి నేను."

"ఇలా సౌఖ్యాన్ని వాయిదా వేసుకుని యింకా తరువాత అనుభవించేదేమిటి?"

"మీకు పైన చెప్పినవి కొన్ని కారణాలే— అన్నింటికన్న ముఖ్యమైందింకోటుంది. ఇంత శ్రమకు అలవాటుపడ్డ నా శరీరం ఎడతెగని విశ్రాంతి భరించ లేదు. గట్టున పడవేసిన చాపలా అయిపోతుంది నా పని."

ఇన్ని గంటల ప్రవర్తనలో మొట్టమొదటిసారిగా ఆమెలో సీరియస్ నెస్ కనిపించింది.

అయినా మధు కెందుకో ఆ వాదన నచ్చలా–

"కాని నువ్వు పెళ్లి చేసుకోవాలి కల్యాణీ-నన్ను కాకపోతే మరొకర్ని."

"మీరింకా ఉంటారుగా. తరవాత మాట్లాడుకుందాం. అప్పుడే చీకటి పడింది కూడాను. లేవండి" అంటూ లేచి రేడియో ఆఫ్ చేసి నిలబడింది.

దశమి వెన్నెలలో ప్రకృతి మరింత సౌందర్యంగా వుంది. అక్కడక్కడ దూది పింజలలా మబ్బులు. మిణుకు మిణుకుమంటూ రంగులు మార్చుకునే తారలు.

తెలుపు, ఆకుపచ్చ, ఎరుపు రంగు లైట్లుమాత్రమే కనబడుతూ సముద్రపు హోరుకు శృతిగా శబ్దం చేస్తూ పోతోందో విమానం.

తిరుగు ప్రయాణంలో యిద్దరూ యించుమించు నిశ్శబ్దంగానే ఉన్నారు.

తరువాత రెండు రోజులలో మధు తలంపులో ఎన్నో మార్పులు వచ్చాయి.

ఆప్యాయత కనబడే యీ వాతావరణం తాను భరించలేకపోయాడు. పుస్తకాలమీద విసుగెత్తింది. ఎవరితో మాట్లాడదామన్నా ఎవరూ వుండరు. తనకి పనీ లేదు తీరుబడీ లేదు. అందరూ సన్నిహితంగా మెలిగినా తాను మాత్రం పరాయివాడిగానే ఫీలవుతున్నాడు.

తను అనుభవిస్తున్న సౌఖ్యాలన్నీ తాను స్వయంగా ఆర్జించుకున్నవి కాదు. ఎవరివల్లో తనకు ఆపాదింపబడ్డవి.

అంత ఖరీదైన కారులో ప్రయాణిస్తుంటే తనకి కలుగుతున్నది సౌఖ్యం కాదు - అనుగడుగునా అది తపతి కారనీ, కేవలం తనమీది మక్కువకొద్దీ వాడుకో మందనీనూ. ఒకవేళ అది తన స్వంతానికే వాడుకోమని ఆమె యిచ్చేసినా యీ భావమే వస్తుందేమో.

ఆ వాతావరణం మొహం మొత్తింది. తను ఆ పరిస్థితులకి ఫిట్ కాడు. ఇదొక అపరంజి పంజరంలాగుంది.

తన ఉద్యోగంలో తన కొద్ది సంపాదనలో 'తన' అని ముద్రవేసుకున్న భావం తనకెంతో అధికారాన్ని, దర్పాన్ని యిస్తుంది - అక్కడ తనకో యిండివిడ్యువాలిటీ వుంది -

తనెంత సహజంగా ఉండ ప్రయత్నించినా యిక్కడ పొసగటంలేదు.

ఇక్కడి తనకున్న రిలీఫ్ అల్లా ఒక్క కల్యాణీ- ఆమె చూపించే ప్రేమాను.

మూడోరోజు పొద్దున్నే ఎవరో తన్ని కుదిపేస్తుంటే మెలుకువ వచ్చింది.

"ఎప్పుడూ ఎనిమిది గంటలకేనా లేచేది? లేవండి-లేవండి-" ఎక్కడినించో దూరంగా ఆరంభమై దగ్గరగా వినబడుతున్నాయి మెలుకువ వచ్చేకొద్దీ.

"ఏమిటి కల్యాణీ?" మూలిగాడు బద్ధకంగా.

"అబ్బ లెమ్మంటుంటే-ఎక్కడో కుంభకర్ణుడు" నవ్వింది.

తప్పక లేచాడు మధు.

ఆరైనా కాలేదు - వీధులోకి సిద్ధంగా ముస్తాబై వుంది కల్యాణి. ప్రాతఃకాలపు వెలుగులో స్నిగ్ధదీప్తితో ప్రకాశిస్తున్న దామె ముఖం. ఇంకా రోజు ప్రారంభమే కావడంవల్ల పని చేసిన అలసట కనబడని ముఖం కొత్తగా తోచింది మధుకి.

"ఏమిటలా తినేసేలా చూస్తారు? భయంవేస్తోంది బాబూ!" చటుక్కున భీతహరిణేక్షణ అయిపోయింది.

ఏ భావాన్నైనా అంత సెకండ్లలో, అతి సహజంగా ఎల్లా నటించగలదో!

"ఎందుకు లేపేశావు కల్యాణీ?"

"షూటింగుకి వెళ్లాలి."

"వెళ్లు."

"కాదు మీరు కూడా రావాలి."

"నేనెందుకూ?"

"మీరివాళ వచ్చేతీరాలి."

"నేను రాను."

"రారూ!" విచిత్రంగా మారిపోయిందా ముఖం. అనునయం, చిరుకోపం, విసుగు, లాలన-ఆ భావాలని వర్ణించ తరంకాదు. కాని ఒక్క ముక్క చెప్పొచ్చు. ఆ మాట అంటున్నప్పుడామె ముఖం చూచి కాదనగలిగినవాడుంటే వాడు రాక్షసుడై వుండాలి.

"అల్లాగే" అన్నాడు మధు లొంగిపోయి.

"అదీ బుద్ధిమంతుల లక్షణం అంటే" మధురాతి మధురమైన నవ్వు ఒలకబోసింది.

అరగంట తరువాత స్టూడియో ఉద్యానంలోకి చొచ్చుకుపోయిన వారి కారు వాళ్లని ఫ్లోర్ దగ్గర దించేసి పార్కింగ్ లాట్ లోకి వెళ్లిపోయింది.

ఒక గున్నమామిడి కింద అయిదారు ఫోల్డింగ్ ఛైర్సు వున్నాయి. నలుగురు వ్యక్తులు కూర్చుని ఉన్నారు.

నల్లగా లావుగా తెల్లని గ్లాస్కోపంచ గూడ కట్టు తెల్లని షర్టు వేసుకున్నాయనొకడు, సెమీసూట్, స్టైలలో యింకొకడు, మేకప్‌తో కూర్చున్న అమ్మాయి, ముసలి మేకప్‌లో వున్న యువకుడు.

"రామ్మా కూర్చో-" ఆదరంగా తపతిని పిల్చి మధుకేసి అపరిచిత దృష్టితో చూసి "కూర్చోండి" అన్నాడు ఆ నల్లటి లావాటి వ్యక్తి తపతితో వచ్చిన మధుకి గౌరవంయిస్తూ.

"ఈయన మధు అని నాకు చాలా సన్నిహితులు, ఈయన ప్రొడ్యూసర్, వారు అసిస్టెంట్ డైరెక్టర్ రావు, యీమె శశి పిక్చర్లో నాకు రైవల్—వీరు శంకరంగారని నా తండ్రి పిక్చర్లో—" నవ్వుతూ

వరసగా ఆ లావాటాయన్నీ, సెమిసూటతన్నీ మేకప్‌లో ఉన్న యిద్దర్నీ పరిచయంచేసింది తపతి...

పరస్పర అభివాదాలు చెప్పుకున్నారు.

"అన్నీ పూర్తయినట్లేనా ?" తపతి ప్రొడ్యూసర్ని అడిగింది.

"ఎక్కడమ్మా—ఆ రైటరుగారు రాత్రి రెండింటికి మొదలుపెట్టాడు డైలాగుల రీరైటింగ్—ఇప్పటికి రాలేదు స్క్రిప్టు—ఏ క్షణానికైనా వచ్చేస్తుంది—ఏమని చెప్పను నా పాట్లు. రాత్రి పదింటిదాక సెట్టు వెయ్యడం అవనేలేదు. పెయింట్ యింకా ఆరుతూనే ఉంది.—ప్రొడక్షన్ అంత భండాలపుపని అదేగాని యింకోటిలేదు.—" ఉస్సురన్నాడాయన.

"ఏవో వస్తూనేఉంటాయి—పిక్చర్ బాక్సాఫీస్ అయితే పాపం కమ్మగా ఉంటుందేం ? అప్పుడివన్నీ జ్ఞాపకం ఉంటాయా ?" నవ్వుతూ అడిగింది తపతి.

"నీకు తెలీందేముందీ—కలక్షన్లలో మా చేతికొచ్చేది అయిపోవంతే—ఒక్కటి చెప్తాను వినమ్మా—ప్రొడ్యూసర్ బాగుపడ్డు ఎప్పుడూ.—ఏదో యిందులో యిరుక్కున్నాం గనక గబుక్కున ఎక్కడికీ పోలేక గానీ—"

"అబ్బ ! ఏం చెప్తారు కబుర్లు ?" శశి అంది.

"ఏం చెప్పినా అల్లాగే ఉంటుంది మీకు—" అన్నాడు ప్రొడ్యూసర్.

"ఇవాళ సీక్వెన్స్ ఏమిటి డైరెక్టరుగారూ." తపతి సెమిసూటతన్ని అడిగింది.

"మీరూ హీరోగారూ విలాసంగా విహరిస్తూ ఆయన పాడుతుంటే మీరు ఆడుతుంటారు. హీరోని వెతుక్కుంటూ వచ్చిన మీ రైవల్ చూసి కళ్ళుకుట్టి మీ తండ్రికి చెప్పి అతన్ని తీసుకువస్తుంది. మీ రిద్దరూ ఒకరి కౌగిలిలో ఒక రుండగా చూసిన అతను మండిపోయి, నిప్పులుచెరిగే కళ్ళతో 'గౌరీ' అని ఒక్క పొలికేక పెడతాడు. తిరువాత డైలాగులు—మిమ్మల్ని చెంపమీద ఒక్క టంటెంచి బరబర లాక్కుపోవడం—యిత్యాదులు—" నవ్వుతూ అని లేచి ఇటు అటు నాలుగడుగులు వేసి ఫ్లోర్‌లోకి తుర్రుమన్నాడు.

"నేను మేకప్ కానిచ్చివస్తాను-ఒక్కక్షణం—ఉంటారుగదూ." అని మధుతో అని తపతి గ్రీన్‌రూం వైపు వెళ్ళింది.

పావుగంటలో తయారై వచ్చిన తపతిని చూస్తే కొంచెం కంపరం కలిగింది మధుకి.

మోకాళ్ళకిందికి సగందాకానే వచ్చే పరికిణీ, బిగించికట్టిన పొట్టిరైక, వక్షానికి మధ్యనించి కుడిభుజం మీదుగా వీపుమీద క్రాస్‌గా తిరిగి ఎడంవైపు పరికిణీలోకి బిగించబడ్డ వలెవాటు—ముఖానికి ఎర్రనిరంగు, పెదవులకి లిప్‌స్టిక్, నుదుట బొట్టు, కనుబొమ్మల్ని పొడిగిస్తూ నల్లరంగు పెన్సిల్ గీతలు—

చాలా సహజంగా వచ్చి తన సీట్‌లో కూర్చుంది మధుపక్కన.

ఆమె నాదుస్తుల్లో యితన్ని చూడ్డం మధు వంటిమీద తేళ్ళు జెర్రిలు పాకించింది.

ఇక వాళ్ళ మాటలమీద దృష్టి ఉంచలేకపోయాడు.

ఇంతలో భావకవి దుస్తుల్లో, నుదుటిమీదకు ముంగురులు పడుతూండగా రంగులలో ప్రత్యక్షమైనాడు హీరో.

వస్తూనే తపతిదగ్గరకెళ్ళి—

"పిల్లా బల్‌బలేగున్నవే !" తెచ్చిపెట్టుకున్న యాసతో మాట్లాడుతూ నవ్వుతూ అన్నాడు.

"ఏం సెట్టుబయటే ఏక్ట్ చేద్దామనిపిస్తోందా ?"

"పిట్టకూతట్టిందే !—" మోచేత్తో తపతి వెన్నుమీద పొడిచాడు.

"ఏమిటా మోటుసరసం !" కిలకిలా నవ్వుతూ అంది తపతి.

ఆ హీరోతో తపతి ఎన్నో పిక్చర్లల్లో నటించింది. ఆ కారణంగానే సెట్టుమీదే కాకుండా వెలుపలకూడా ఎంతో చనువుగానూ, ఫ్రీగానే ఉంటారు.

కాని ఆ దృశ్యం మధు మనస్సుని యాసుతో నింపింది.

మధు హీరో పరస్పరం పరిచయం చెయ్యబడ్డారు.

హీరో సహజంగానే కలుపుగోలుతనం ప్రదర్శించినా మధుమాత్రం నటించలేక అవస్థపడ్డాడు.

ఒక ముప్పైఏళ్ళవ్యక్తి వచ్చి అందర్నీ పలకరించాడు. మధుకి ఆయన డైరెక్టర్‌గా పరిచయం చెయ్యబడ్డాడు.

"లోపలంతా రెడీగా ఉంది — స్క్రిప్టు వచ్చిందా ?" ప్రొడ్యూసర్ని అడిగాడు డైరెక్టర్.

"ఇంకా లేదు - గంటక్రితం ఫోన్‌చేస్తే ఆఖరి డైలాగు రాస్తున్నాడంటారు చంద్రంగారు.—ఇప్పటికి

ఊడిపడ్డు—టిన్నులకి టిన్నులు స్టేట్ ఎక్స్‌ప్రెస్ తగ లడ్డమేగాని కవిగారికి మూడ్ రాదు—మనకీ చావు—" విసుక్కున్నాడు ప్రొడ్యూసర్.

"పోనీమల్లీ—ఆ అదిగో చంద్రంగారు. వచ్చేస్తున్నాడు." డైరక్టర్ అన్నాడు దగ్గిరకొస్తున్న కారు చూసి.

కారులోంచి నిద్రచాలమిచేత ఎర్రబడిన కళ్ళు, చెదిరిన జుట్టుతో దిగిన ఒక యువకుడు డైరక్టర్ కి కాగితాలు అందించి - "ఇప్పటికి అయింది, యింటికేనా వెళ్ళకుండా వచ్చేశాను—రాత్రల్లా మేలుకుని సేవ చెయ్యలేక నా ప్రాణం చాలొచ్చింది." అన్నాడు చంద్రం అసిస్టెంట్ డైరెక్టర్ నంబర్ టూ.

"ఇంక పదండి అప్పుడే లొమ్మిదైపోతోంది—" అంటూ ఫ్లోర్ లోకి దారితీశాడు ప్రొడ్యూసర్.

వెలుగులోంచి లోపలికెళ్ళేటప్పటికి మొదట ఏమీ కనబడలేదు. తక్కువ వెలుతురికి కళ్లు కొస్త అలవాటు పడేటప్పటికి—ఒక బ్రహ్మాండమైన సెట్—

కాన్వాస్ మీద చిత్రించిన దూరపు కొండలు ఆకాశంలేక, అట్టలతోను మట్టితోను నిర్మించిన ఒక కొండ, దానిమీంచి జాలువారే సెలయేరు. సెలయేరు మీత చెక్కవంతెనా—చుట్టూ చెట్లుకింద పచ్చిక బయలు—

పైకి ఫ్లోర్ కప్పు—అడ్డంగా వేలాడగట్టబడి ఉన్న చెక్క నిచ్చెనలు వాటిమీద లైట్లు—టిల్ట్ చెయ్యడానికి మనుషులు—

ఒక పక్కకి దెయ్యమంతఉన్న స్టాండ్ కి మైక్ - దానినించి కేబిల్స్—దీపాలన్నిటికీ స్విచ్ బోర్డునుంచి కనెక్టింగ్ కేబుల్స్—ఇంకో మూలకి కామెరా, ట్రాలీ. ఇక్కడ యిద్దరు మనుష్యులు—రెండు ఎయిర్ సర్కులేటర్లు—

సెట్ యింత గందరగోళంగా ఉంటుందని మొదటి సారిగా తెలిసింది మధుకి.

డైరెక్టర్ గారు మొదలు పెట్టారు "తపతిగారు, మీరు అటు కొండమాటునించి సెలయేటి దారమ్మటే చురుగ్గా గెంతుకుంటూ బ్రిడ్జిమీద కొస్తారు—'గౌరీ' అని పిలుపు వినబడుతుంది—నలుదిక్కులా పరికిస్తారు- అక్కడ హీరోగారు కనబడతారు—చిరునవ్వు చిరు సిగ్గు వస్తుంది మీ ముఖంమీదికి—అగుదామా మాన దామా అని సందేహిస్తుంటారు—తిరువాత వెళ్లడానికే నిశ్చయించి కదిలి పోబోతారు—పాట ప్రారంభ మౌతుంది—నిలిచిపోతారు—మెల్లిగా కదులుతూ శేఖరంగారికేసి నడుస్తారు స్వప్నంలోలాగ—వెళ్ళి ఆయన గుండెలమీదఆని తల పైకెత్తి ఆయన కళ్లల్లోకి రిప్రోచ్ ఫుల్ గా చూసి కుడిచేతి వేళ్లు ఆయన పెద వులకు తాటించి పాట ఆపేస్తారు—ఇక శేఖరం గారు—"

"పాట రాసుకుందుకువచ్చిన నేను దూరాన గౌరిని చూసి ఆమె బ్రిడ్జిమీదికి రాగానే మృదువుగా 'గౌరీ' అని పిలుస్తాను, ఆహ్వానించే కళ్లతో—చిరు నవ్వుతో—పులకించిన దేహంతో—ఆమె రాగు— పాట ఎత్తుకుంటాను-ఆమె వచ్చినా నోరు మూస్తుంది- అంతేగా" నవ్వాడు హీరో—

"అయితే ఏది—ఒక్క రిహార్సల్—రాజా సాబ్ లైటింగ్—" కెమెరా డైరక్టర్ ని ఉద్దేశించి అన్నాడు.

ఆయన బుల్లెట్ షాట్స్ లాగ "వన్ఆన్—సిక్స్ ఆన్—టెన్ ఆన్—"డైరెక్షన్ యిచ్చాడు.

టకటక వెలిగిపోయాయి లైట్లు—

సెట్టంతా వెలుతురుతో పట్టపగలై పోయింది.

తపతి సెట్టు మూలకెళ్ళి—కొండపక్కనించి ఏటివారే గెంతుకుంటూ వచ్చి బ్రిడ్జ్ ఎక్కి మధ్యకి వచ్చేసరికి 'గౌరీ' అని పిలుస్తాడు హీరో—

తపతి ఆగిపోయి కళ్ళు మిలమిలలాడించి చుట్టూ గబగబ కలయజూసి, హీరో కనబడగానే క్షణాలమీద చిరునవ్వు, ముఖంమీద చిరుసిగ్గు తెచ్చుకుని రెండు క్షణాలు తటపటాయించి అడుగు ముందుకేస్తుంది.

"లలిత లలిత సరసీరుహ సన్నిభ అంజనశోభిత ధవళాక్షీ!" మోహనరాగంలో ఎత్తుకుంటాడు హీరో.

నిలిచిపోతుంది తపతి. తరువాత మెల్లి మెల్లిగా అడుగులు వేస్తూ హీరోవేపు సాగిపోతుంది. పాట కంటిన్యూ అవుతూంటుంది—

"వినీలకుంతల విరాజమాలీ - బింబాధరీ చంద్ర బింబాననా—నవలావణ్య సుమనోజ్ఞసౌందర్య గాత్రీ-"

ఆవేళకు అతని గుండెల కానుకుని తల ఎత్తి అతని కళ్ళల్లోకి రిప్రోచ్ ఫుల్ గా చూస్తూ చేతివేళ్ళతో అతని పెదవులు మృదువుగా తాకి పాట ఆపేస్తుంది—

సంతోషంలో వెలిగే కళ్లతో ఆమెను చూస్తూ తన చేతితో ఆమెను చుట్టివేస్తాడు హీరో.

"Excellent let us start" అన్నాడు డైరెక్టర్.

తపతి కొండమాటు కెళ్ళింది.

"రాజాసాబ్—"

"ఓకే బైమీ" జవాబు వచ్చింది.

"పాన్స్ ఆఫ్ - సైలెన్స్ - క్లాప్—"

క్లాప్ కొట్టి తప్పుకున్నాడు బోయ్—తపతివస్తూ బ్రిడ్జిమీద గొప్పుతగిలి చతికిలబడింది—

"కట్ - కట్ -" అరిచాడు డైరెక్టర్—

ప్రొడ్యూసర్, డైరెక్టర్ - తపతి దగ్గర కెళ్లారు కంగారుగా—

"అబ్బే—ఏం లేదు—జస్ట్ కాలుజారింది" అంది తపతి లేస్తూ.

"దెబ్బేం తగల్లేదుగదా — రెస్టు తీసుకుంటా రామ్మా—" ఆదుర్దా వ్యక్తపరిచాడు ప్రొడ్యూసర్.

"అబ్బే అక్కర్లేదు—"

మళ్లా మొదటికొచ్చింది షాట్—

ఆవాళ షూటింగ్ ముగిసేటప్పటికి రాత్రి పది కొండు అయింది.

హీరో హీరోయిన్ల రొమాన్సు చూసిన మధు మనస్సు యీర్ష్యతోను, జుగుప్సతోను నిండిపోయింది. ఉండలేకా, వచ్చెయ్యలేకా యిరుకున పడిపోయాడు.

"ఎల్లా ఉంది షూటింగ్—నా యాక్షనో?" అడిగింది తపతి దార్లో కార్లో—

"అమోఘంగా ఉన్నాయి—" ఇంకేం అనలేక అన్నాడు మధు.

ఇంటికొచ్చింతరువాత దగ్గర కూర్చుని మధుచేత అన్నం తినిపిస్తూ ఇవాళ్ళెల్లా మిమ్మల్ని నానాఅవస్థా పెట్టాను—బోరెత్తి పోయినట్టున్నారు—అలవాటుపడ్డ నేనే బోరెత్తిపోతుంటాను. పిక్చర్లో మూడు నిమిషాలు నిలిచే ఘట్టానికి యిక్కడ ఒక డబుల్ కాల్ షీట్ చాలదు— ఇవాళింకా నయం—ఒక్కో రోజు తీసింది ఎడిటింగ్‌లో కత్తెరైపోవడమో—నాలుగు రీటేక్స్ కావడమో జరుగుతుంది"—

చతుర్దశి చంద్రుడి వెన్నెట్లో బాల్కనీమీద కూర్చున్నా రిద్దరూ—

ప్రకృతి చల్లగా హాయిగా ఉంది—

మౌనంగా గడుస్తున్నాయి క్షణాలు—

"ఏమండీ—"మృదువుగా పిల్చింది తపతి—

"ఊఁ" మూలిగాడు మధు.

"అల్లా ఉన్నారేం?"

"ఎల్లా ఉన్నాను?"

"బాధపడుతున్నట్టు—"

"లేదే—"

"నా కళ్లలోకి చూసి నిజం చెప్పండి."

తపతి కళ్ళలోకి చూశాడు మధు—బాధ కూడు కట్టుకుని ఉందతని ముఖంలో—

"ఇవాల్టి సంఘటనలే మిమ్మల్నింత కలత పెట్టాయే—ఇంక నన్ను పెళ్ళిచేసుకుని మీరేం సుఖపడతారు?—ఇక నామాట—కృత్రిమాలకి అలవాటు పడ్డ నా మనస్సు రిలీఫ్ కోరుతుందేగాని యీ వాతావరణాన్ని పూర్తిగా విడిచిపెట్టనియ్యదు—నేను పెళ్ళి చేసుకుని నేనూ సుఖించలేను—చేసుకున్నవారిని సుఖపెట్టలేను—అందుకే మీరంత ప్రేమతో నన్ను స్వీకరిస్తానన్నా అవునన లేకపోయాను—" మృదువుగా లాలించే కంఠంతో అంది—

"నిజమే కల్యాణీ నువ్వన్నది—"అని ఆగి "కాని నే నిక్కడ ఉండలేను" అన్నాడు మధు.

"అది నాకూ తెలుసు—అందుకే మిమ్మల్ని వత్తిడిపెట్టలేను—కాని తీరిక చిక్కినప్పుడల్లా కనబడుతుంటారా?—" మొదటిసారిగా ఆమె కళ్ళల్లో నీళ్లు నిల్చాయి—

మధు కరిగిపోయాడు—

ఆమెను కౌగిలిలోకి తీసుకుని కన్నీళ్లు తుడిచి—

"ఛా! ఎందు కేడుస్తావు కల్యాణీ—తప్పకుండా తీరికైనప్పుడల్లా వస్తానని మాటిస్తున్నాను—"

మధు గుండెలకు తల ఆన్చి నిశ్శబ్దంగా ఏడ్చింది తపతి అనే కల్యాణి.

# కాశీఖండ పాఠ పరిశీలనం

శ్రీ వి. రామకృష్ణారావు

కాశీఖండం శ్రీ ఉత్పల వేంకటనరసింహాచార్యుల వారిచే 'నల పుష్యకృష్ణదశమిన్' పరిష్కరింపబడి వావిళ్ళ వారిచే ప్రకటింపబడింది. నలసంవత్సర మంటే 1916. ఆ తరువాత 1924 లో పునర్ముద్రిత మైంది. నూతన ముద్రణం 1953 లో జరిగింది. పూర్వ ముద్రణలోని సాధుపాఠాలు చాలా చోట్ల నూతన ముద్రణలో సంస్కరింపబడ్డాయి. వాటిస్థానాలలో అపపాఠాలు చేరాయి. నూతన ముద్రణంకంటె పూర్వ ముద్రణాలే శుద్ధిలో మెల్ల అన్నట్లున్నాయి. మొత్తం మీద గ్రంథమంతా పునఃపరిష్కరణనే అపేక్షిస్తున్నది. ఇటీవల భీమఖండాన్ని పరిష్కరింపించి ప్రకటించిన ముద్రాపకులు కాశీఖండాన్ని కూడా సంస్కరింపించి ముద్రించాలని కుతూహలపడుతున్నట్లు తెలుస్తుంది. కాబట్టి భావిపరిశోధకుల కుపకరిస్తాయన్న ఉద్దేశంతో కొన్ని పాఠలోపాలని ప్రకటిస్తున్నాను.

## మరుద్రాట్చరిత్ర

'రచియించితిని మరుద్రాట్చరిత్ర' అని నూ. ము. (నూతన ముద్రణ—1953) లో ఉన్నది (1-7) (పూ. ము) 'రచియించితి మరుత్తరాట్చరిత్ర' అని యున్నది. 'మరుత్' శబ్దానికి రాజవిశేషమనే అర్థం లేదు. అసలిది 'మరుత్త' శబ్దం. 'మరుత్త-పు. చంద్ర వంశేనృపభేదే' అని వాచస్పత్యం. "మరుత్తః-పుం. మరుదస్త్య స్యేతి మరుత్ +'తప్‌పర్వమరుద్భ్యామ్' ఇత్యత్ర కాశికోక్త్యా. తప్. చంద్రవంశీయ రాజవిశేషః" ఇత్యాదిగా శబ్దకల్పద్రుమకోశంలో ఉన్నది. మరుత్తుని చరిత్ర మహాభారతం అశ్వమేధపర్వంలో వర్ణిత మైనది. 'అమ్మరుత్తుండును' (సభా 1-120) అని నన్నయ కూడా ప్రయోగించాడు. 'మరుత్' అసలు శబ్దమైతే 'మరుత్తుఁడు' అనే రూపం సిద్ధించదు. 'మరుత్' కవి ప్రయుక్త మనుకొని అది 'మరుత్త' కాదు కాబట్టి తప్పని ఊహించి 'మరుత్తరాట్' అనేదాన్ని 'మరుద్రాట్' గా మార్చారన్నది సారాంశం. ఈ మార్పు కేవలం ప్రామాదికం.

## ధా రా ధ వ

పూ. ము. లలోను, భీమఖండంలోను 'ధారాధర ధారాధర ధారాధర వాహదాన ధారానిధికిన్' (1 47. భీమ 1-35) అని ముద్రితం. నూ. ము. లో 'ధారాధర ధారాధవ ధారాధరవాహ' అని ఉన్నది. ధారాధర= మేఘము, ధారాధరవాహ=జీమూతవాహనుడు అని సరిపడుతుంది. రెండవ 'ధారాధర' శబ్దానికి అర్థం విచార్యం. ఇందు చేతనే 'ధారాధర' అనే నూ. ము. పరిష్కరణలో ధారానగరాధిపతి కాబోలు ఉద్దిష్టుడయాడు. 'ధారా-స్త్రీ-ప్రవాహః' అనే వాచస్పత్యం చొప్పున 'ధారాధర సముద్రుడు' కావచ్చును. 'సరస్వతీధరుఁడు: బ్రహ్మ' అని భట్టుమూర్తి ప్రయోగించాడు. (వ.న. 2-11) కాన 'నదీధరుఁడు' సముద్రుడు కావచ్చునని తోచుతున్నది. పద్యధోరణి'నిబట్టి మూడు చోట్ల 'ధారాధర' శబ్దమే కవి ప్రయుక్తమని కరతలామలకం. సముద్రుడు దాతలలో ఒకడనవచ్చును. 'కలగుండు వెట్టెరి కలశవార్ధి' అని శృంగార నైషధం. (శృ. నై 7-81) లేదా 'ధారావరధారావరధారావర వాహ అన నగును. "ధారావర. పుం. ధారయాజలధారయా అవృణోత్యాకాశమ్. వృ-అచ్-తమేఘే..." అని శబ్దకల్పద్రుమం. ధారావర = మేఘుడు, ధారావర. సముద్రుడు లేక ధారానగరాధిపతి, ధారావరవాహ జీమూతవాహుడు అని అర్థం లభిస్తుంది. పండితులు పర్యాలోచింతురుగాక. 'ధారావర' నూ. ని లో లేదు.

## ప్రా చే త స

'మహినిఁ బ్రాచేతసమహిమ దాల్చుటయకా' అనే నూ. ము. సరికాదు. ఈ పద్యంలో దిక్పాలకులు పేర్కొబడ్డారు. కాన 'మహిఁ బ్రచేతో రీతిమహిమఁ దాల్చుటఁగాక' అనే పూ. ము. ఒప్పు. నూ. ము. గ్రహిస్తే పద్యంలో సమతానియమంకూడా చెడుతుందని చెప్పవచ్చు. కాన యేవిధముగానూ, నూ.ము. గ్రాహ్యం కాదు.

**భుజయుగయుగళీ :**

'సంభరణ ప్రౌఢ నిజభుజయుగయుగళీ' (1-63) అనే నూతన ముద్రణంలో గణభంగం వచ్చింది. పోనీ 'భుజాయుగయుగళీ' అందామా అంటే యుగశబ్దముండగా 'యుగళీ' కూడా చేర్చడం పునరుక్తి అవుతుంది. కాబట్టి 'సంభరణ ప్రౌఢ నిజభుజార్గళయుగళీ' అనే పూర్వముద్రిత పాఠమే సరియైనది. అఖండయతి శ్రీనాథ సమ్మతం.

**వ్యాటీకోర్మి :**

నూతన ముద్రణలో 'వ్యాటీకోర్మిసంఘో, ద్ఘాట' అని ముద్రింపబడింది. 'ఊర్మి' అనే 'ఈ' కారాంత శబ్దంలేదు. "ఊర్మిః-స్త్రీ. పుం. ఋచ్ఛతీతి. ఋగతౌ. అర్తేరూచ్చ. ఇతి ఉణాది సూత్రేణ మిః" అని శబ్దకల్పద్రుమకోశం. కాబట్టి 'వ్యాటికితోర్మిసంఘో,ద్ఘాట' అనే పూర్వపాఠమే గ్రహించవలసి ఉంటుంది.

**ఆమూలచండంబు :**

'కమియనామూలచండంబుగా ఫలించి' అని నూ. ము. లోను 'ఆమూల చూతంబుగా' అని పూ. ము.ల లోను ఉన్నది. 'ఆమూల చూడంబుగా' సరి. పూ. ము. లలో 'చూడంబు' అనడానికి 'చూతంబు' అని అచ్చు తప్పుపడి వుంటుంది. ఈ విషయం గ్రహించక 'చండంబుగా' నూ. ము.లో మార్చి ఉంటారు.

**స్థాపక :**

'సంక్షిప్తక, స్ఫూరీ స్థాపక ముద్రిత స్థగితవక్షోవీథి కౌత్యంతరా' (1-141) అని నూ. ము.లో ఉన్నది. పూ. ము.లలో 'సంక్లిప్తక,స్ఫూరీ స్థాసక' అని ఉన్నది. 'స్థాసక' పాఠమే ఒప్పు. 'స్థాసకౌఖ్యాతు చార్చిక్యే' అని విశ్వకోశం. పూ. ము.లలోని 'సంక్లిప్త' అనే తప్పు 'సంక్షిప్త'గా నూ. ము.లో మారడం ముదావహం.

**హృదయ పుష్కరములందు**

నూ. ము. లో 'కాంతు రెవ్వాని హృదయ పుష్కరములందు' (2-4) అనిన్నీ పూ. ము. లలో 'కాంతు రెవ్వాని దహర పుష్కరమునందు' అనిన్నీ ముద్రితం. ఈ కాంచేవారు 'పరమ యోగీంద్రులు' కాబట్టి దహరపుష్కరమే సందర్భోచితం. 'దహరాకాశః. పుం. చిదాకాశే' అని వాచస్పత్యం. ఈ దహరాకాశాన్నే శ్రీనాథుఁడు దహరపుష్కరమని ఉంటాడు. 'పుష్కరం పంకజే వ్యోమ్ని' విశ్వః. 'దహర పుష్కరమునందు' అనేది జాత్యేక వచనంగా గ్రహించవచ్చు.

**నీదు నౌదార్యంబు**

పూ. ము. లలో 'నీ ప్రభావంబును, యౌదార్యమును నెందు లేదు గాన' అని ముద్రింపబడింది. (2-69) నూ. ములో 'నీ ప్రభావంబును, నీదు నౌదార్యంబు లేదు గాన' అని కనబడుతుంది. 'నీదు + ఔదార్యము' అనే చో నుగాగమం రావడానికి బలమైన ప్రయోగం లేదు. 'నీదు + అయ' నీదయ (రాఘ 1-44.) అని పింగళిసూరన శ్లేష ఘటిత ప్రయోగం లభిస్తుంది. నుగాగమం రావడం అనిష్టరూపానికి దారితీస్తుందని ప్రామాణికుల ఆశయం. కాబట్టి పూ. ము.ల ననుసరించి 'నీ ప్రభావంబును, నౌ (యౌ ?) దార్యమును నెందు లేదు గాన' అని గ్రహించడమే ఉచితతరం.

**కళ్యల**

'కళ్యలఁ దగిన స్రుక్కములు' (3-11) అనే నూ. ము. పాఠం సరికాదు. 'కళ్యాలఁదగిన' అనేదే సరి. చూ. ప్రౌఢవ్యాకరణము. శబ్ద 49 సూత్రంవద్ద ప్రయోగాలు.

**పంపాసరుల్**

'పంపాసరుల్ దండకో, గహన గ్రాహులు వాయువుల్' (3-14.) అనే నూ. ము. పాఠం పొరపాటు. 'పంపాసఖుల్' అనే పూర్వపాఠమే సముచితం. ఈ విషయం ఒకరు చెప్పక్కర్లేకుండానే తెలియవలసినది.

**అంబోధినిబిడాంకురంబులు :**

నూ. ము. లో, చంద్రికలు 'నీరదాధ్వాంబోధి నిబిడాంకురంబులు'గా చెప్పబడినట్లు కనబడుతుంది. (4-169) దీని కర్థసారస్యంలేదు. నీరదాధ్వాంభోజినీ బిసాంకురములు' అనే పూ. ము. పాఠమే ఉచితం.

**వర్షధారలు :**

వర్షధారలచేత నుతియకుండ' అనే నూ. ము. పాఠంవల్ల యతిభ్రంశం యేర్పడుతుంది. కాబట్టి 'ఉదకధారలచేత' అనే పూ. ము. స్వీకరింపదగింది. (7-40)

**కొదువ :**

నూ. ము. లో 'అతఁడు రాకున్నఁ గొదువలేదంశమైన' (7-70) అనిన్నీ 'అతఁడు రాకున్నఁ గొదలేశ

మైనలేదు' అని పూ. ము. లలో నున్న ముద్రింపబడ్డది. 'కొదువ' అపశబ్దం 'కొదవ' సుశబ్దం. కాన పూ. ము గ్రహించడమో లేదా, అతఁడు రాసున్న గొదవ లేదం శమైన' అని సవరించుకోవడమో కర్తవ్యం.

## గగ్గులకాండ్రు :

పూ. ము. లలో 'గగ్గులకాడై వికావిక లయి యమర్త్యల్' (7-88) అని సరిగ్గా ఉండగా, నూ. ములో (గగ్గులకాండ్రై) అని ఉన్నది. 'గగ్గులకాండ్రు' ఎవరో వ్యక్తులయి ఉంటారని యీ నూ. ము. ఆశయం కాబోలు. ఇలా అపరిశీలితముగా దిద్దడంకంటె నిఘంటువులనైనా పర్యాలోచించరాదా?

## పరివారక్షేత్ర :

'వలయుఁబరివార క్షేత్ర దేవతలఁగొలువ'(7-116) అనే నూ. ములో గణభంగం కలిగింది. 'వలయుఁబరిపాటి క్షేత్రదేవతలఁ గొలువ' అనే నూ. ము. లే గ్రాహ్యములు.

పూర్వోత్తర ముద్రణలు రెండింటా ఉన్న అపపాఠాలు కొన్ని ఉదాహరిస్తాను.

## క్షీరాంభోధి

'క్షీరాంభోధి తటంబునన్ నిలిపె దిక్సీమా జయ స్తంభముల్' (1-52) అని ముద్రితం. క్షీరాంభోధి కాదు కీరాంభోధి కవిపాఠం. చిలుక సముద్రమనే పెద్ద ఉప్పునీటి తటాకం గంజాం జిల్లాలోని 'రంభ' అనే గ్రామాని కెదురుగా ఉన్నదని శ్రీ కుందూరి యీశ్వరదత్తుగారు రెడ్డి సంచికలో వివరించారు. ఆ చిల్క సముద్రమే 'కీరాంభోధి' అని శ్రీనాథుడు వ్రాసినాడు. కాశీఖండం పీఠికలోనే 'చీకటియున్ గళింగమును జిల్క సముద్రము సింహశైలమున్'(1-60) అని చిల్కసముద్రాన్ని శ్రీనాథుడు పేర్కొని వున్నాడు. కీరాంభోధి తత్వం తెలియని పరిష్కర్తలు క్షీరాంభోధిగా మార్చారన్నది సారాంశం.

## మఱువంగ

'మఱువంగ వచ్చునే' (2-112) అనిన్నీ 'మఱువుఁడొండు తలంపు' (5-96.) అనిన్నీ రెండు చోట్ల 'మఱచు' శబ్దంగానే భావించి ముద్రించారు. 'మఱచు' సాధువు. ఇలా యిది అకారమధ్యం కాబట్టే 'మఱవకుము - మఱాకుము' అని తిక్కనాదులు ప్రయోగించడం తటస్థించింది. 'అనుపమసత్య విస్ఫురణ నాడినమాట మఱాకుమన్న' (ఉద్యో4-70.) ఎఱ్ఱన హరివంశంలోను (హరి ఉ. భా 9-255) పాల్కురికి సోమన గొడగూచి కథలోను 'మఱాకుము' అనే రూపాన్ని వాడారు. ఇంతెందుకు? శ్రీనాథుడే హరవిలాసంలో 'మఱవకు = మఱాము' అని ప్రయోగించాడు. (హర 2-13) తిక్కనాదుల ప్రయోగాలున్నట్లు గుర్తించని పీఠికాకర్తలు 'మఱాము' విశేష ప్రయోగాలలో చేర్చారు. 'మఱాకుము,' 'మఱాము' అనే ప్రయోగాలు 'మఱచు' అనే రూపాన్ని నిర్వహిస్తున్నాయి, 'మఱుచు' నిర్మూలం. కాబట్టి 'మఱవంగ' 'మఱవుఁడు' అనేవే కవిపాఠాలని గ్రహించాలి.

## తుల్యభాగ

నూ. ము. లో 'ధరణీధరము పొంతఁదల్యభాగ' (3-28) అని ఉన్నది. పూ. ము. లలో 'ధరణీధరము పొంతఁ దల్లిబాబి'అని కలదు. 'తల్యభాగ' తప్పు. ఇది 'తుల్యభాగ' అని వుండాలి, 'తోయగర్భాభోగ తుల్యభాగ' (భీమ 3.20.) మొదలైన యతిస్థాన గతప్రయోగాలున్నాయి. (భీమ 4-186, 3-33, 39.) ఈ తుల్యభాగయొక్క ఉత్పత్తిక్రమం భీమఖండంలో వర్ణింపబడిఉన్నది. తుల్యభాగుడనే అన్వర్థనామధేయుడైన రాక్షసుని పేర ఆనదికి తుల్యభాగ అనేపేరు వచ్చింది. శ్రీనాథు డుద్దేశించింది యీతుల్యభాగాఖ్యనదినే.'ధరణీధరము పొంతఁ తుల్యభాగ' అంటే యతి తప్పుతుంది కాబట్టి 'తల్యభాగ' అని నూ. ము. లోను, పూ. ము. లలో 'తల్లి బాబి'గాను ముద్రితమైనది 'తల్లి బావి' నిర్మూలం. శ్రీనాథుడు తుల్యభాగనే చెప్పాడనడానికి ఒక నిదర్శనంకూడా కనబడుతుంది. "అంతః ప్రవాహయై (మై) యావిర్భవించె నే ధరణీధరము పొంతఁదల్యభాగ" అని యీ నది అంతఃప్రవాహగా చెప్పబడ్డది. తుల్యభాగుని హితోపదేశం విని రాక్షసులు తుల్యభాగను 'సప్తముని సింధువునకు నంతః ప్రవాహంబునుగాఁ బ్రసాదించిరి.' (భీమ 4-190) అని భీమఖండంలో కంఠోక్తంగా యీ స్రవంతి అంతఃప్రవాహయని చెప్పబడింది. కాన 'తుల్యభాగ' శ్రీనాథుడుద్దేశించాడనడం స్పష్టం. 'ధరణీధరము పొంతఁ దౌల్యభాగ' శ్రీనాథుని పాఠం అయిఉంటుంది. అది లేఖక ప్రమాదంవల్ల 'తుల్యభాగ'గామారి పరిష్కర్తల ప్రమాదంవల్ల తల్యభాగ, తల్లి బావి అనే అపరూపాలు పొందింది. 'తౌల్యభాగ'

అని గ్రహిస్తే యతిభంగం నివారింపబడి కవి అభిమతం నెరవేరుతుంది.

## పూష :

'పూష మకరస్థుఁడైన యప్పుడు ప్రయాగ' (3.92) అనే పాఠంతో ముద్రితమైనది. ఈ పాఠాన్ని నమ్ముకొని సూర్యరాయ నిఘంటు కర్తలు 'పూష' శబ్దాన్ని అంగీకరించారు. ఇది యెలా సిద్ధిస్తుందనుకొన్నారో దురూహ్యం. ఇది వింత కాదు గాని శ్రీ వజ్ఝలవారివంటివారు బాలవ్యాకరణంలోని తత్సమ 77 వ సూత్రాన్ని యీ అపపాఠాన్ని అనుసరించి దిద్ది వేయడం ఆశ్చర్యకరం. 'ఆత్మాదులకు స్త్రీత్వంబు వైభాషికంబు'(బాలవ్యాకరణోద్ద్యోతము. తత్సమ 78) అని సూత్రించి అధోజ్ఞాపికలో విశ్వకర్మ, పూష ఆత్మగుల్లోనివే అన్నారు. ఈ అత్మాదుల్లో నకారాంతాలు మాత్రమే చేర్చడం ఉచితం. అకారాంత పుంలింగాలకు స్త్రీత్వం ఈ 'పూష' అనే అప పాఠ స్థలంలో తప్పితే మరెక్కడా లేదు. విస్తరమెందుకు? 'పూషు' సాధు పాఠం. 'పూష' శబ్దం వృద్ధాదుల్లోనిది. బాల. తత్సమ 56. బాల. ఉద్ద్యో 57.) వృద్ధు, మూర్ఖు, నీచు, ధూర్తు మొదలైన శబ్దాలవంటిదే 'పూషు.' పాఠ దోషాలవల్ల యెంతటి అనర్థాలు వస్తాయో చెప్పడానికి యీ 'పూష' శబ్దమొక నిదర్శనం.

## మంజిష్టి :

"ఏడఁ బోయెనో కదా మేడలో మంజిష్టి"(4-108) అని యున్నది. 'మంజిష్టి' యే కోశంలోనూ లేదు. 'మంజిష్ఠ' కావచ్చు. ఇది యొక యోషధీ విశేషం. దీని నింకా పర్యాలోచింపవలసియే ఉన్నది.

## దీప్తావనంగ :

ముద్రణాలలో 'కాశ్యదీప్తావనంగ' (5-10) అని కనబడుతుంది. 'దీప్తా + అనంగ' అని ఉంటే సంస్కృత సంధి యెలా వస్తుంది? 'దీప్తా యనంగ' కవిపాఠం.

## నాకుఁగాశీధర :

పూ. ము. లో యిలా ఉన్నది. "నాకుఁగా, శీధర నాదు కట్టెదుర' అని. సూ. ము. లో 'నాకుఁగా, శీధర నాదు కట్టెదుర నీదశనుండఁగ' అని యున్నది. రెండూ అనన్వితాలే. రెండు పాఠాల్లోను యతి భంగం ఏర్పడుతుంది చూడండి. "వి, ద్యాధర చక్రవర్తినను నర్మిలిఁ దెచ్చినవాఁడు నాకుఁగా, శీధర నాదు కట్టెదుర నీదశనుండఁగ విశ్వనాథ 'కా, శీధర' యంబికారమణ జీవిత మేను ధరించుదాననే" (5.165) ఇందులో 'తెచ్చిన వాఁడు' అన్నది సమాపక క్రియ కాదు. విధేయ విశేషణం. "నాకుఁగా, నీధర నాదు కట్టెదుర నీదశనుండఁగ.. జీవిత మేను ధరించుదాననే' అని ఉండాలి. 'ననునర్మిలిఁ దెచ్చినవాఁడైన' 'విద్యాధర చక్రవర్తి' నాకుఁగాఁ' ఈధర, నాదుకట్టెదురన దశనుండఁగ జీవిత మేను ధరించు దాననే" అని తాత్పర్యం. "నాకు గాన్" అన్నది 'తనకుఁగాఁ' వంటిది. 'అవ్విధంబునఁ దన ప్రోలన సమశేరుఁడు తనకుఁగా నీశ్వరుని చేత దగ్ధమైన' (హర 4-3) అనే ప్రయోగంలోని 'తనకుఁగాఁ' వలె యిచ్చటి 'నాకుఁగాఁ' అన్నదిన్నీ అర్థవంతం అవుతుంది. యతిభ్రంశమున్నూ తొలగుతుంది. 'నాకుఁగా, నీధర నాదు కట్టెదుర నీదశనుండఁగ' కవి ప్రయుక్తపాఠం కావడం విస్పష్టం.

## పైన :

'చచ్చెఁజింతా జ్వరముపైన జ్వరము దాఁకి' (5.329) అని ముద్రితం. 'పైన' అనే అసాధురూపం ఆధునిక కావ్య సామాన్యదోషంగా పరిణమించింది. కొందరాధునికులు 'పైనకు' వంటి వింతరూపాలు, వ్యావహారికములు సలక్షణములు కాని కృతకరూపాలు, వాడుతున్నారు. 'పైని' సాధురూపం. 'పైన్ + అ' అనే ప్రక్రియ చొప్పున 'పైన' సాధింపవచ్చు. కాని యిది అవధారణార్థకం అవుతుంది. ఈ శ్రీనాథ ప్రయోగంలో అవధారణానికి ప్రసక్తి కనబడదు. కాన 'పైని' అనే గ్రహింపవలసి ఉంటుంది. 'పైన' అనే అవధారణార్థకరూపం భారతంలో ఉన్నట్లు చెప్పవచ్చును. (ఉద్యో 2-8) ఈ కాశీఖండ ప్రయోగంలోని 'పైన' సంస్కారణలోపకృతం. 'చింతాజ్వరము పైని' అని సంస్కరించుకోవాలి.

## జట్టు :

'జట్టు పఠియింపబోధించు సద్గురుండు' అని ముద్రించి 'సరసఁ బఠియింప' అనే మరీ ప్రాచీన ముద్రిత పాఠాన్ని నిరసిస్తూ వ్రాశారు. 'జట్టు=జన సమూహము' అనే శ.ర. వ్రాతకిది ఆధారం అవుతుందని తలంచారు. ఇది 'జట్టు' కాదు, 'చట్టు'అంటే శిష్యుఁడని అర్థం. 'చట్టులు దప్పిమైనవురుసారయి పాత్రలుఁ దారుగాశికా, ఘట్టమునందు' (7-181) అని కాశీఖండం

లోనే ఉన్నది. ఇట నూ.ము.లో 'చట్టులు' అనడానికి 'చట్టలు' అని తప్పు ముద్రింపబడింది. పూ. ము. లలో సరిగ్గానే ఉండవచ్చు. కాశీఖండంలోనే 'చట్టు' మరొకచోట ప్రయుక్తమైనది. 'కైటభదైత్యవైరి...తన చట్టు ఖగేంద్రునిఁ బంచె...'' (6-141) అని. ఇక్కడ కూడా 'చట్టు-శిష్యుఁడు' అనే అర్థం సరిపడుతున్నది. 'జలజనాభుండు' 'గరుత్మంతునకు వినయకీర్తియను పేరు పెట్టి యతని శిష్యుంగాఁ బరిగ్రహించి'నట్లు కథావిధానముండుటచేత చట్టు ఖగేంద్రుడని వ్రాయబడ్డది. (కాశీ 6-73) కాగా 'జట్టు' తప్పని, 'చట్టు' కవిపాఠమని యేర్పడుతున్నది. 'అత్యాదరమునఁ జటు పఠియింప' అనేచోట తాళపత్రమాతృకాదులలో అరసున్న లోపించడంవల్ల 'జట్టు' కవిపాఠమని పరిష్కర్తగారు భ్రమించారు. ప్రయోగాంతరములు, ప్రకరణము 'చట్టు' కవిపాఠమని నిరూపిస్తున్నాయి.

ఎఱుఁగదా :

'ప్ర, త్యయ మేతద్విషయంబునం దెఱుఁగదా యొల్లప్డు మధ్యాహ్న మఱియ' (6-128) అనేచోట యతిభంగభూషిత పాఠం ప్రధానముగా ముద్రించి 'ఎఱుఁగ రాదా' అన్నది పాఠాంతరముగా చూపారు. 'ఎఱుఁగరాదా యొప్డు మధ్యాహ్న' కవిప్రయుక్త పాఠముగా ముద్రించవలసి ఉంటుంది.

సిద్ధిత్వంబు :

"తద్ధ్యానాస్పద...కార్యార్థ సం,స్థితిత్వంబును దీర్ఘపటుఁయుగ" (6-143) ఇత్యాదిగా ముద్రితం. ప్రాసలో కతిపయాహంన్సామ్యం శ్రీనాథ సమ్మతమని యెవ్వరూ తలంచలేదు. ఇది శివకవుల భాషావిశేషం అన్నది ప్రస్తుత చర్చనీయాంశం కాదు. శ్రీనాథుడు వాడడనేదే ప్రకృతం. కాబట్టి 'కార్యార్థసం,సిద్ధత్వంబు సుదీర్ఘపటుఁయుగ' కవిపాఠం కావచ్చు. "అర్థః.. వస్తు...ప్రకారః 'ఇతి హేమచంద్రః" శబ్దకల్పద్రుమం. కార్యవస్తువుయొక్క సంసిద్ధి ప్రకారం అని అర్థం సరిపెట్టవచ్చునని తోచుతున్నది. సాధుపాఠం పండితులు నిర్ణయించాలి. రెండు నాలుగు పాదాల్లో 'అనచిచ' అనే పాణిని సూత్రము చెప్పిన ప్రాసనియమం సరిపెట్టవచ్చు. ఇది యింకా విచార్యం.

తామరపాకు :

'ప్రజతామరపాకు నీటిభంగిఁ దలంకెన్' (6-179) అని నూ. ము. లో ఉన్నది. పూ. ము. లో కూడా 'తామరపాకు' అనే ముద్రితమైనది. ప్రౌఢవ్యాకర్త నిరాధారంగా పుగాగమం విధించడం యీ అపపాఠానికి మూలం. 'తామరయాకు' అనేదే సాధువు.

పెక్కండ్రురు :

'పెక్కండ్రు రంతఃపుర,స్థాయుల్' (6-226) అన్నది తప్పు. 'పెక్కండు రంతఃపుర,స్థాయుల్' అనాలి. ప్రౌఢ వ్యాకర్త 'ండ్రురు' అంగీకరించాడు. 'ండ్రురు' అసాధువు 'డురు' సాధువు. 'కోడండ్రురు' మొదలైన అతడంగీకరించిన రూపాలు తప్పులు. అవన్నీ 'కోడండురు' అనేరీతి నుండడమే ప్రామాణికం.

పుష్ప కోమలులు:

'పుష్పకోమలులఁ జంపుట శౌర్యమే (6-234) అని ముద్రించారు. ఇలాగే తిక్కన భారతంలోను ముద్రించారు. 'పుష్పకోమలల' అనాలి. నిర్వాహక ప్రయోగం చూపనిదే అచ్చులో ఉండడమే ప్రమాణీకరించి 'పుష్పకోమలి' వంటివి సాధువులన సరికాదు. 'కుసుమ కోమలయంగ, మలయంగఁజేయ' (హ. న. 4-41) అనిన్నీ, "పుష్పకో, మలలేడమలలేడఁ దలిగుఁబోఁడి" అనిన్నీ (నరస 5-145) ప్రబల ప్రయోగాలు కనబడుతున్నాయి. కాబట్టి నిర్మూలంగా 'పుష్పకోమలులు' ముద్రించరాదు. 'పుష్పకోమలలు' అని సంస్కరించాలి.

ఎవ్వం, డువచించును:

"ఎవ్వం, డువచించును వాఁడు ధన్యుఁడు ముని ప్రవరా" అనే పాఠంతో కూచిమంచి తిమ్మకవి ఉదాహరించాడు. బాలవ్యాకరణ విరుద్ధమన్న తలంపుతో 'ఎవ్వండు వచించును' అని సంస్కరించారు. ఇది అనావశ్యకమైన సంస్కారం. విస్తరమునకు ప్రౌఢ వ్యాకరణం చూచేది.

ఒక్కఁడ:

'అటవి ఖండించు మనుజుఁడొక్కఁడ యఘుంబు' (6.288) అని ముద్రించారు. యతిభంగం కూడా గుర్తించలేదు. 'ఒక్కట నఘుంబు' కవిపాఠం కానోపును. 'ఒక్కటన్-వెంటనే' అని అర్థం.

అల్లుండ్రు:

'దక్షు నల్లుండ్ర మెడల నస్త్రములఁగట్టి' (6-89) అని యున్నది. 'అల్లుండ్రు' తప్పు. 'అల్ల' శబ్దం పగతాదులలోనిది కాన 'అల్లుగు' ఒప్పు. 'దక్షు నల్లుర' కవిపాఠం.

డాంబికునకు:

'డాంబికున కుద్ధతునకు నధార్మికునకు' (7.219) అని ముద్రించారు. 'దాంబికునకు' అని సరిచేయాలి. లేకపోతే యతిభంగం.

అప పాఠాలు ఇంకా యింకా యెన్నో ఉన్నాయి. ఒక కొన్ని, స్థలాంతరాల్లో ప్రకటితములైయున్నాయి. (1) 'కాశీఖండము-ముద్రణ సంస్కారము. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక. దుర్ముఖి - మార్గశీర్ష పుష్యమాస సంచిక. (2) కాశీఖండ విమర్శనము. జులై 1958 స్రవంతి (3) ఇంకా అక్టోబరు 1958 స్రవంతి. ఈ వ్యాసాలు చాలా పాఠములను నిర్ణయిస్తున్నాయి. ఈ యన్నింటినీ పరిశీలించి శేషించిన పాఠాలను గూడా నిర్ణయించుకొని కాశీఖండాన్ని యీసారి ముద్రిస్తే నిర్దుష్టం కావడాని కవకాశం ఉన్నది. ముద్రణాలు సుపరిష్కృతాలు కాకపోతే యెన్నో అనర్థాలు కలుగుతాయి. కాబట్టి పరిష్కర్తలు సంస్కార విషయంలో మిక్కిలి జాగరూకత వహించాలని మనవి.

# మరియా పుత్రుడు

## శ్రీ బి. పురుషోత్తం

ఉదకమ్ముల్ నిలయమ్ముగా వెలసినా వోంకార శబ్దంబవై
మొదటన్ లోకభవంబు ముందు; నరులన్ బుట్టించి పోషించుచున్
దుదముట్టింప గలానివయ్యు నరుప్రాదుర్భావమున్ బొంది కా
ముదివైనావు జగద్విచార తిమిరమ్మున్ జీల్ప క్రీస్తుప్రభూ.

ఆదామున్ గరుణించి యాతనికి సాహాయ్యంబు గావింప నీ
వాది స్త్రీని సృజింనా వతని శల్యంబున్ బెకల్చి ప్రభూ
ఏదోపుణ్యమటంచుఁగాని తుదకా యెమ్మెగదా బల్లెమై
నీ దివ్యాంగముఁ గ్రుచ్చెఁ బార్శ్వమున ఆనీసిల్వపైనన్ ప్రభూ.

తినవచ్చంచును జెప్పినట్టి ఫలముల్ దిక్కుల్ మిటారించి యా
వనమందెల్లెడ వ్రేలుచుండ వలదోవద్దంచు నీవన్నవే
తినె నాతొల్లిటి తల్లి హవ్వ, మఱియున్ దిన్పించె నాదాముచే;
వనితా లౌల్యము ముంచె సర్వనరులన్ బంచత్వవార్ధిన్ ప్రభూ.

వ్యాళంబాడిన మాట నమ్మి కనువిప్పౌనంచు నాసించుచున్
వాలుంగంటి యొకండు రెండు దినె బో, ప్రాథమ్యకుం గొన్ని యీ
నేలా, యిచ్చెను బో సతీత్వమున, భక్షింపంగనేలా యతం
డాలోచింపక, నేరమెవ్వరిది దేవా, క్రీస్తు, మృత్యుంజయా.

కనువిప్పౌనని పాము చెప్పినది నిక్కంబాయె నీ రీతిగా:
తనువుల్ నగ్నము లన్న దృష్టి యపుడుత్పన్నంబుగాన్ సిగ్గుచే
వనపత్రంబులఁ జుట్టినారు వడి దౌర్భాగ్యుల్ విశేషజ్ఞులై;
నినులక్షింపగ దృష్టిపోయి నిలిచెన్ నిధ్యాన మీ మంటిపై.

ఏ పంకమ్మున వారు మున్గగలరం చీ వెంచి వారించితో
ఆ పంకమ్ముననే మునింగిరి పిశాచాకూతసంబద్ధులై;
కోపంబొక్కెడ దుఃఖమొక్కెడ నీ గుండెన్ విదారింపగా
శాపం బిచ్చితి వాసతీపతులకున్ సైతాను సర్పంబుకున్.

ఎన్నో వేల శరత్తు లేగినవి యెన్నెన్నో విధాల న్నరుల్
సన్నాహంబులు చేసినారు కొలపాశంబుల్ విసర్జించి నీ
సాన్నిధ్యమ్మును జేరగోరి; మిపులం జాదస్తు లీ మానవుల్,
నిన్నే రీతిని జేరనేర్తురనఘా నీ చేయి లేకున్నచో.

నగలంబట్టిన దయ్యముం శిరము దన్నంజాలు వాడెవ్వడుం
నరులం లేని కతమ్మునం నరకృతాంతమ్ముమ్మడ్చి పాతాళముం
దరియింపంగలవాడు మానవులలోనం లేనియర్థమ్మునం
మరియాపుత్రుడవైతి వీవు నరజన్మంబంది క్రీస్తు ప్రభూ.

తారం జూచిన ప్రాచ్యపండితులు నిం దర్శింప నుద్యుక్తులై
యూరు ల్పల్లెలు సూచిచూచి తుదకా యూదాపురంబేగి యూ
దారా జెక్కడ పుట్టనంచడుగ శాస్త్రంబుల్ పరీక్షించి యూ
దీరుల్ సెప్పిరి బెత్లెహేము పురమందే పుట్టునంచుం ప్రభూ.

పదియును రెండువర్షములు వచ్చెను నీకు, 'యెరూషలేము'నం
బదవులు నిర్వహించు గురుపండితు లందరు నీదుశాస్త్ర సం
పదగని బొమ్మలైరి పసిప్రాయమునం దటువంటి ప్రజ్ఞ తా
మదివర కెన్నడుం గనని యర్థమునం మరియా సునందనా.

మనుజానీకపు పాపముల్ దొలచి సన్మార్గంబు జూపింపంగా
దన యేకైక కుమారు ప్రాణములనే త్యాగంబు గావింప జా
లిన ప్రేమంబది యెంత గొప్పదవునో లేరెవ్వరీ పృథ్విపై
గణుతింపంగలవారు నాలుగుదిశల్ గాలించి చూడం ప్రభూ.

తిరిపెపుం గూడు సాపడుచు తిప్పలలో తలదాచుకొంచు నీ
వొరులకు మేలుసేయునపు డూరకయే నిను జంపినారనం
తరము మహాప్రభో పరమదైవము నీవని పెద్దగుళ్లు గో
పురములు గట్టినారు, మతి పోయినదా నరజాతికిం ప్రభూ.

---

ఆదాము : ఆదిపురుషుడు, Adam = హవ్వ = ఆదిస్త్రీ - Eve.
యూదాపురము : City of Judaea, Jerusalem.
యెరూషలేము : Jerusalem.

తరగతులైన కంతు బలునాయకు లొండొరు
వాదులాడు వై
ఖరి శుక కోకిలాది విహంగ ధ్వను లొప్పెసురగా
త్కారంబులన్." ఆ. 4.

ఇందుకు మూలభూతమైన తిక్కన్నగారిపద్యము.

"నెసనెస నిద్రవోంది కనువిచ్చిన పొంనులమీద
దాడివోఁ
దపబపె నొండొరుం బిలుచు దర్పకుపంపు బలంబు
లోని య
ల్కుడు కరణిం జెలంగె శుక కోకిల భృంగతతుల్
వనంబులం
దపెనెపఁ బల్కు, కూయు, సొగియింపగ్రమోయగఁ
దద్విరావముల్. ఆ. 2 111.

ఈ మాదిరి భావానుకరణములు మరియు రెండు మూడున్నవి. వీరరాఘవయ్య కొంచెము సొంతముగా వ్రాసిన పద్యమొకటి యుదాహరించిన మంచిదని యుదాహరించుచున్నాను.

"తనకుము న్నే తమంబునడంచు నెలమిమై
నరుణోదయప్రభ నలమె ననగ
తన ప్రభాంశం బతీత దినాంతమున గొన్న
యనల ధామము తానుఁ గొనియె ననగ
సరిజంబులఁ బ్రతిష్ఠాసింపఁ దాల్చిన
లక్ష్మీగుణకలాకలాప మనగ
దినలక్ష్మి పెనయు వేడ్కనలందిన సుఖోప
యోగ కౌక్షేగరాగ మనగ
బరగు నుదయారుణిమ దివ బాలబింబ
సంభృతోల్లాస మంబుజ చక్ర చక్ర
చక్రవాళంబులకు జెల్లొసంగ నుదయ
భాను డొప్పె నభఃపూర్వ భాను దరుమ. ఆ. 4.

ఈ పైన యుదాహరించిన పద్యములను బట్టి వీరరాఘవయ్య కవిత్వము రసనిర్భరమై మనోహరముగా నుండుటను సహృదయులు గుర్తించకపోరన్నచో అది నిష్పేచీ వ్యవహారము.

కవిత్రయమువారి తరువాత భారతమును తిరిగి వ్రాయుటకు యత్నించినవారిలో అనర్వణుడు మొదటివాడు. ఆయన భారతములోనివిగా నొక యిరువది అక్కడక్కడి పద్యములు తప్ప అసలు గ్రంథము లభించలేదు. ద్విపదభారత మధికముగా కవిత్రయము వారి ననుసరించియున్న రెండవ ప్రయత్నము. మూడవ సారి భారతమును వ్రాయుటకు యత్నించినవాడుగా వీరరాఘవయ్య కనిపించుచున్నాడు. మొత్తముమీద కవిత్రయము వారి తరువాత భారతము నంతయు ననువదించిన గౌరవమొక్క శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి గారికే నేటికి దక్కినది. అట్టి ప్రయత్నము చేసిన వారింకను ఇద్దరు ముగ్గురున్నారు. కవిత్రయమువారి భారతము ముందు మరెవరి భారతమును నిలబడుట లేదు. దానికి కారణము వారు కవులు. మిగిలినవారనువాదకులు. కవియైనవాడనువాదకుడైనను నందముగ నే యుండును గాని, అనువాదకుడు కవి యగుటకు మొదలు పెట్టినచో భరించుట చాల కష్టము. భారతము విషయమున నాంధ్రమున నట్టి కష్టపరిస్థితు లేర్పడకపోవుట విశేషము.

వీరరాఘవయ్య వ్రాసిన యథాశ్లోకతాత్పర్య భారతోద్యోగ పర్వమున కొక తాటియాకుల ప్రతి హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తువారి పుస్తక భాండాగారమున నున్నది. దానిని, మచ్ఛ్రేయోభిలాషులును, మిత్రులును నైన డా. బి. రామరాజుగారు మొదట గుర్తించి అందలి యవతారికా భాగమునంతయు వ్రాసికొనివచ్చి నాకు చూపించి దానిని గురించి చెప్పిరి. మరియు నీవా గ్రంథమును నొకసారి జాగ్రత్తగా చూడుమనియు నాతో ననిరి. ఒకటి రెండు వారములు గడిచిన తరువాత ఆ గ్రంథ మచ్చైనదని, ఆ యచ్చు ప్రతిని శ్రీ రామరాజుగారే తెచ్చి నాకిచ్చినారు. ఇప్పటి కరువది సంవత్సరముల క్రితము గద్వాల సంస్థానాధీశ్వరులు శ్రీ రాజా రామ భూపాలరావు బహద్దరు వారిచేత వారి స్వకీయ ముద్రాక్షరశాలయందు ఆ గ్రంథము ముద్రింపబడినది. శ్రీ పుల్లగుమ్మి వేంకటాచార్యులవారిచే "లేఖక ప్రమాద జనితాపశబ్ద దోషంబులు లేనట్లు పరిష్కరింపబడి" ముద్రింపబడినది. అయినను ముద్రణమున దోషము లున్నవి. తెలుగు విజ్ఞాన సర్వస్వము మూడవ సంపుటమునయందీ కవిని గురించి కొద్దిగా వ్రాయబడియున్నది. ముద్రిత ప్రతి ముఖపత్రమునందును విజ్ఞాన సర్వస్వమునందును ఈ వీరరాఘవయ్య వీరరాఘవాచార్యుడుగా పేర్కొనబడియున్నాడు. కవి మాత్రము తా నెచ్చటను ఆచార్యుడనని చెప్పుకొనినది లేదు. కోటికెలపూడివారు వైష్ణవులేనని శ్రీ రామరాజుగారనుచున్నారు. గద్వాలలో ఆ వంశమువారు నేటికిని కలరట. విజ్ఞాన సర్వస్వమునందును నీయన భారతము మొత్తము వ్రాసినట్లుగా చెప్పబడలేదు. భావి పరిశోధకుల కృషి ననుసరించి ఈ వీరరాఘవయ్య వ్రాసిన భారతమన్ని పర్వములు గాని, మరి యితరములైన గ్రంథములు గాని లభించవచ్చును.

# అన్ని రెక్కలు మొలచినట్లు నాకు

శ్రీ మాదిరాజు రంగారావు

అగ్ని జ్వాలా చేలము ముడుతలు ముడుతలుగా
మనోజ్ఞంగా సంపరీవృతమైన నీలాంబుద దేహము
హిమాసార తుషారములు తెలిముత్తెములుగా
చిక్కుళలవలె సంగ్రథితమైన భాసమాన నేత్రములు.

భానూదయ దిశా సమ్ప్రకాశమాన విశాలఫాలము
ప్రకృతి శక్తి సమాహారైక స్ఫూర్తిరేఖ బింబించిన దర్పణము—నేను

ఎటు ప్రసారించినా దృష్టి సమాకర్షించి ప్రత్యణువు
మనస్సును చలింపజేయు మృత్తికామయ వస్తుసమితి
కనులు మూసే వేళ కన్పించి, తెరచేవేళ మాయమై
దివానిశలు చుట్టూ పరిభ్రమించు గ్రహకూటమి

* * * *

మానవుని జన్మకు పూర్వమే సృష్టింపబడి
చపలత్వంలో స్థానమేర్పరచుకున్న నరకం
కాలం వదలిన, ఆరని కన్నీటి నిప్పు కణం
నిశ్చల బ్రహ్మభ బుద్ధిలో బింబించిన స్వర్గం
కాలం ముఖంలో విరిసిన ఆనంద విధురరోచి

ప్రభుదయావిహీనమై తనుకు మాసిన రాతిరి—ఒకవైపు
ప్రభు దయామధురాపాంగ రోచిర్భాసోదయం—మరొకవైపు

సర్వదా ఒక తెలివి దూకుడుచే మేల్కొల్పబడి
ఒక కల్పన తప్ప మూర్తి కట్టని రోదసివలె
కాలసూత్రంతో ఎన్నటికీ విడదీయరాని జీవితం
అతీంద్రియ శక్తిచే సంచరణ చేయు జీవసమూహం

విచార ధారా రమణీయతా ప్రసన్న
జ్యోత్స్నాంశు మాలా మృదులావనత ఆకాశం పైన
దృశ్యమాన శరీర ప్రపంచ సంపిహిత
దృక్త్వ జీవగత చైతన్యము — నేను నా క్రిందభూమి.

# భారతి

భూమిపై గుండెలు ప్రయ్యాలైన పర్వతాలు
ఎక్కడో ఇంకిపోయి లేదా ఆగిన నదీ నదాలు
వస్తువు గుర్తింపగా విలువలేని చేతికందని
ఊహానాక్రమించి అతిక్రమించని నీడలు!

ఇద్దరు స్త్రీ పురుషుల రమ్యముఖ శిల్పాకృతుల మధ్య
ఇద్దరు వైరాయమాణుల మనస్సహజ ప్రేమ సౌందర్యాలపై
ఒక స్వాతంత్ర్యమైన ఊహా చంద్రుని వెతుక అనంతపరిధి
జారిన క్రమ్ముకొనిన సాగిన పొరలు పొరలుగా నీడలు

మృత్యువున కవతలి అవిజ్ఞాత లోకంయొక్క—
నీడలు గుంపుగా తలచబడిన రోజున ఈ ప్రపంచం
ఇచట స్థాపించబడిన సుందర పవిత్ర దేవాలయాలు
దివినుండి జారిన స్మృతిలో వెలిసిన వెల్గుమేడలు

* * * *

రివ్వున డొక్కలో దూసుకపోవు మెరపు బాకులు
నవ్వుల జడితో చిందులు తొక్కు మొగిలు ముఖాలు
నటనాచాతురీ నిగూఢ హాసం పెదవుల పొందికపై
సదా ఒత్తిగిలి ఉండు దుష్టోద్యోగ మనః ప్రకృతివలె
ఎప్పుడు విచ్చిపోవునో తమకైనా తెలిసి చావని
అగ్నిపర్వతాలవలె నున్న ప్రళయాంతస్సారణులు

నవ్వు తెర కప్పి ఎన్నో మానసిక హత్యలు జరిపి
పదనెక్కిన మనస్సులతో నా ప్రక్కన నడిచే మనుషులు
వీరిని చూచి—మానసికంగా వాడి ఈ లోకం వీడి
లతాంత సౌందర్య సృజన శక్తి పరవశత ఊగిపోవు
భూనభోంతరాళ విసృమర భోగవాయు హేలా మూర్తులతో
ఎంతదూరమైనా కలసి మెలసి పోయి తిరిగిరా స్ఫుర్తించదు
ఆకాశం గొంతుతో కలిపి వినిపించు పృథ్వీసంగీతం—విని.

వేయి కళలతో కాలం పెంచుతుంది జీవితపరిణామం
ఎన్నిరోజులు జరిగితే అన్ని రెక్కలు మొలిచినట్లు నాకు!

# కలగూరగంప

## శాకుంతలానువాద వ్యత్యాసాల పరామర్శ

శ్రీ తుమ్మల వేంకటరత్నం

**1959** మార్చి నెల భారతిలో శ్రీ బెల్లంకొండ రాఘవరావు గారు "శాకుంతలము-అనువాద వ్యత్యాసాలు" అన్న వ్యాసము ప్రకటించిరి. వారు అనువాదములనుండి రెండు పద్యములనుమాత్రము ఉదాహరించి వీరేశలింగముపంతులు గారిని, వేంకటరాయశాస్త్రి గారిని తూకము వేయుటకు ప్రయత్నించిరి. అందు వారు వ్యక్తిగత పక్షపాతబుద్ధితో విమర్శ సాగించినట్లు స్పష్టమగుచున్నది. దానికి వారే యిట్లు వ్రాసికొనిరి. "ఈ రెండు తర్జుమాలనుగూర్చి ఇంతగా చెప్పనేలయనగా - ఒకనాడు నటశేఖరులు యడవల్లి సూర్యనారాయణగారును నేనును తెలుగు నాటకములనుగూర్చి మాట్లాడుకొనుచుంటిమి. ఆ సంభాషణలో అభిజ్ఞాన శాకుంతలము తర్జుమాల ప్రసక్తి వచ్చినది. శాకుంతలమునకు సరసమైన తర్జుమా ఒక్క పంతులు గారిదే; శాస్త్రిగారి పద్యములు హాయిగా చదువుకొనుటకు వీలు గాని పెళుసుపాకములో నున్నవి అనిరి సూర్యనారాయణగారు. శాస్త్రిగారి కవిత్వము నారికేళపాకమని కొందరును పాషాణపాకమని కొందరును ఈసడించుకొనుట నేను వినియుంటిని." ఇందు నటశేఖరుల తీర్పు రాఘవరావు గారికి సహింపరానిదైనది. పైగా ఇతరు లీసడించుకొనుట అగ్గిపై గుగ్గిలము వేసినట్లయినది కాబోలు. పంతులు గారు ప్రాసకోసము పడినట్లు వేసినట్లు తికమక పడినట్లు చిత్రించినారు. పంతులు గారికి శబ్దములోని సౌందర్యము గాని ప్రయోగములోని ఔచిత్యము గాని తెలియదనియు, అనువాదమే చేతగాదనియు, నిరూపించుటకు శ్రమ పడినారు. శాస్త్రిగారిపై తమకు గల అభిమానమును గౌరవమును ప్రత్యేకముగా ప్రకటించుకొన్నారు. అది గాక! శాస్త్రి గారన్నను వారి రచనలన్నను ఎవరికి గౌరవము లేదు? వారు కళాప్రపూర్ణులు; మహోపాధ్యాయులు. వారి నాటకములు, వారి వ్యాఖ్యానములు ఆంధ్రభాషకమూల్యాలంకారములు; సాహితీపరులకు పెన్నిధులు. వారి ప్రతాపరుద్రీయమునకు ఉవ్విళ్లూరని యాంధ్రుడు లేడు. వారి ప్రజ్ఞా పాటవమునకు పాండితీప్రకర్షకు తల యూపని అక్షరాస్యుడు లేడు. కాని శాకుంతలానువాదమును పురస్కరించుకొని శాస్త్రిగారిని పంతులు గారి యెదుట పోటికి నిలబెట్టుట తగని పని. విమర్శనా కండూతిచే వారి నిద్దరిని గోదాలోనికీడ్చుట సాహితీరంగమునకు అపచారము చేయుటయే. ఒక్కొక్క రొక్కొక్క రచనలో రాణింతురు. బహుముఖ ప్రజ్ఞావంతులు, యుగపురుషులు, మహాకవులునైన పంతులుగారు ఆంధ్రులకు యుగ యుగాల తపఃపరిపాకముగా లభించిన పుణ్యరాశి. వారు శతాధిక గ్రంథకర్తలయ్యును శాకుంతలానువాదముచేతనే ఆంధ్రసాహిత్యాకాశమున ధ్రువకీర్తి గడించినారు. రసలోలుపులెందరో కవీశ్వరులు మూలమును పంతులుగారి యనువాదముతో జేర్చి పరిశీలించి మిన్నగా అనువదింప యత్నించిరి. కాని యే నాలుగయిదు పద్యములందో తక్క కృతకృత్యులయినవారు లేరు. కనుకనే తక్కిన యనువాదములతో పాటు శాస్త్రిగారి యనువాదము కూడ మాటుపడియున్నది. అంతమాత్రమున శాస్త్రిగారి ప్రతిష్ఠకు భంగము రాదు. వారి రత్నావళి (అనువాదము) పండితప్రకీర్తితము. వారి ఉష (స్వతంత్రము) సిద్ధసుధాప్రవాహము.

రాఘవరావుగారు పై అనువాదములనుండి రెండు పద్యములను మాత్రమే గ్రహింప నేల? ఆ రెండు పద్యములలో మాత్రమే శాస్త్రిగారి అనువాద విశిష్టత వారి మెప్పున కొప్పియున్నదని తోచును. అట్టివి యింకను దొరకియున్నచో అందుదాహరించియే యుందురుగదా! వారి యుదాహరణములలో మొదటిది —

మూలము :

అనాఘ్రాతం పుష్పం కిసలయ
మలూనం కరరుహైః
అనావిద్ధం రత్నం మధునవ
మనాస్వాదిత రసం

అఖండం పుణ్యానాం ఫలమివ
చ తద్రూప మనఘం
న జానే భోక్తారం కమిహ స
ముపస్థాస్యతి విధిః

పంతులు గారి అనువాదము :

వాసనఁ జూడనట్టి ప్రస
వమ్ము, నఖమ్ములఁ ద్రుంపనట్టి నూ
త్నాసమ పల్లవమ్ము, పరు
లానని క్రొవ్విరి తేనె, సూచి వి
న్యాసము లేని రత్నము, మ
హోత్తత పుణ్యఫలంబు, బోలు నా
భాసురగాత్రి సోయగ మె
వండు భుజింప విరించి వ్రాసెనో.

శాస్త్రిగారి అనువాదము.:

ఆనని తావి పూవు, నఖ
రాగ్రము సోకని పల్లవమ్ము, క్రొం
దేనె రసమ్ము గ్రోలనిది,
తీరయి విద్ధముగాని రత్నముల్,
మానిని రూపు, పుణ్యభర
మంజు ఫలమ్మన ఘమ్ము ఖండముల్,
నే నెరుగన్విరించి యెవ
నిం బరిభోక్తను గూర్ప నెంచెనో.

మూలమందు 1 అనాఘ్రాతం పుష్పం, 2 కిసలయమలూనం కరరుహైః, 3. అనావిద్ధం రత్నం, 4. మధునవమనాస్వాదితరసం, 5. అఖండం పుణ్యానాం ఫలం. అని శకుంతలా రూపమునకు ఐదు ఉపమలు చెప్పబడినవి. అందు నాల్గింటి ప్రయోజనమును వివరింపబూని రాఘవరావుగారు 1 పుష్పశబ్ద సారస్యముచే నామె పరిపుష్ట యౌవన, భోగయోగ్య, పద్మినీజాతికి చెందినది. 2 "అలూనం కరరుహైః" అనునది నఖక్షతాది శృంగార చేష్టలను సూచించును. 3 "అనా విద్ధం రత్నం" అనునది సంభోగ ప్రక్రియను సూచించును. విద్ధ శబ్దము సంభోగవ్యంజకము. 4. "మధునవమనా స్వాదిత రసం" అధరామృతము సూచితము. అని వ్రాసిరి. ఇందు ఆయా పదములకు ఆయా అర్థవ్యంజకశక్తి యున్నదని కావ్య పాఠకులెల్లరు చెప్పగలరు. కాని ఔచిత్యమును గూడ పరిశీలింపవలెను. అందగత్తెను జూచిన ప్రతి పురుషునకు అదే యారాటము. అట్లని తుచ్ఛమైన సంభోగవాంఛా వర్ణనమే కాళిదాస మహాకవి లక్ష్యమందుమా? నఖక్షతాలు లేవనియు, క్షతయోని కాదనియు నిరూపించుటయే కవితా ప్రయోజనమా? కాదు. అంతకంటె నుత్తమమైనది సౌందర్యారాధన. సౌందర్యారాధనమే కళోపాసనము. మహాకవులు భగవత్సృష్టిలో రాశీభూతమైన సౌందర్యమును తనివిదీర వర్ణించినారు. నుతించినారు. వారానందించి పాఠకుల నానందపరచినారు. సౌందర్యము స్పర్శనీయము, దర్శనీయము, శ్రవణీయము, ఆస్వాదనీయము, ఆఘ్రాణీయము అను అవస్థానభేదములజెంది పంచేంద్రియ భోగ్యమగును. కాని అన్ని యింద్రియము లొక్కసారిగా ననుభవింపదగు ఏకవస్తు సమాశ్రిత సౌందర్యము సృష్టిలో అలభ్యము. కవికల్పనాశక్తిచే నట్టి మహత్తర సౌందర్యము ఏకత్రసన్నివిష్టమై ఒక్కసారిగా సర్వేంద్రియ తర్పణ గావింపగలదు. కాళిదాస మహాకవి అట్టి సృష్టినే యిందు ప్రదర్శించినాడు. పైన పేర్కొన్న ఉపమానముల ప్రభావముచే శకుంతలా స్వరూపము (శ్రవణేంద్రియముతక్క) సర్వేంద్రియ భోగయోగ్యమైన సుందర ప్రకృతియని స్పష్టపడుచున్నది.

అనాఘ్రాతం, అనాస్వాదిత రసం అను ప్రయోగములచే నాసా జిహ్వేంద్రియముల ప్రసక్తి స్పష్టమగుచున్నది. అలూనం కరరుహైః అనునది స్పర్శభావస్ఫోరకతచే త్వగింద్రియ ప్రసక్తిని, రత్నశబ్దము దర్శనీయత్వవ్యంజకతచే నయనేంద్రియ ప్రసక్తిని స్ఫురింపజేయుచున్నవి. ఇట్లే నాలుగింద్రియముల ప్రయోజనములకొఱకీ మహాద్భుత చిత్రణము గావించియు కవికులతిలకుడు తనివి నొందక పుణ్యానాం ఫలమనెను. పుణ్యానాం ఫలమనుటచే మోక్షశ్రీ స్ఫురించుచున్నది. తత్ప్రాప్తియేగదా మానవుని జన్మసాఫల్యము. అది జనన మరణాతీతమనియు శాశ్వతానంద సంధాయకమనియు ఉపనిషత్తులు ప్రవచించుచున్నవి. నిరంతర తపోయోగాది బహువిధ క్లేశానుభవ పూర్వకముగా పొందదగిన యాఫలమిచ్చుట సులభప్రాప్యమై మర్త్యమును స్వర్గముగా రూపొందింపదలచిన మహాకవి సృష్టి సార్థకమగుచున్నది.

ఈ భావమును చక్కగా గ్రహించి పంతులుగారును శాస్త్రిగారును యథాతథముగా ననువదించియున్నారు. వారి యనువాదములలో గుణదోషముల నెన్నబూనుట సాహసమే యగును; కాని రాఘవరావుగారి విమర్శనమును జూచిన పిమ్మట అందలి కొన్ని వాక్యములను పరామర్శింపవలసి వచ్చినది. అలూనం కరరుహైః అనుచో పంతులుగారు గిల్లుట మాని త్రుంచుట పెట్టిరి. అంత ప్రమాదపు పనికి ఏ నాయిక సహించును? అని రావుగారనిరి. వారికి నఖక్షతాల మీద మోజు కలదు కాబోలు గిల్లుట మొఱటుదనమని తోచలేదు. పైగా లూనమునకు గిల్లుట యర్థమని

గ్రహించి యుందురు. "లూన్ఛేదనే! ఆకిసలయము కాళిదాసు సృష్టిలోను పంతులుగారి దృష్టిలోనుండి చేతబట్టినది కాదు. తీవెయందో తరువునందో ఉంచియే మృదుత్వము మెచ్చబడినది. రావుగారు నఖక్షతాలూహించుట తమ యభిరుచిని వ్యక్తపరచుకొనుటయే. "పరులానని" అని పంతులుగారన్నందుకు రావుగారు శకుంతల తల్లివలె అప్సరోవృత్తి నవలంబించి బహుపురుష సంపర్కము కలిగియుండునా? అని సందేహించినారు. కావ్యరసగ్రహణైక పరాయణులగు సహృదయుల హృదయములకు శకుంతల తల్లి వృత్తిని వెదకెడి సంకలితనపు పోకడ అలవడ నేరదు. ఇట శాస్త్రి గారి "క్రొందేనె రసమ్ము గ్రోలనిది" అను వాక్యమునకు అన్వయ మెట్లు? శకుంతల క్రొందేనె రసమ్ము గ్రోలనిది అని అపార్థము తోచుటలేదా? ఈ ప్రయోగము మెచ్చదగినదా? మరియొక యుదాహరణము :

మూలము :

> చిత్రేనివేశ్య పరికల్పిత సత్త్వయోగా
> రూపోచ్చయేన మనసా విధినా కృతాను;
> స్త్రీరత్న సృష్టిరపరా ప్రతిభాతి సామే
> ధాతుర్విభుత్వమను చింత్యవపుశ్చ తస్యాః.

పంతులుగారి అనువాదము :

> చిత్తరువందు వ్రాసి తగ
> జీవముపోసి విధాత తాను లో
> కోత్తర రూప బృందముల
> నుల్లమునందలపోసి చేసెనో;
> ఇత్తరుణీలలామ మన
> సే డాసి కూడక చెన్నుమీరెడున్
> దత్తను రామణీయకము
> ధాత సమర్థతయుం దలంపగన్.

శాస్త్రిగారి అనువాదము :

> చెలువుగ వ్రాసి దిద్ది విధి
> చిత్తము రంజిల జీవమిచ్చెనో;
> పొలుపులఁగూర్చి మానస వి
> భూతిని కౌతుకియై రచించెనో;
> మెలతుక మేనిఁజూడ పర
> మేష్ఠి ప్రభావము సెంచిమూడ నా
> సెలతుక తోచునొండు తరు
> ణీమణి సృష్టియటంచు నా మదిన్.

మూలశ్లోకమున మూడు భావము లున్నవనియు, బ్రహ్మదేవుడు మున్ముందుగా శకుంతలా ప్రతిమను చిత్రగతను కావించి సత్త్వయుక్తిని ప్రాణప్రతిష్ఠను జేసెనో అన్నది మొదటి భావమనియు,......మనస్సుచే సకల సౌందర్య వస్తుసముదాయసారమును భావించి దానితో శకుంతలను సృష్టించియుండునన్నది రెండవ భావమనియు,......అధిక ప్రతిభావంతుడైన క్రొత్తబ్రహ్మ యెవడో శకుంతలామూర్తిని సృష్టించియుండవలెనన్నది మూడవ భావమనియు రఘుపరావుగారు వివరించియున్నారు. "మూలమునందు విభిన్నములైన చిత్రసృష్టిని పంతులుగారు ఏకము గావించిరి" అని యాక్షేపించినారు. శాస్త్రిగారి తర్జుమాను జూచి వారట్లు భ్రమపడి యుందురు. అంతేగాదు. మూడు భాగములుగా నన్వయించుకొన్నట్లున్నారు. కాని అందున్నది రెండు భాగములే. మూడు కాదు.

శకుంతలా సౌందర్యమును దలంచుచు దుష్యంతుడిట్లాశ్చర్యమును వెలిబుచ్చినాడు. "బ్రహ్మదేవుడు లోకోత్తర రూప బృందముల సౌందర్యసారమును దీసి తెచ్చి, మనస్సుతోనే (తూలికతో గాదు) మలచి చిత్రమునందు జేర్చి జీవముపోసి చేసినట్లున్నాడు" ఇదంతయు ఒక యంశము. శ్లోక పూర్వార్థమంతయు నిది. ఇందు సౌందర్యసారమును దెచ్చుటయు, మనస్సుతోనే చిత్రించుటయు, జీవము పోయుటయు ఒక్కసారిగా జరిగినవి. కనుక చిత్రము వొక్కటే యేర్పడినది. రావుగారు చెప్పినట్లు సౌందర్యము లేకుండ ప్రాణప్రతిష్ఠ గావింపబడిన చిత్రమొకటియు, పొలుపుల గూర్చి మానస విభూతిని రచించిన ప్రాణము లేని చిత్రమొకటియు నిందు గాంచజాలము. మరియు శాస్త్రి గారు "చెలువుగ వ్రాసి దిద్ది" అనుటచే పొలుపుల గూర్చుటయునందే జరిగిపోయినది. కాగా నా ప్రయోగము పునరుక్తి ప్రాయము. శ్లోకములోని ఉత్తరార్థమంతయు నొక యంశము. ఇందు శాస్త్రిగారు తమ యనువాదములో "మెలతుక"ను "సెలతుక"ను నిల్పి రెండు "చూడ"లను బెట్టి పూరించినందున ఆ భాగము నడక కుంటువడినది. మూలమున కనుగుణముగానున్నది పంతులుగారి పద్యము.

కవులు కావ్యముల ననువదించునప్పుడు మూలమందలి పదజాలమంతయు తెనుగులోనికి వచ్చినదా? లేదా? యని చూడరు. అందలి కవి హృదయమును మాత్రము గ్రహించి రచన సాగింతురు. భావస్ఫూర్తితో ఔచిత్యమును పాటించుచు రసపోషణ గావించి రసికలోకమున కందింతురు. అట్లే పంతులుగారును అటనట మూలమందలి కొన్ని పదములను జారవిడచిరి. అయినను శిల్పచిత్రణమందు గాని, రసపోషణమందు గాని లోపము జరుగలేదు. మృదుమధురమై రసమహితమై ధారావాహికగా సాగిన యీ కవితలో ప్రత్యేక పరిశ్రమతో వెదుకు వారికి అల్పాల్పములగు సెరసులు దొరకకపోవు.

> "ఏకోహిదోషో గుణసన్నిపాతే
> నిమజ్జతీందోః కిరణేష్వివాంకః"

# అచ్చెల్ల శబ్దవిచారణ

## శ్రీ మల్లెల నారాయణ

సీ. ఉదయాద్రి వేగ సహస్యుద్ధతి సాధించె
  వినుకొండ మాట మాత్రాన హరించెఁ
గూటము ల్వెదకంగఁ గొండవీ డగలించె
  బెల్లముకొండ యచ్చెల్లఁ జెఱిచె
దేవరకొండ యుద్ధృత్తి భంగము సేసె
  జల్లిపల్లి సమగ్ర శక్తిఁ గాల్చెఁ
గినుక మీఱ గనకగిరి క్రిందుపడఁ జేసెఁ
  గంబంబుమెట్టుఁ గ్రక్కునఁ గదల్చె
తే. బలని కోయను కోలిముట్టుల నహించు
  గటకమును నింక ననుచు నుత్కళమహీశుఁ
డనుదినమ్మును వెఱచు నెవ్వనికి నతఁడు
  రాజమాత్రుండె శ్రీకృష్ణరాయ విభుఁడు.

(ప్ర. శ్వా. 23 వ పద్యము)

ఈ పద్యము ముక్కుతిమ్మన్న కవి "పారిజాతాపహరణ" కావ్యకృతిభర్తయైన శ్రీ కృష్ణదేవరాయని వంశవర్ణనలోనిది. దీనికి మొట్టమొదట పండితులైన కీ. శే. నాగపూడి కుప్పుస్వామిగారు "పరిమళోల్లాస సహిత"మన్న పేరుతోను, ఇటీవల విద్వాన్ శ్రీ దూశి రామమూర్తిశాస్త్రిగారు సంపూర్ణ టీకతోను వ్యాఖ్యానించి వెలువరించిరి. పై వారిరువురును తమ టీకలలో రాయలీ పట్టణములను జయించెనని వివరించుచు "రాయలు అచ్చుమాదిరినున్న బెల్లముకొండను రూపుమాపెనని వ్రాసిరి." ఇది కొంత విచారింపదగినదే. ఇక్కడ మనము రూఢిగా అర్థము చేసికొనవలసినది అచ్చుమాదిరిగానున్న బెల్లముకొండను జయించి చెఱచినాడని గాదు. 'అచ్చెల్ల'యన్నది ప్రత్యేకించి వేరే గ్రామము. ఇప్పటికిని గుంటూరుజిల్లా బెల్లముకొండకిరువదిమైళ్ళ దూరములో పాడుబడియున్నది. అందలి ప్రాచీన దేవాలయాలు శిథిలమై భూగర్భమున నిద్రించుచున్నవి. అద్దానిని విజయనగర చక్రవర్తులకు మునుపు చాళుక్యులు, రెడ్లు, సామంతులు పరిపాలించినారు. శ్రీకృష్ణదేవరాయలు సింహాసన మధిష్ఠించి రాజ్యపరిపాలన గావించు రోజులందు "తడి చిన్న నాగమనాయుడన్న నాయకరాజొకడు పాళెగాడై తిరుగుబాటొనర్చినాడు. ఇది చూచి రాయలు కోపోద్దీపితుడై తన జైత్రయాత్రలో అచ్చెల్లను ముట్టడించి వానిని మట్టుపెట్టి ఆ గ్రామమును బట్టుకొనినాడు. నా చారిత్రక గురువర్యులైన కీ. శే. మానవల్లి రామకృష్ణకవిగారు సేకరించిన ఆ గ్రామపు చెన్నకేశ్వరస్వామి దేవాలయమునందలి శిలాశాసనములో

"శ్రీ శ్రీ శ్రీ శ. క. 1423 రాజాధిరాజ రాజమార్తాండ జగనొబ్బగండ మహామండలాధీశ శ్రీకృష్ణరాయ మహీపాల... భూరి... జైత్రయాత్ర హేతుగా అచ్చెల్లపురీ దండితముగడి, చిననాగమ మగండి శిరఖండిత హతమి.. మునిదె" అని యున్నది. ఇంకనూ గుంటూరుజిల్లా ప్రాతకైఫీయతులలో (Sexon IVX)=తడిక నాగమనాయునికి వీరనరసింహరాయలు వెల్లికందర మాన్యముతో ఒసగిన అచ్చెల్లిపురము" అని పేర్కొనబడినది. తంజావూరి గ్రంథాలయ కన్నడ తాళప్రతులలో="అరసు నారసింహ చరితగళు" అన్న చాలా పురాతనమైనట్టి పదకవిత్వ ప్రతి యొకటున్నది దాని కర్తయెవరో ఆమూకి లేదు.

"బెలగొండె అచ్చల్లి
ఉదిగొండె ఊళ్లి (ఊడవల్లి)
కదిగొడిగి శ్రీరాయ క్రిష్ణరాయ
బిట్టొండి హెబ్బిసకుడిసె
కివిబినుసు నారసింహ
కివిబినుసు కివిబినుసు."

అని వ్రాయబడినది. తాళప్రతి పురుగులు తొలచటముచే అందలి యక్షరములు విస్పష్టముగా నగుపించుటలేదు. ఆ వ్రాసిన కవియొక్క భావము యేమైయుండునని నిదానముగా నాలోచించినచో శ్రీకృష్ణదేవరాయలు బెల్లముకొండ, అచ్చల్లి, ఉదిగొండ, ఊడవల్లిని బాగా వేచివేచి కాచికాచియుండి కడకు నొక్కమ్మడి వానిమీద కెగసి కసిదీర్చుకొనెనని తెలియుచున్నది. అందులకే చివరిపాదములో "నెవినికి, ంచి వినవ గూర్య నారసింహ విను వినూ" అని సంబోధించినాడు. రచనాశైలిని బట్టి యిది 16 వ శతాబ్దము నాటిదని తోచుచున్నది. కనుక "ముక్కుతిమ్మన," 'అచ్చెల్ల' అను దుర్గమునే నిర్దేశించెనని తోచుచున్నది. ఆదియున్నది బెల్లముకొండకు సమీపమునందే నని భాష ఋజువు చేసితినిగదా!! తిమ్మనార్యుడు ప్రతిపాదమునను రెండు రెండు దుర్గములనే ప్రస్తావించెనుగదా! మరి — యొక పాదమున మాత్రము — మూఁడు దుర్గములు జోడించియుండడు గదా! అది ప్రక్రమభంగము గదా! యనవచ్చును. కాని యిచట 'అచ్చెల్ల' దుర్గమును 'శ్లిష్టము'గా సూచించినాడని యొప్పుకొన్నచో అది గుణాధానమే యగును. ఇంతకును సహృదయులీయర్థము గమనింపవలెను.

# గ్రంథ విమర్శనము

## మధూదయము

పద్యకావ్యము. కర్త–సాహిత్యవిశారద, కవిరాజ శ్రీ ఉప్పాడ రాజారావు, ఎం. ఏ. డెమ్మీ సైజు 4+118+540 పుటలు. మేలు కాగితము–క్యాలికో బైండు. వెల రు. 12.50 ప్రకాశకులు—శ్రీ హనుమంతరావు, తలగాం, శ్రీకాకుళంజిల్లా.

ఇందులో రమారమి రెండువేల ఏడువందల గద్య పద్యాలుగల పదకొండు ఆశ్వాసాలలో నేటి శ్రీకాకుళంజిల్లాకు చెందిన ఒక ఉత్తమ కాళింగవంశపు జీవిత చరిత్ర వర్ణింపబడినది. అది యిదీ—

"బాహుదా, గోస్తనీనదులమధ్య వుండే ప్రాంతానికి మధ్యకళింగం అని పేరు. అందు కాళింగులనే జాతి క్షత్రియులు ఉన్నారు. పూర్వం వారు యుద్ధవీరులుగా వుండేవారు. ప్రస్తుతం భూస్వాములై కర్షకవృత్తిని అవలంబించి జీవిస్తున్నారు. శ్రీకాకుళప్రాంతంలోని పుష్పపురంలో ఆ జాతికి చెందిన సుభద్రా నరసింహవర్మలనే దంపతులు నివసిస్తూ వుండేవారు. వారికి మాధవవర్మ అనే కుమారుడూ, మరికొంత కాలానికి లక్ష్మి అనే పుత్రికా కలిగినారు. నరసింహవర్మకు రోహిణి చెల్లెలు. ఆమె భర్త రామవర్మ. ఆ దంపతుల కుమార్తె మాలతి. సుభద్ర చెల్లెలు సీత. ఆమె కాపురము ఇచ్ఛాపురము. ఆనందుడామె కుమారుడు. వయస్సులో ఆనందుడు మాధవునికంటె కొంత చిన్నవాడు. మాలతి మేనత్త యింటనే పెరుగుతూ వుండెను. పిల్లలందరూ పరస్పరం ఎంతో ప్రేమగా ఉండేవారు. మాధవుడూ, ఆనందుడూ శ్రీకాకుళం హైస్కూలులోనూ, కాలేజీలోనూ చదివి పట్టభద్రులయ్యారు. ఆ తర్వాత విశాఖపట్నంలో మాధవుడు తెలుగు ఆనర్సు చదువుటకూ, ఆనందుడు ఎం. బి. బి. ఎస్. చదువుటకూ నిశ్చయించుకున్నారు.

సెలవులలో అందరూ పుష్పపురంలో కొన్నాళ్లు గడిపినారు. స్త్రీవిద్య అందరికీ యిష్టమే! అందువల్ల తగిన సౌకర్యాలు వున్న ఇచ్ఛాపురంలో మాలతీ, లక్ష్మి ప్రయివేటుగా మెట్రిక్యులేషన్ పరీక్షకు చదువుటకు తీర్మానించారు. ఆ విరామదినాలలో ఒకసారి బారువ సముద్రతీరానికీ, ఉద్యానానికీ (ఉద్దానమనే గొప్ప తోట) వెళ్లి వినోదంగా కాలం గడపాలని తలచి పెద్దల అనుమతిని పొందారు. మాధవానందులతోపాటు మాలతీ లక్ష్మి కూడా ప్రయాణమయ్యారు. దారిలో వున్న కవిటిగ్రామంలో భూస్వామీ, తమ కాళింగులలోని అంతశ్శాఖీయుడూ అయిన కూర్మినాయుడితో వారికి పరిచయం కలిగింది. అతని ఇంట్లోనే ఆ రాత్రి వుండి ఆతిథ్యం స్వీకరించారు.

కూర్మినాయుడికి వెంకమ్మ ఒకే కూతురు. ఆమె విగతభర్తృక. ఆమెకు రాధ అనే రూపవతి అయిన కుమార్తె యుక్తవయస్సు వచ్చినది ఉన్నది. రాధ చూపులూ, ఆనందుడి చూపులూ కలుసుకున్నవి. ఒకరిపై ఒకరికి అనురాగం ఏర్పడినది. దీన్ని అందరూ గ్రహించారు. మాలతిని మాధవుడు వివాహమాడడానికి చిన్నప్పుడే పెద్దల నిర్ణయం జరిగినది. వయస్సు వచ్చిన కొద్దీ మాలతీ మాధవులకు పరస్పరానురాగం వృద్ధిపొందినది. ఇట్టి స్థితిలో ఆనందుడికి కూడా తగిన కన్య లభించినందుకు వారంతా ఆనందించారు. అంతశ్శాఖా విభేదాన్ని పాటించకుండా పెద్దలను సమ్మతింపచెయ్య వచ్చుననే ధైర్యం వాళ్లకు ఉన్నది.

మర్నాడు ఉదయం, వారు విహారానికి బయలుదేరుతూ, తమతో రాధను కూడా పంపవలెనని నాయుడిని కోరారు. కూర్మినాయుడూ, వెంకమ్మా దీనికి సమ్మతించారు. వారు ప్రకృతిశోభ తిలకిస్తున్నప్పుడు రాధ ఒక సరస్సులోని తామరపువ్వు తియ్యడానికి లోనికి దిగి, జారి మునిగిపోగా, ఆనందుడు ఆమెను రక్షించాడు. ఈ సంఘటన వారి పరస్పరానురాగాన్ని వృద్ధి పొందించినది.

జరిగిన ప్రమాదమునకు కూర్మినాయని కుటుంబం అందరూ విచారించి, ఆనందుని సాహసాన్ని అభినందించారు. మాలతీలక్ష్ములతోపాటు రాధను కూడా విద్యాభ్యాసం కొరకు ఇచ్ఛాపురానికి పంపవలెనని కూర్మినాయుడినీ, వెంకమ్మనూ కోరగా, వారు దానికి సమ్మతించారు.

మాధవుడు తెలుగు ఆనర్సు ప్యాసయిన తర్వాత లిటరేచర్ (ఇంగ్లీషు) ఎం. ఏ. చదవడానికి హైదరాబాదు వెళ్లాడు. అప్పటికి ఆనందుని చదువింకా పూర్తి కాలేదు. రాధ, లక్ష్మి, మాలతి మెట్రిక్యులేషను

ప్యాసయి శ్రీకాకుళం కాలేజీలో ఉన్నత విద్య నేర్చుకొనసాగారు.

హైదరాబాదులో మాధవవర్మకు సహాధ్యాయిని మధుకుమారితో పరిచయం ఏర్పడినది. ఆమె కరణాల కులానికి చెందిన ఐశ్వర్యవంతురాలు. తల్లిదండ్రులు లేనిది. ఆమె మాధవుని ప్రేమించింది. అతని హృదయం మాలతికి దత్తమైనట్లు పాపం, మధుకుమారికి తెలియదు. మొదట్లో వేరే బసలో వుండిన మాధవుడు తర్వాత మధుకుమారి యింట్లో పై బస పెట్టినాడు. సంక్రాంతికి మాధవుడు పుష్పవరమునకు వెళ్ళగా, పరిశోధన నిమిత్తం చెన్నపట్నం వెళ్ళిన ఆనందుడు తిరిగి వస్తూ, దారిలో అన్నను చూడడానికి హైదరాబాదుకు వచ్చాడు. అతని మూలంగానే మాలతిని మాధవుడు చిన్నప్పటినుంచీ ప్రేమిస్తున్నట్లూ, వారిద్దరి వివాహమూ నిశ్చయమైనట్లూ మధుకుమారికి తెలిసి, ఆమె దిగ్భ్రాంతి అయింది. తన ఆశ నిరాశ అని అప్పుడు ఆమె అనుకున్నది. అనారోగ్యంపాలయింది. వెంటనే హైదరాబాదుకు రావాలని ఆనందుడు మాధవుడికి వైరిచ్చి, తాను వెళ్ళిపోయాడు. మాధవుడు విమానం పైని తొందరగా వచ్చి మధుకుమారికి సదుపదేశాలు చేసి, ఆమెకు మనశ్శాంతిని కలిగిస్తాడు. మధుకుమారి శాంతి పొంది, తాను మాలతి సౌఖ్యానికి అడ్డుగా వుండకూడదని తలచి, తన జీవితాన్ని దేశసేవకై వినియోగించడానికి నిశ్చయించింది.

మాధవుడు మాలతికి వైరియ్యగా, ఆమెయు మధుకుమారివద్దకు వచ్చి ఆమెకు ధైర్యము గొలిపి, విచారమును పోగొట్టెను. మాధవుడు మధుకుమారిని కూడ పెండ్లాడుట తనకు సమ్మతమైనట్లు ఆమె మధుకుమారికి తెలిపినది. కాని మధుకుమారికి అది సమ్మతం కాదు. తనకు మాతృత్వమే అభిలషణీయమనీ, మాలతికి కలిగిన తొలిబిడ్డను తన కిచ్చిన పెంచుకొంటుననీ ఆమె మాలతితో చెప్పినది.

అందరి విద్యలును కొద్ది నెలలలోనే పూర్తి అయినవి. మాలతీ మాధవుల వివాహంతోపాటు రాధానందుల వివాహం కూడా జరపడానికి నరసింహవర్మ నిశ్చయించి తన సంకల్పాన్ని మూర్తినాయుడికి తెలియజేశాడు. అతడు కుమార్తెతో ఆలోచించి, తన సమ్మతిని తెలియజేశాడు. కులంలోని అంతశ్శాఖలను కలుపుతూ వున్న ఈ ఆదర్శవివాహానికి బంధువులందరూ సంతోషించారు. తాను స్థాపించిన సంస్థల ప్రారంభోత్సవం వివాహ సుముహూర్తదినమునందే తటస్థించినందున మధుకుమారి వచ్చి ఆ వివాహాలను కళ్లారా చూచే అవకాశం లేకపోయింది. ఆమె పంపిన కానుకలు మాత్రం వధూవరులకు అందాయి.

కొన్నాళ్లకు మాలతి గర్భవతియై మగశిశువును కన్నది. ఆ బిడ్డ అచ్చంగా మధుకుమారినే పోలివున్నందున ఆ బిడ్డకు ఆ పేరే పెట్టబడినది. 'బారసాల' నాటికి మధుకుమారి కూడా పుష్పపురానికి వచ్చినది. కొన్ని రోజుల బిడ్డను తొట్టెలో పెట్టే వేడుకవరకూ ఆమె అక్కడే వుండినది. ఆ సమయంలోనే మాలతి, తాను భర్తను ఒప్పిస్తాననీ, అభిప్రాయం మార్చుకుని మాధవుని వివాహమాడి తనకున్నూ సంతోషాన్ని కలిగించాలనీ మధుకుమారిని పరిపరివిధాల వేడుకొంటుంది. మధుకుమారి 'ఆలోచించి, తుది నిశ్చయాన్ని చెప్పెదను' అంటుంది. బిడ్డను తొట్టెలో పెట్టే రోజే గడువు. ఆ దినం వుదయం మాలతి మళ్ళీ మధుకుమారిని హెచ్చరిస్తుంది. ఆమె "ఇట్లాన పెట్టుట తగునే? ఒత్తిడి సేయుట యర్హమే?" అని అంటుంది. ఆమె తన నిశ్చయాన్ని తెలపడం లేదు.

బిడ్డను ఊయ్యాలలో వుంచి ఊచే వేడుక వైభవంగా జరిగిపోతుంది. ఆ దినమే మాలతి, మధుకుమారి, లక్ష్మి, రాధ—నలుగురూ ప్రాంతోద్యానానికి విహారానికి వెళ్లారు. అది సూర్యాస్తమించే సమయం. అప్పుడొక ఆబోతు అర్భాటంగా వచ్చి ఒక మారేడు మ్రానును గోరాడగా దానిపై ఉన్న తేనెపట్టు శిథిలమైపోయి తేనెటీగలు చెలరేగి ఆబోతును చుట్టుముట్టి కరిచాయి. అది గంతులు వేస్తూ, రంకెలు వేస్తూ మాలతిని డెక్కలతో కుమ్మివేసింది. శరీరం రక్తమయమై ఆమె స్పృహ తప్పి పడిపోయింది. అందరూ గోలచేసి విచారిస్తూ ఆమెను ఇంటికి తీసుకుని వెళ్లాగ. ఆనందుడు ఆమెకు తగిన చికిత్స చేశాడు. మాలతికి తెలివివచ్చింది. ఆమె తన బిడ్డను మధుకుమారికి అప్పగించి మాధవుడి ఎడమ చేతిలో మధుకుమారి కుడిచేతిని వుంచి 'ఈమె నా చెల్లెలు' అని మాత్రం చెప్పి కన్నులు మూసింది.

ఈ విధంగా విషాదాంతంగా కథ ముగిసింది.

రచయిత క్రొత్త పాతల మేలికలయిక కూర్చి యీ ప్రబంధం వ్రాయాలని పూనుకున్నారు. ఇందులో ప్రాచీనాచార సంప్రదాయాలు పాటిస్తూనే పాత్రలు నవీనపద్ధతులకూ, సంఘ సంస్కరణకూ అలవాటు పడినట్లు కూర్చబడినది.

# గ్రంథ విమర్శనము

అనువాదాలంటే కవికి యిష్టంలేదు. "అనువాదమ్ములు కొల్లలై వెలయఁగా నాంధ్రత్వమున్ గోలుపోవును' అని ఈయన భావన. అందుకోసమే స్వతంత్ర రచన సాగించారు. రచన సరళంగా సాగింది. రసవంతమైన పద్యాలు అక్కడక్కడ వున్నవి. క్రమంగా ప్రజల వాడుకలోంచి తప్పిపోతూ వున్న లోకోక్తులూ, సామెతలూ, నుడికారాలూ ఆయా సందర్భాలలో అనుకూలంగా కూర్చబడ్డాయి.

కాని కథాకల్పనలో మాత్రం చమత్కృతి శూన్యంగావున్నది. దీన్ని అంతటినీ నూరు పుటలలో యిమిడే చిన్న ప్రబంధంగా వ్రాయవచ్చు. కాని, కవిరాజుగారు ఒక పెద్ద ప్రబంధం వ్రాయాలనే నిశ్చయంతో వర్ణనలను కుప్పించి విడిచారు. అందులోను శృంగార వర్ణన కొంత మితిమీరివున్నది. యువకులకంటే యౌవనం అంకురిస్తూ వున్న బాలికల ఊహలు స్వభావానికి విరుద్ధంగా కానవస్తున్నవి. అవివాహితగా వున్న మాలతి—

'చెరఁగుమాసి పంచఁజేరిన వన్నను
రాగదృష్టులందు దోఁగఁజేయు,
మూఁడుదినములందు ముప్పొద్దులును నింక
నట్టి భాగ్యమునకుఁ బెట్టి పుట్ట.' [5—116]

నని తన్నలాటి సమయంలో ప్రియుణ్ణి చూడడానికి పొంగిపోవడం సభ్యతకు లోపం.

తన కింక మానవుడు దక్కడని నిరాశా హృదయయైన మధుకుమారి స్నానం చేస్తూ వున్నప్పుడు తన స్తనాభోగాన్ని పరిశీలించుకుంటూ

'పురుషస్పర్శ నెఱుంగ కిక్రియను మీ
పొంకంబు బింకంబుఁగాఁ
బురుషశ్రీగతి వ్యర్థమయ్యె; శిశువున్
బోషించి సాఫల్య మే
కరణిన్ బొందుదు? రీ వియోగినికి దుః
ఖప్రేరితంబయ్యె, మీ
హానవున్ శోభయుఁ బ్రాణనాథు మృదు ది
వ్యస్పర్శ చేకూఱమిన్.' [11—9]

అని 'ఆత్మగతభావము రొమ్ముల కేర్పరించుచు' వాటిని సంబోధించి పలుకుట చంద్రరేఖావిలాపంలోని చంద్రి ఊహలని తలపునకు తెస్తున్నది. మధుకుమారుడు తన్ను పోలి వుండడం చూచి, ఆమె మాలతితో పలికిన మాటలు కూడా అసభ్యంగానే వున్నవి.

ఇందులోని కొన్ని సంఘటనలు స్వభావ విరుద్ధంగా వున్నవి. ముఖ్యంగా-బాలెంతరాలయిన మాలతి బిడ్డను తొట్టెలో వేసిన వెంటనే ఉద్యానవనానికి విహారానికి వెళ్లడం ఉచితంగా లేదు. కథ ముగింపు పొందికగా కానరాదు.

"ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశోవాపి తన్ముఖ" మ్మనే మహాకావ్య లక్షణాన్ననుసరించి గ్రంథారంభం శంకర నమస్కారంతో ప్రారంభమైనదనీ, ఇందులో అష్టాదశవర్ణనలూ వున్నవనీ 'పీఠిక'లో వున్నది. ప్రాచ్య లక్షణవిరుద్ధంగా విషాదాంతమైన యీ గ్రంథానికి పయి లక్షణాలను సమన్వయించ నక్కరలేదు.

118 పుటల విపుల పీఠికలో శ్రీ బండారు తమ్మయ్యగారు గ్రంథవిషయాన్నీ, ప్రాశస్త్యాన్నీ విపులంగా వివరించారు. ఆయన "మొత్తముమీఁద నీ కావ్యమును సమగ్రముగ సావధానముగఁ బరిశీలించినచోఁ గవి ప్రతిజ్ఞాపూర్వకముగా గ్రంథావతారికలోఁ బదుమూఁడవ పద్యములో వివరించిన లక్షణముల నెల్లఁ జక్కగా నిర్వహించినాఁడనియు, [స్వస్థానజాతి భాషా సంస్కృతులు, నుడికారంపు సొంపు, పాత్రచిత్రణ, బహువిధవృత్తులు, ఆలంబనోద్దీపనాదిభావముల కలయిక, రససిద్ధి, వచస్సామరస్యయుతిములు,వ్యంగ్యాత్మకములైన సంభాషణలు, అసిధారమైన కథకు బిగువైన సంధి బంధములు, స్థానికప్రకృతి-ఆ లక్షణములు] నా వెనువంటనే—

శ్రుతమతి, విమర్శనాత్మక
సాతత్యశైత్యమును, వినూతనభావ
ప్రతతి వెలార్చెడు శక్తియు
నతి దుర్లభముల్ దలంప; నవి నీకమరెన్. [1-14]

అని కథాశ్రోతయగు సతీమణి పరముగ సాకూతముగఁ జెప్పిన గుణవిశేషము లాతనియందే బాగుగా నమరియున్నవనియు, "జీవితోద్యానవాటి నలరజేయు మధూదయము" మధూదయ మక్షరతః సత్యమేయనియు నా నిశ్చయము. శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగనీని వివిధగుణవిశిష్టత నలవరచుకొనిన యిమ్మహాకావ్యముత్తమ సాహిత్యస్థాయిని గలిగి కవిగారి సాహిత్య విశారద బిరుద మన్వర్థ మొనర్చుచున్నది." అని తమ అభిప్రాయాన్ని తెలిపారు. 'బెట్టుసూపక యల్లుండ్రు రెట్టులత్త" (2-71) అనుచోట మాత్రము బహువచన ద్విరుక్తి సాధుత్వము విచార్యమన్నారు.

ఈ గ్రంథంలో పద్యాల నడక బాగా సాగినా శబ్దసంస్కారం జారినపదాలు చాలా కానవస్తున్నాయి. అశ్లీల దోషజుష్టాలూ ఉన్నవి. ఉదాహరణంగా క్రిందివాటిని గమనించవచ్చును—'మాతాపిత దేశికులు (1-22) వివిధ రుచ్యంబులైన వంటకంబులు (1-169) ఇడి, రాదట మాలతి నామరాజము (2-6) సప్తవింశతి దినమున — (సప్తవింశతి తమమని అభిప్రాయమా?) (2-7) మాట్లాడ నింక బెక్కండ్లు కలవు (2-62) పలువిధ భక్ష్యాగులు (2-77) జిహ్వా సాఫల్య భాషణా శేష భావచయము (3-151) ఆ సమ్మాన పుర

స్వరంబులకు ప్రేమాలాపముల్ నాతిథేయీ సత్కార పరంపర (3-164) తోయధీశుని నైక్యమైపోయె (4-107) కుసుపుల్ నభిముఖవాతసముదితంబగు (4-137) రుచిబారెను నాగ్రముఫలాళి (5-91) ప్రియు పాదనోయిని (5-230) అయిష్టంబైనను (6-7) తుడ్చెద మాలిన్యము (6-14) ముడిని జేనానుచుండ్రోచి (6-76) రాజనాగరిమ (6-110) కతిపయానిసుసలమ్ములకు (7-12) మా మంచిమాట యుంటివి (7 24) ఉచ్చనాకు పెయ్యల కెనయై (7-234) ముడ్డికిఁ జేసంటుట యే దొడ్డతనము (8-61) వేళాపాళయు లేద (8-94) అగిగ్గి, తేనీరమును దెచ్చి (9 22) నిరాపేక్ష్యము (9 220) గతవారంబు (10-143) మనోన్మేషంబునన్ 11-85) తో చెడిని యీ మోహంబు (11-109).

ఇట్టివి కాకుండా మరికొన్ని వున్నవి. అవి థ ధ ల వ్యత్యస్త ప్రయోగాలూ, కళాగ్రుత ప్రకృతి కాల తారుమారూ, తేటగీతి — ఆటవెలదుల పేరు మార్పులూ మున్నగునవి. అవి ముద్రణస్ఖాలిత్యాలని అనవచ్చును. కాని తప్పొప్పుల పట్టికలో అవి కాన రావు.

శ్రీ తమ్మయ్యగారు తమ పీఠిక (పుట 71) లో కన్యాశుల్క నాటక ప్రస్తావన ఎత్తుతూ—"కన్యాశుల్కము నందలి భాష యనేక రూపముల వికృతి నొంది యాంగ్రాంగ్లాది పదముల కూడికచే 'పెక్కు భంగులు వివేకభ్రష్ట సంపాతముల్' అను మాటకు మాటిరియైన దృష్టాంతముగ నున్నది. ఆ నాటకమందలి పాత్రములు గూడ భారతజాతికి విహితములయిన సనాతన సదాచారానువర్తనము గలవి కావు—" అని తీవ్రంగా నిరసించారు. అది అప్రస్తుతం. ఇంతకూ కన్యాశుల్కం దేశానికి ఇచ్చిన ఉపదేశం గొప్పది. అందలి భాష భ్రష్టమైతే—ఇందులోని ఉదాహృత భాగాలు ఏ తెగకు చెందునో ఆలోచించాలి!

శ్రీ రాజారావుగారు ఎంతో శ్రమపడి యీ బృహత్ప్రబంధం రచించారు. దాన్ని ముచ్చటగా తీర్చి దిద్దడంలో కూడా ఎన్నో వ్యయప్రయాసలకు లోనై వుంటారు. ఇంత శ్రమపడినప్పుడు కొంత జాగ్రత్త పరిష్కరించి ముద్రిస్తే అచ్చులోపాలూ, విరుద్ధ ప్రయోగాలూ లేకుండా వుండివుండును. ద్వితీయ ముద్రణంలోనయినా పయి లోపాలు సవరించుకుంటే ఈ ప్రబంధం ఇతోధికంగా ఆదరణపాత్రం కాగలదు.

## పరిష్కారం

కథల సంపుటి : రచయిత శ్రీ ఎం. హీరాలాల్ రాయ్. క్రౌను 16+114 పుటలు. వెల రు 1-50. ప్రకాశకులు : ఖమ్మం జిల్లా రచయితల సంఘం, మోహన్ రోడ్, ఖమ్మం, ఆంధ్రప్రదేశ్.

'ఈ కథలను వ్రాసిన రచయిత తెలంగాణంలోని ఉత్తమ కథకులలోనూ, రచయితలలోనూ ఒకడుగా పేరుపడినాడు. గొప్ప దేశభక్తుడు. ప్రజాహితైకజీవి. ఇదివరలో నూటికి పైగా కథలను వ్రాసి వివిధపత్రికలలో ప్రకటించాడు. అందులో కొన్నిటిని ఏర్చి యీ పుస్తకరూపంగా వెలయిస్తున్నారు. వీరి మాతృభాష తెలుగు కాకపోయినా, తెలుగులో మంచి కృషి చేసి, చక్కని రచయితగా పేరు గడించారు. ఈ సంపుటి లోని కథలు ప్రత్యేక వ్యక్తిత్వం కలిగి ఉన్నవి. సామాజిక సమస్యలు వీటిలో బాగా ప్రతిబింబిస్తున్నవి. ముఖ్యము తరగతి కుటుంబాలలోని యితివృత్తమే వీటికి కథావస్తువు కావడం వల్ల యీ నాటి మన ఆర్థిక పరిస్థితులకు దర్పణంగా వుంటున్నవి.' అని శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు దీనిపైని అభిప్రాయం ఇచ్చి వున్నారు. ఖమ్మం జిల్లా రచయితల సంఘ కార్యదర్శి శ్రీ ఊటుకూరు-రంగారావుగారు ఈ కథలను చాలా మెచ్చుకుని 'పరిచయం' వ్రాశారు.

ఈ పుస్తకంలో పరిష్కారం, ఫుట్ పాత్, గుణపాఠం, సుప్తస్మృతులు, భావి జీవితంలో పరిణామం, ఆదర్శం అనే కథలు ఉన్నవి. ముఖ్యము ఎలాటి అడ్డంకులూ లేకుండా కథను చెప్పకొని పోవడంలో రచయితకు మంచి నేర్పు వున్నది. అయితే కథలలోని కొన్ని సంఘటనలు మనస్సుకు హత్తుకు నేటట్లు లేవు.

ఉదయం తొమ్మిది గంటలనుంచీ రాత్రి తొమ్మిది గంటలు దాటేవరకూ ఆఫీసులో వుండి రికార్డులలో నిమగ్నుడయిన భర్త ప్రతాపరావు జీవితానికి చీదరించుకుని, క్రొత్తగా కాపురానికివచ్చిన లీల చాలా చికాకు పడుతుంది. ప్రతిదినమూ ఆలస్యంగా వస్తున్నందుకు భర్తను అధికంగా కోపిస్తుంది. తిండి పెట్టడానికకూడా నిరాకరిస్తుంది. భర్త తప్పేమీ లేదనే ఆలోచన ఆమెకు లేకపోవడం వింతగా కనవస్తున్నది! తాను ఉద్యోగానికి రాజీనామా యిచ్చి ఫ్యాక్టరీలో పని చెయ్యడానికి ప్రతాపరావు నిర్ణయించగా, ఆమెకు కోపం పోయి, భర్తను అధికంగా గౌరవించి, రాత్రి ఒంటి గంట దాటిన తర్వాత నిర్బంధంగా తిండి పెడుతుంది. ఉద్యోగస్థులకు కొంత స్వాతంత్ర్యం వున్న యీ కాలంలో కూడా పై అధికారులను చూస్తే గడగడ

# గ్రంథ విమర్శనము

లాడుతూ, విధిగా రాత్రి తొమ్మిది దాటేవరకు కాగితాలతో అతుక్కుపోయి వుండడం కొంత స్వభావ విరుద్ధం! ఉద్యోగస్థుడు ఏ విధంగానైనా అధికారి హృదయాన్ని మార్చి, మంచిమార్గంలో పెట్టివుంటే ఈ కథకి మంచి ప్రయోజనం వుండేది. అది చేతగాక ఫ్యాక్టరీ వుద్యోగానికి కుదురుకోవడం ఉచితంగా తోచడం లేదు.

'ఫుట్ పాత్' అనే కథలో రోడ్డు ప్రక్కల ఉన్న పేవ్ మెంట్లపై జరుగుతూవుండే అత్యాచారాలూ, అవినీతి ప్రవర్తనలూ కళ్ళకు కట్టేటట్లు చెప్పబడినవి. ఇది విపులంగా ఆదర్శం కాగలదో బోధపడకున్నది.

'గుణపాఠం' అనే కథలో 'రమేశ్' అనే హిందూయువకుడు, తన ఆఫీసులో తనక్రింద పనిచేసే 'హమీదా' అనే ఆడగుమాస్తాను ప్రేమిస్తాడు. ఆమె కూడా దానికి సమ్మతిస్తుంది. హమీదా అందకత్తె. అంగువల్ల తోడి గుమాస్తాలూ, పై అధికారులూకూడా ఆమెను వలలో వేసుకొనుటకు యత్నిస్తారు. కాని, ఆమె ఎవ్వరికీ లొంగదు. ఇంతలో రమేశ్‌కు మరొక వూరు బదిలీ అవుతుంది. అతడు వెళ్ళిపోయాక ఆఫీసులో హమీదాకు ఒత్తిడి ఎక్కువైనది. అసభ్య ప్రసంగాలు వినలేకపోయింది. విధిలేక ఆమె కొన్నాళ్ళు సెలవు పెట్టి యింటిలో నేకూర్చోవలసివచ్చినది. ఇంతలో రమేశ్ ప్రమోషనుమీద పెద్ద అధికారిగా ఆ వూరికే వచ్చాడు. తిరిగి హమీదా ఉద్యోగంలో చేరింది. తర్వాత రమేశ్ హమీదాను వివాహం చేసుకుంటాడు. క్రింది ఉద్యోగులందరూ తమ ప్రవర్తనను మార్చుకుని రమేశ్ వద్దనే కాకుండా హమీదావద్ద కూడా భయభక్తులతో మెలగుతూ వుంటారు. ఉద్యోగం మానివెయ్యాలని రమేశ్ హమీదాను కోరినా ఆమె మానలేదు. ఇన్నాళ్ళూ తనను నీచంగా చూస్తూ అసభ్యంగా ప్రవర్తించిన ఉద్యోగులందరపైనీ కసి తీర్చుకోవాలని పట్టుపట్టి, తన భర్త అధికారాన్ని ఆసరా చేసుకుని ఆమె అందరినీ నానాచిక్కులూ పెట్టేది. ఆమె చేష్టలూ, మాటలూ ఉద్యోగులకు భరింపరానివైనాయి. అది తెలిసి, రమేశ్ ఎంత చెప్పినా ఆమె వినలేదు. ఆమెను ఒప్పించలేక చివరకు రమేశ్ రాజీనామా చెయ్యవలసి వచ్చినది.

వివాహానంతరం హమీదా ఉద్యోగం మానివేయడంగాని, లేదా ఒకవేళ చేస్తే తోడి ఉద్యోగులను-వెనకటి సంగతి మరచిపోయి మర్యాదను చూపడంగాని జరిగితే, కథ ఎంతో బాగా నడిచి వుండేది; ఆదర్శప్రాయంగానూ వుండేది. భర్తచేత గుణపాఠం చెప్పించుకున్న హమీదా అవ్యక్తతయే ఈ కథలో గోచరమవుతున్నది.

'సుప్తస్మృతులు' అనే కథలో విద్యావతీ, లక్షాధికారి పుత్రికా అయిన శకుంతల మనస్తత్వం



బాగా వర్ణితమైనది. దేశసేవాపరాయణుడైన ప్రదీప్‌ను ఆమె ప్రేమించినది. అతడు ఒక కార్మిక సంఘటనలో ప్రభుత్వం వారి తుపాకిదెబ్బకు ఎర అయినాడు. ఆ విషయం నిశ్చయంగా శకుంతలకు తెలియదు. కొంత కాలం నిరీక్షించినది. తర్వాత ఆమెకు డాక్టరు పాల్‌తో వివాహం జరిగింది. దానికి ఆమె ఆటంకం చెప్పలేదు. కాని, ప్రదీప్‌ను గురించి ఆలోచిస్తూ ఎప్పుడూ విచారంతోనే వుండేది. పాల్‌కు, ఆమె విచారకారణం బోధపడడం లేదు. ఒకప్పుడు, ఆ కాల్పులు జరిగిన మైసూరికి విశ్రాంతి కోసం వెళ్ళదలచి, తన కోరికను ఆమె భర్తకు తెలిపింది. ఆమె యిష్టమే తన యిష్టంగా భావిస్తున్న పాల్ దీనికి సంతోషంతో సమ్మతించాడు. అక్కడ, వీరి ప్రక్కనే వున్న కార్మిక సంఘ కార్యాలయంలో కార్యదర్శినిగా పని చేస్తున్న రమణితో శకుంతలకు పరిచయం కలిగి, ఆమె మూలాన ప్రదీప్‌కుమార్ రెండేళ్ళ క్రిందట కాల్పుల్లో మరణించినట్లు స్పష్టమవుతుంది. స్మారక దినోత్సవానికి తాను ప్రెసిడెంటుగావుండడానికి శకుంతల సమ్మతించి, అప్పుడు పాల్‌కు వెనుకటి సంగతి తెలుపుతుంది. ఆ సభలో పాల్ కూడా ఉపన్యసించి, ఉద్రేకంతో తన ఉద్యోగానికి రాజీనామా యిచ్చి, ప్రజాసేవ చెయ్యడానికి నిశ్చయించాడు. దానితో శకుంతల కలతపాటు పోయినది. ఆమెకు భర్తపై అమితంగా ఆదరాభిమానాలు కలిగాయి. ఎటువంటి ఉన్నతోద్యోగమయినా మానివేసి, సంఘసేవ చెయ్యవలెననేదే దీని లక్ష్యంగా అర్థమవుతున్నది.

సెషన్స్ జడ్జీగారి కూతురు శశి సంఘ సేవాపరాయణురాలు. మహిళోద్యమానికి గొప్ప కృషిచేసి, చందాలవల్ల సంఘానికి ఒక భవనం కట్టించినది. ఒకసారి సంఘంలో ఉపన్యసించడానికి మదన్‌రాయ్ వచ్చాడు. అతన్ని శశి ఎంతో ఆదరించినది. అతని స్వరూప, వాగ్ధోరణులకు ముగ్ధురాలయి ఆమె అతనిని ప్రేమించి, తన అభిప్రాయాన్ని అతనికి తెలియజేస్తుంది. కాని, ఆమె ఇదివరకే ఆనందరావును ప్రేమించి వున్నది. అతడు రాయ్‌కి తమ్ముడు. ఈ సంగతి రాయ్ వ్యక్తం చేసేసరికి ఆమె చకితురాలయినది. రాయ్ ప్రసంగధోరణి విని, ఆమె క్షమాపణ వేడుకొన్నది. ఇదీ "భావిజీవితంలో పరిణామం"

అనే కథకు సారాంశం. దీనివల్ల లోకం నేర్చుకునే విశేష మేమిటో స్పష్టం కాలేదు.

'ఆదర్శం' అనేదే యిందులోని అఖరికథ. అందు నాయకుడు శంకరం. కాంతం అతని భార్య. శంకరానికి నవీన వేష భాషల మీద అంతగా మోజు లేదు. కాంతానికి వాటిపైని ఎక్కువ అభిలాష. వాళ్ల యింట్లో వయసులో వున్న పనికత్తె వుండేది. శంకరం ఆమెతో చనువుగా మాటలాడేవాడు. కాంతానికి అతనిమీద అనుమానం కలిగి, ఆ పనిమనిషిని తప్పించి, ఒక ముసలి దానిని నియమించినది. శంకరం దీనిని లెక్క చెయ్యనే లేదు. ఆ ముసలిది కొద్దిరోజులలో ధనార్థమై తార్పుడు కత్తెగా తయారయింది. శంకరం వద్ద అంపకత్తెల ప్రసంగం తెచ్చేది. ఒకసారి నిర్మల అనే యువతిని ఏదో నెపంతో శంకర కలుసుకునేటట్లు చేసి, నిర్మలచే తన అభిప్రాయం చెప్పించినది. శంకరం ఆమెకు చీవాట్లు పెట్టి బుద్ధి మార్చాడు. తర్వాత ఆ ముసలిది రవి అనే అతనిని కాంతానికి కూర్చడానికి - కొంత ధనంతో కూడా జాబు తెచ్చి కాంతం డ్రాయర్లో వుంచింది. ఆ జాబు శంకరానికి దొరికి, తప్పకుండా రావచ్చునని మిత్రుడైన రవికి వ్రాశాడు. నిర్మలహృదయ యైన కాంతం, రవి జాబునూ, డబ్బునూ చూచి, ముసలి దాసీ దుర్మార్గాన్ని శంకరానికి తెలిపింది. ఆమె క్రోధ మూర్తియై ఆ మిత్రుని ప్రవర్తనను నిందించినది. ఈ సంగతి తెలిసి, రవి - ఇట్టి అవినీతి మార్గానికి దోహదమిచ్చిన తనకు జబాబు తెచ్చిన ముసలిదాన్ని కాల్చి చంపి, తానూ, ఆత్మహత్య చేసుకున్నాడు. ఇందులో భార్యాభర్తల ఉత్తమాదర్శం చక్కగా వ్యక్తపరుపబడినది.

ఈ కథల్లో రచనలో ఆకర్షణ కానరాలేదు. ఒకటి, రెండు తప్ప తక్కినవి లోకానికిచ్చే సందేశమూ స్పష్టం కాదు.

'ఏదైనా, రచయిత లక్ష్యం యెప్పుడూ లోక కల్యాణ లక్షితమై వుండాలన్నది పూర్వంనుండీ ఒక నియమంగా పాటించబడుతూన్నది. దీనిని ఉల్లంఘించడానికి కూడా వీల్లేదు' అనే పరిచయం'లోని వాక్యాలు ఈ విషయంలో గమనించదగవి. రచయిత తన కథా సముచ్చయంలో మంచివాటిని ఏర్చి ప్రకటిస్తే బాగుండును.'

## ప్రాగ్జ్యోతి

తెనుగు కబ్బము, కృతికర్త: శ్రీ కొండా రామచంద్రారెడ్డి, ఎం. ఏ., ఎల్. ఎల్. బి. అడ్వొకేటు, రామమూర్తి నగర్, నెల్లూరు. క్రౌను 16 + 266 పుటలు, మేలురకపు కాగితము, గట్టి బైండు. వెల: మూడురూపాయలు. ప్రతులు గ్రంథకర్తవద్ద దొరకును.

సర్ ఎడ్విన్ ఆర్నాల్డు దొర రచించిన "లైట్ ఆఫ్ ఏషియా' అనే గ్రంథానికి ఇది అనువాదం. ఇందులో బుద్ధుని చరిత్ర సంగ్రహంగానూ, సమగ్రంగానూ ఉన్నది. "బుద్ధుని యుచ్చరితంబును, బోధ సుధయు, మదీయాదర్శములలో మేటి; యతిప్రాసములను నిఱుకొటంబులం బడక, గణమాత్ర బద్ధంబయి, గలగలం బ్రవహించు సరళ కవనంబను సెలయేటి నితర భాషలలోవలెం దెనుంగు దోటలో వెలయింపంజేయుట నా చిన్ననాంటి యాశయములలో నొక్కటి" అని 'అనువాదకులు' తమ 'మనవి'లో చెప్పియున్నారు. ఆ యాశయసిద్ధికై ఈ గ్రంథాన్ని రచించారు. 'సాహిత్యరత్న శ్రీ మోచర్ల - రామకృష్ణయ్యగారు ఈ రచనను ఆద్యంతముం దిలకించి...సవరించి' ప్రోత్సహించారు.

ఈ పుస్తకంలో రచనకన్న కథ ప్రధానంగా కానవస్తుంది. సులభంగా బుద్ధుని చరిత్రను తెలుసుకోవడానికి యతిప్రాస నియమరహితమైన ఈ మంజరీ ఛందస్సు ఉపయోగిస్తుంది. గ్రంథకర్తకు అర్ధానుస్వార, శకటరేఫల విషయంలో పట్టింపు ఉన్నట్లు తెలుస్తున్నది. అట్టివారు యతిప్రాసలను మాత్రం ఎందుకు పాటించలేదో! సహజరచనా పాటవం గల వారికి యతిప్రాసలు అడ్డంకులు కావు. ఇట్టి రచనకు అవి శోభాదాయకాలు! మంజరిని గ్రహించివుంటే యతినైనా పాటించివుండిన మేలు! ఇందులో ఛందస్సయినా, జాగ్రత్తగా గమనించబడినట్లులేదు. ఉదా— 'చప్పునం దాలేచి బిట్టుఅచురిట్లు (పుట 55) 'గట్టిగా బట్టుకొని యేడ్చి నవ్వదము' (పుట 57) 'ఎప్పుడో యెక్కడో యేవిధంబుగానో?' (పుట 78.)

వ్యాకరణం పాటింపబడినదనుకోనే యీ గ్రంథంలో చాలాచోట్ల భగలు తారుమారయాయి. కళాద్రుతప్రకృతికాలు వ్యత్యస్తంగా కానవస్తున్నవి. 'తీక్షణమైన (15) పారవశ్యత (22) ప్రతిమ నిశ్చలత (30) బలకె (36) వార్ధక్యము (66) ఈగలు (78) ఉచ్చైస్స్వరంబు (81) మొదలైన వ్యాకరణ విరుద్ధ ప్రయోగములున్నవి. రచయిత 'అష్టమాధ్యాయము' అనుటకు 'అష్టాధ్యాయ' మనే పలుచోట్ల వాడుటకు కారణమేమో!

ఈ రచన కబ్బంగా కాకుండా వచనంగా తయారయివుంటే ఎంతో బాగుండేది. కబ్బంగా తయారు కావడానికి ఎంతో సంస్కరణం కావలసివున్నది.

Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor : S. Sambhu Prasad.